అపరాధ పరిశోధన అనుబంధం—8

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముగ్గురు మూర్ఖులు

రచన: సుజనశ్రీ

## ఆశను చుట్టిన అరిష్టాలు

రచన: ఏ. వీ. మోహన్రావ్

## న్యాయం మరణించదు!

రచన: రమణశ్రీ

## చైనా దండయాత్ర

రచన: కె. శివరామ్

"ఖైదీ" సీరియల్—మూడవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—8
ఆగస్టు, 1974
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
30-8-74 లోగా పంపితే 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 180 రూపాయలు
హోమ్ డెలివరీ సభ్యత్వ రుసుము 3 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
కంచర్ల రమణ
సుజనశ్రీ
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైద్రాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# ముగ్గురు మూర్ఖులు

సుజనశ్రీ

పోస్టుమెన్ ఫకీరయ్యా తన పాత సైకిలుని ఇసుకలో నెట్టుకుంటూ వెళ్ళి ఆ ఇంటిముందు ఆగాడు.

హైస్కూలు ఇనుప గేటులా పెద్దపెద్ద ఇనుపచువ్వల గేటులోంచి చూస్తూ కేక పెట్టాడు "పోస్ట్" అని.

లోపల్నుంచి ఎటువంటి అలికిడీ లేదు. గేటు ఇనుప గొలుసుతో బంధించబడి, లోపల తాళం బిగించబడి ఉన్నది. విసుక్కుంటూ మరోసారి కేక వేశాడు.

ఈ ఇంటికి ఏనాడూ ఒక ఉత్తరం కూడా రాదు. పొరబాటున ఎప్పుడో ఏడాదికోసారి ఏదన్నా జాబు వచ్చిందంటే ఆ గేటుముందు నిల్చుని తను అరచి అరచి చచ్చిపోవాల్సిందే.

అసలు దాన్ని ఇల్లు అనేకన్నా ఇనప్పెట్టె అంటే బాగా అతుకుతుంది.

కొండ రాళ్ళతో బ్రిటిష్ వాళ్ళు కట్టడంలా ఉంటుంది. ఎత్తైన ప్రహారీ గోడలు, ఎనిమిదడుగుల ఇనుప గేటు ఈ హంగామా అంతా చూస్తుంటే అది ఎంతో భద్రంగా ఉండటంకోసమే ఉద్దేశించి కట్టబడిందని తెలుస్తుంది.

మూడో కేకకు లోపల్నుంచి సమాధానం వచ్చింది. "ఓయ్! ఓయ్! వస్తున్నా!" అంటూ ముసలి నౌకరు రాములు గేటుదగ్గరకు వచ్చాడు.

"ఉత్తరమా ఫకీరయ్యా! నాకా? మా బాబుగారికా?" ఆత్రంగా అడిగాడు రాములు.

"నీకూ నాకూ ఉత్తరాలు గూడానా? ఇది మీ డాక్టర్ గారికే!" అన్నాడు ఫకీరయ్య.

కటకటాల మధ్యలోంచి కవరు అందుకున్నాడు రాములు. అతడి కళ్ళన్నీ దానిమీద నే ఉన్నయ్. ఏనాడూ ఆ ఇంటికి ఉత్తరం రానందువల్ల, సాధారణ ఉత్తరాన్ని చూసినా మరణవార్త తెలిపే టెలిగ్రాంని చూసినట్టుగా హడలిపోవటం మామూలు.

రాములు కంగారుని చూసి నవ్వుకుంటూ ఫకీరయ్య వెళ్ళిపోయాడు.

శ్రీరాములవారికి అంగుళీయకం ఇస్తున్న భక్తశిఖామణి హనుమంతుడిలా రాములు ఉత్తరాన్ని డాక్టర్ విష్ణువర్ధన్ కి అందించాడు.

డాక్టర్ కవరుచించి ఉత్తరం చదివాడు. నిర్లక్ష్యంగా దాన్ని మడిచి డ్రాయరు సొరుగులాగి అందులో వేశాడు.

ఉత్తరంలోని విశేషం చెబుతాడేమో నని రాములు ఆయనవంకే చూస్తూ నిలబడ్డాడు.

"మావ దూరపు బంధువు సుబ్బారావు అనేవాడు

తన భార్యతో సహా మనింటికివచ్చి తిష్టవేస్తాడట.''

''అలాగా బాబూ!''

''వాడ్ని రావద్దని రేపే రాసేయ్యాలి ఉత్తరం!'' అన్నాడు డాక్టర్ ఎక్కడో ఆలోచిస్తూ.

''చిత్తం! అలానే రాయండి బాబూ! ఇక్కడేదో ఊళ్లందరికీ ధర్మసత్తరం ఉందనుకున్నారేమో!'' అన్నాడు రాములు.

కాని డాక్టర్ విష్ణువర్ధన్ ఆ ఉత్తరానికి సమాధానం రాయలేదు. అసలు అతడి వ్యక్తిత్వమే విచిత్రంగా ఉంటుంది.

అతగాడు ఇదివరలో మిలిటరీలో పనిచేశాడు. బహుశా అందువల్లనే మనిషి ఆహారాది విషయాల్లో చాల క్రమంగా ఉంటాడు. మితభాషి. అవసరానికి మించి ఒక్కమాట ఎక్కువ మాట్లాడడు. అజానుబాహువు. ఎర్రగా ఉంటాడు. తెల్లబడిన గుబురు మీసాలు, కండలు తిరిగిన దేహం.

అతడి భార్య చనిపోయి చాలాకాలం అయింది. మొదటి కాన్పులోనే ప్రసవవేదనతో చనిపోయింది. పుట్టిన బిడ్డకూడా బ్రతకలేదు. ఆ తర్వాత ఎందరు వత్తిడి చేసినాగాని అతడు తిరిగి మరో పెళ్ళి చేసుకోలేదు.

తన ఆదాయంలో చాలా భాగంతో మహాబలిపురంలో స్థలాలు కొనేశాడు చాల చవకగా. తర్వాత తర్వాత టూరిస్ట్ డిపార్ట్ మెంటువారు ఆ ఊరిని టూరిస్ట్ సెంటర్ క్రింద డెవలప్ చేసిన తర్వాత అక్కడ హోటళ్ళు చాలా వెలిసినయ్. విష్ణువర్ధనరావు స్థలాలకు బాగా డిమాండ్ వచ్చింది.

అలాగే మద్రాసు నగరంలో కూడా కొన్ని స్థలాలు కారు చవకలో కొన్నవాటిని మంచి ధరకు అమ్మేశాడు.

# 6

మిలిటరీలోంచి రిటైరయిన తర్వాత మహాబలిపురం లోనే ఊరికి చివరగా సముద్రతీరం కనబడుతూండేటట్టుగా రాతి కట్టడాన్ని నిర్మించుకుని, అందులో ప్రశాంతంగా నివసించసాగాడు.

అతడికి కొన్ని లక్షలరూపాయలు వచ్చినయ్ స్థలాల అమ్మకం మీద. వాటిని ఏ బ్యాంకులోనూ వేయలేదు అతడు. నేషనలైజు చేయబడ్డ బ్యాంకులు తాడూ బొంగరం లేని వాళ్ళందరకూ అప్పులిచ్చి కొన్నాళ్ళకు తప్పకుండా దివాలా తీస్తాయని అతగాడి వెర్రి నమ్మకం.

అందుకే కొండ రాతితో 'స్ట్రాంగ్ హౌస్' కట్టుకుని అందులోనే క్యాష్ రూమ్ ఏర్పరచి తన డబ్బంతా అందులో కరెన్సీరూపంలోనే దాచాడని అక్కడి ప్రజలు చెప్పుకుంటారు.

అంతేకాదు, అతడు ఎవరికీ దానధర్మాలు చేసినట్టు గాని, లేదా అప్పివ్వటంగాని చెయ్యంగా ఎవరూ చూడలేదు. అందుకే అతను కాకికికూడా చెయ్యి విదల్చని పిసినారి అని పేరుబడిపోయాడు. ప్రజలు ఎన్ని అనుకుంటేనేం అతడిది నిశ్చింత అయిన జీవితం. విస్కీ త్రాగటం, సిగార్ కాల్చటం తప్ప మరే దురలవాట్లూ లేవు.

# 2

మూడురోజులు గడిచిన తర్వాత మద్రాసునుంచి మహాబలిపురం వచ్చిన బస్‌లోంచి ఇద్దరు దంపతులు దిగారు.

భర్త ఎర్రగా పొడుగ్గా ఉన్నాడు. సన్నటి మనిషి. పీక్కుపోయిన దవడలు, గుంటలు పడ్డ కళ్ళు. మాసిన గడ్డం. ఇవన్నీ అతగాడు ఆర్థికంగా ఇబ్బందుల్లో ఉన్నాడని చెబుతున్నయ్.

భార్య అతనికన్న కొంచెం ఎత్తు తక్కువ. కాని కొంచెం లావు. మనిషి తెల్లగా ఉంది. అందగత్తె అనే చెప్పాలి. యాపిల్ పళ్ళలాంటి బుగ్గలు, గుండ్రటి కళ్ళు, వంకులు తిరిగిన పొడవాటి జుట్టుతో మనిషి సొగసుగా ఉంది.

"అలా చూస్తూ నిలబడ్డావేం! ఆ పెట్టె తీసుకుని నడు!" గదమాయించాడు భర్త.

ఆమె బిత్తర చూపులు చూస్తూ బ్రీఫ్ కేస్‌ని, మరో హ్యాండ్ బ్యాగ్‌ని తీసుకుంది.

అతడు బెడింగ్ భుజాన పెట్టుకుని రెండో చేతిలోకి మరో బ్రీఫ్ కేస్ తీసుకుని డాక్టర్ విష్ణువర్ధన్ ఇంటివైపు నడిచాడు.

డాక్టర్ విష్ణువర్ధన్ నోట్లోంచి సిగార్ తీసి, వచ్చిన వాళ్ళిద్దరివంకా నిశితంగా చూశాడు. ఆయన ఎప్పుడు సైగ చేస్తాడో, వెంటనే వాళ్ళిద్దర్నీ బయటకు గెంటేయాలని ఎదురు చూస్తున్నాడు రాములు.

రాములు డాక్టరు దగ్గర గత పదేళ్ళనుంచీ నమ్మకంగా పనిచేస్తున్నాడు. ఏనాడు చుట్టాల్ని రానివ్వగా చూడ లేదు అతడు.

"బాబాయ్! నీ నుంచీ ఉత్తరంకోసం ఎదురుచూసి 'రావద్దని' జాబురాలేదు గనుక, నీకు అభ్యంతరం ఉండదని మేమే వచ్చేశాం!" అన్నాడు ఆగంతకుడు.

"అలాగా!" అంటూ మళ్ళీ ఇద్దర్నీ మార్చి మార్చి చూడసాగాడు డాక్టర్ విష్ణువర్ధన్.

భార్యకు ముళ్ళమీద నిల్చున్నట్టుగా ఉంది. విదేశీ గూఢచారిని చూసినట్టుగా, అతిగాడు తమని అలా చూడటం ఆమెకు బాధ కలిగించింది. వచ్చినవాళ్ళు తమ లగేజిని గుమ్మంలోనే పెట్టుకుని అలాగే అతడి

ముందు నిలబడ్డారు.

"నేను చెప్పలా ముందరే! ఆయన రమ్మనందే మనం వెళ్ళితే బాగుండదని! ఇక పదండి! వచ్చిన దోవపడదాం!" అంది ఆమె విసుగ్గా.

ఆమె మాటలతో విష్ణువర్ధన్ ఈ లోకంలో పడ్డాడు.

"ఈ అమ్మాయి నీ భార్యా? పేరేమిటన్నావ్ సుబ్బారావ్?" అని అడిగాడు.

"దీని పేరు సుభద్ర బాబాయ్!"

"రాములూ! వీళ్ళ సామాన్లు తీసుకెళ్ళి లోపల పెట్టు. ముందుప్రక్క రెండు గదులూ వాళ్ళకు ఏర్పాటు చెయ్! వెళ్ళి కొళాయి దగ్గర కాళ్ళు కడుక్కోండి."

అంటూ తన క్రింద పనిజేసే సైనికులకు ఆజ్ఞలు జారీ చేసినట్టుగా గబగబా చెప్పేసి ఆ తర్వాత ముఖం ప్రక్కకు త్రిప్పుకుని, కిటికీలోంచి దూరంగా సముద్రం లోని కెరటాల్ని చూడసాగాడు.

వాళ్ళిద్దరూ లోపలకు వెళ్ళారు. వాళ్ళు అటు మళ్ళం గానే విష్ణువర్ధన్ చూపులు సుభద్రమీదకు మళ్ళినయ్. అసలామెను చూస్తూనే అతడు అవాక్కయిపోయాడు. గతంలో చనిపోయిన తన భార్య మళ్ళీ నూతన యవ్వనంతో తిరిగి వచ్చిందా అనిపించింది అతడికి.

తన పెళ్ళిరోజున తన భార్య ఎంత యవ్వనంగా వుందో సరిగా ఈ సుభద్రగూడా అలానే ఉంది. అందుకే వాళ్ళను వెళ్ళిపొమ్మందామని అనుకున్న వాడల్లా తన అభిప్రాయం మార్చుకున్నాడు. ఎందుకు? చనిపోయిన తన భార్యను సుభద్రలో చూసుకుందామని!

అయితే రాములుమాత్రం గొణుక్కున్నాడు ముందు. ఇంట్లో ఇద్దరు మనుషులు ఎక్కువైనారంటే తనకీ పని ఎక్కువౌతుంది. వంట చేయాలి. గుడ్డలుతకాలి. వాళ్ళ

పనులేవన్నా ఉంటేగూడా చేయాలి అని బాధపడ్డాడు.

రెండురోజులు గడిచేసరికి రాములు అనుకున్నట్టుగాకాక, అతని పని ఇంకా సుళువైంది. సుభద్ర వంటపని అంతా చేసేది. దాంతో రాములుకు చాలాభాగం పని తగ్గింది.

సుబ్బారావు మటుకు వేళకు తిండి తినేసేవాడు. ఆ తర్వాత పడుకుని నిద్రపోయేవాడు. సాయంకాల సమయంలో సముద్రపు ఒడ్డుకు షికారు కెళ్ళి వచ్చేవాడు ఒంటరిగా. రాత్రయేసరికి కసిగా, మోటుగా తన భార్యను నలిపేసి, నరాలు వేడి తగ్గాక నిద్రలోకి జారుకుని గుర్రుపెట్టేవాడు.

సంపాదన లేకుండా, ఉద్యోగాలకోసం వేటాడి విసిగిపోకుండా, ఇక్కడే అతడి పని బాగుంది. వేళకు తిండి, ఉండటానికి ఇల్లు,తనకు సుఖాన్నివ్వటానికి భార్య! అతడే ఆఇంటి యజమానిలా నిశ్చింతగా గడపసాగాడు.

సుభద్ర విషయం అలాకాదు. ఆమె, చూస్తూనే విష్ణువరన్ వ్యక్తిత్వాన్ని కనిపెట్టేసింది. అతగాడు కోపిష్టి అనీ, ఏవేళప్పుడు తమని బయటకి గెంటేస్తాడో అని ఆమె భయపడుతోంది.

అందుకే స్వంత కోడలులా మామకు పరిచర్యలు చేస్తోంది. ఉదయాన్నే లేవంగానే టీ కాచి రెడీగా ఉంచటం, విష్ణువరన్ లేవంగానే టూత్ బ్రష్ పేస్ట్ అందించటం, నీళ్ళూ టవలూ ఇవ్వటం ఆ తర్వాత టీ, స్నానం అవంగానే టిఫిన్, మధ్యాహ్నం సరిగా వేళకు భోజనం, అందులోనూ అతగాడికి ఇష్టమైన పదార్థాలు చేయటం. ఆ తర్వాత ఏదైనా నవలగానీ, పురాణంగాని చదివి వినిపించటం, సాయంత్రం అతడికి చపాతీలుచేసి పెట్టడం, నిద్ర పట్టేదాకా న్యూస్ పేపర్ గాని, ఏదైనా ఇంగ్లీషు నవలో, విశ్వనాథవారి సాహిత్యమో చదివి

వినిపించటం, విష్ణువరన్ పడుకోగానే తన భర్త వద్దకు వచ్చి నడుం వాల్చేది.

# 3

"నారాయణరావ్, బి.య్యే.బి.యల్., అడ్వొకేట్" అన్న బోర్డు చదువుకుని ఆ ఇంటి ప్రక్క బంగళాలోనికి కారు పోనిచ్చాడు రాజా.

ఆ బంగళా చిన్నదే అయినా చూడముచ్చటగా ఉంది. చుట్టూ కాంపౌండ్ వాల్, రకరకాల చెట్లూ లోపల గార్డెన్, బోలెడంత ఆవరణ. నూతన దంపతులకు హానీమూన్‌కి అనువుగా ఉంది.

ఆ బంగళా మద్రాస్‌లో ఓ ఫిలిం నిర్మాతది. సీజన్‌లో దాన్ని బాడుగకిస్తూంటాడు ఆయన.

"ఇల్లు చాలా బాగుంది రాజా!"

"నీ సర్టిఫికెట్ ఎవరికీ అక్కర్లేదు. సామాన్లు లోపల సర్ది వంట ఏడుప్! ఆకలిగా ఉంది."

"అంత ఆకలిగా ఉంటే కారేసుకు వెళ్ళి హోటల్ నుంచి క్యారీయర్ తీసుకురాకూడదూ?" లాలనగా ఆమె అంది.

"ఓహో! ఈ రాణీగారు ఏం చెయ్యాలట!" అని వెటకరింపుగా అన్నాడు రాజు. "వేషవ్వేషాలు వెయ్యక చెప్పినట్టు చెయ్యి."

"సరేకాని, ఒక్కటే ఒక్క ప్రశ్న అడుగుతాను. సమాధానం చెబుతావా?"

"ఏమిటది?"

"ఇక్కడకూడా మరో హత్య జరగబోతోందా?"

అతడు కోపంగా చూశాడు. "అంతటి అవసరం రాదులే! వెళ్ళి నీపని చూడురాణీ!" అంటూ బెడ్ మీద

వాలిపోయాడు.

ఆ బంగళాలో ఫారిన్ స్టయిల్‌లో బెడ్స్, కుర్చీలు, కర్టెన్స్, వంట సామగ్రి అన్నీ అమర్చబడి ఉన్నాయ్. వంట సామానం తెచ్చుకోకుండా చేతులూపుకుంటూ వచ్చినా హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు.

గ్యాస్‌స్టవ్ వెలిగిస్తూ ఆమె అంది. "రాజూ! ఈ బంగళా ఎంత బాగుంది. ఈ పరిసరాలు ఎంత ప్రశాంతంగా ఉన్నాయ్. ఇంట్లో ఫర్నిచర్, బెడ్‌షీట్స్, డోర్ కర్టెన్స్ ఎంత అందంగా ఉన్నాయ్. వంటింట్లో సయితం గ్యాస్ పొయ్యి, పాత్రలూ అన్నీ ముచ్చటగా ఉన్నయ్. ఇంతటితో నన్నూ నీపాడు ప్లానుకు స్వస్తి చెప్పి, ఇట్లాంటిచోట స్థిరపడిపోదాం డార్లింగ్!"

"నా తాపత్రయంకూడా అదేగదా రాణి! సరిగా నేను కలల్లో ఊహించే వాతావరణం, పరిసరాలూ ఇవే! ఈ ఒక్కసారికి పని సక్రమంగా పూర్తి అవుతే ఈ బంగళానే కొనేసి హాయిగా బతుకుదాం రాణీ!"

ఆమె వంట మొదలెట్టింది. రాజు టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి నెంబరు డయిల్ చేశాడు.

"టూరిస్ట్ హోటలేనా? ఇవాళుదయమే మద్రాసు నుంచి కనకారావనే వ్యక్తి వచ్చి ఉంటాడు! ఆయన్ను ఫోనులోకి పిలవండి."

ఒక నిముషం గడిచింది.

"హలో రాజూ! నేను కనకాన్ని!"

"గుడ్ మార్నింగ్ పార్ట్‌నర్! ఎప్పుడు వస్తావ్ నువ్వు?"

"నీవు ఎక్కడ మకాం చేసిందీ నాకు తెలీదే!"

"నా అడ్రసు కనుక్కోవటం తేలిక. బీచ్‌రోడ్ మీదుగా వస్తే లాయర్ నారాయణరావ్ బోర్డు ఉంటుంది. ఆ ఇంటికి దక్షిణపు ప్రక్క బంగళా!"

"అలాగా! సరే! చీకటి పడ్డాక, అంటే బహుశా ఏడు ఏడున్నరకు వస్తాను. అంతా ఓకే!"

"ఇంతవరకూ ఓకే! మిగతావి ముఖాముఖి మాట్లాడు కుందాం! బై బై!" అంటూ ఫోన్ పెట్టేశాడు రాజు.

## 4

రాత్రి ఏడైంది.

ఓల్డు మోడల్ ఫోర్డు కారు రోడ్డుమీద దుమ్ము లేపుతూ వచ్చింది.

అందులోంచి కనకం దిగాడు. అతడు సన్నగా ఉన్నా ఎముకపుష్టి గలవాడు. ఎప్పుడూ సీరియస్‌గా ఆలోచిస్తూంటాడు. కళ్ళు ఎర్రగా ఉంటాయ్. పెద్ద అంగలు వేసుకుంటూ లోపలకు వచ్చి కుర్చీలో కూల బడ్డాడు.

ఇల్లంతా ఒకసారి కలియచూశాడు.

"నా లాడ్జింగ్ కన్నా ఇదే బాగుంది ఎన్నో రెట్లు! దీనికి అద్దె ఎంత?"

"నెలకు వెయ్యిహూపాయలు. రాజన్, రామేశ్వరం అనే పేరిట బుక్ చేశాను."

"బాగానే ఉంది. ఇంతా ఆ పిల్లోడు ఎప్పుడు వస్తాడు? వాడికి మన కొత్త అడ్రను తెలుసా?"

"లేదు! మన ఫోన్ నెం. మద్రాసుకు తెలియజేశాను. ఆ నెంబరు వాడికీ తెలియజేయబడుతుంది. ఇక్కడ దిగం గానే మనకు ఫోన్ చేస్తాడు."

"ఇంతవరకూ బాగానే ఉంది. తర్వాత పనిగూడ సులభంగా జరిగిపోతే మన జీవితాలకు ఇబ్బంది ఉండదు!" అని చెప్పి "రాణీ! డ్రింక్స్ తీసుకురా రెండు!" అని కేక వేశాడు రాజు.

రాణి డ్రింక్స్‌తో వచ్చింది. కనకం ఆమెవంక ఎగాదిగా చూశాడు. ఆమె లోపలకు వెళ్ళిపోయాక అడిగాడు.

"ఈమె ఎవరు?"

"నా వెంట వచ్చింది!"

"ఆమెనెవరు తీసుకురమ్మన్నారు?"

"నాకు ఒకళ్ళు చెప్పేదేమిటి? నాకు అవసరం అనుకున్నాను, తెచ్చుకున్నాను. భోజనం ఎంత అవసరమో, స్త్రీ కూడ నాకు అంతే అవసరం! ఆమెవల్ల మనకేం ట్రబుల్ ఉండదు."

"కాని ఆడవాళ్ళంటే వాడితో వేగలేం!"

"ఓ! జోన్స్‌తోనా? వాడి సంగతి నేను చూసుకుంటాలే!"

"అసలు వాడ్ని ఎందుకు పిలిచావ్! మనిద్దరం చూసుకోలేకపోతామా?"

"నీకు తెలీదు. వాడు ఇటువంటి వాటిల్లో ఆరితేరినవాడు. రక్తపాతం లేకుండా, హత్యలు చేసుకురాగలడు."

"పోలీసు లిస్టులోవున్న పెద్ద నేరస్థుల పదిమందిలో నువ్వు మూడోవాడివి! నీకుగూడా మరొకడి సహాయం కావాలా!"

"నాకు చిరాకు తెప్పించకు ఆ ఎర్రటోపీలను గుర్తు చేసి. బయట తిరిగితే ఎవరన్నా నన్ను గుర్తుపడతారేమో అనే నేను ఎక్కడకూ వెళ్ళకుండా ఇంట్లోనే కూర్చుంటున్నాను. కనీసం మన పని అయేదాకానన్నా నా మొఖాన్ని దాచుకోవాలి!"

"క్రితంసారి నువ్వు అనవసరంగా ఆడమనిషిని చంపేశావ్."

"ఓ అదా! నా తప్పేమీ లేదు అందులో. గాలిలోకి పేల్చాను అక్కడి వాళ్ళను భయపెట్టటానికి. బుల్లెట్

గోడకు తగిలి మళ్ళీ వెనక్కి వచ్చి ఆమెకు తగిలింది. ఆమె చనిపోయింది. అంతే!''

''అయితే ఇక్కడ నిన్నెవరూ గుర్తించలేదు కదూ?''

''లేదు! మామూలుగా లాడ్జింగుల్లోనూ, టూరిస్టు హోటల్స్‌లోనూ దిగే వాళ్ళపై పోలీసులు ఒక కన్ను వేసి ఉంచుతారు. అందుకే ఈ దఫా కారు తీసుకుని, హౌస్ బంగళా అద్దెకు తీసుకున్నాను. ఇక్కడికెవరూ రారు.''

''ఆ సంఘటనలోనే కదూ జోన్స్ కలిసింది!''

''అవును. అతగాడే ఈ డాక్టరు గురించి చెప్పాడు. నేను అక్కడ్నుంచి పారిపోయి వచ్చిన తర్వాత ఆరు నెలలు బయటకు రాకుండా గడిపాను. ఈ లోపల నా కేసు పాతబడిపోయింది. బ్యాంక్‌లో తెచ్చిన డబ్బూ అయిపోవచ్చింది. అందుకే మళ్ళీ పథకం వేశాను.''

''బహుశా ఎంత క్యాష్ నిల్వ ఉంటుంది ఆ డాక్టరు దగ్గర?''

''బహుశా పది,పదిహేను లక్షలకు తక్కువ ఉండదు!''

''అంత డబ్బు ఏదన్నా బ్యాంక్‌లో వేసుకోక అలా నిల్వ ఉంచుకున్నాడెందుకు?''

''వాడికి కొంత క్రాక్‌నెస్ ఉందని విన్నాను. ధనం ఎందరో్నా బానిసలుగా చేసుకుంటుందట. అందుకని దానికి లొంగకుండా తనే ధనలక్ష్మిని బంధించేశానని వాడు అంటూంటాడట.''

''నిజంగానే క్రాక్‌లాగున్నాడు!''

''వీలైనంత వరకు ఎవర్నీ హత్యచేయకుండానే వాడి ధనలక్ష్మిని మనం ఎత్తుకుపోవాలి.''

''అవును! ఎవర్నీ హత్యచేయగూడదు. కాని జోన్స్ ఉన్నచోట హత్యలేకుండా ఉండదు'' అన్నాడు కనకం.

''కాని ముగ్గురన్నా లేందే పని జరగదు. ఒకడు గేట్

దగ్గర కాపలా ఉండాలి. ఇద్దరూ లోపల జొరబడి ఒకడు ఆ ముసలి పీనుగని తుపాకితో అదిమిపట్టి ఉంచితే, రెండో వాడు క్యాష్ సేఫ్ తెరచి మిగతా పని పూర్తిచేయాలి."

రాణి వచ్చి "వంట అయింది" అన్నది. బాత్ రూమ్ లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కొని డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు. ముగ్గురు భోజనం చేయసాగారు.

"క్రితంసారి అంటే బ్యాంక్ రాబరీకి ముందు నీవు జైల్లోంచి తప్పించుకున్నావట చాల గమ్మత్తుగా."

"అవును. అప్పుడు నన్ను ప్రిజన్-లేబర్ క్రింద వర్క్‌షాపులో రిపేరింగ్ సెక్షన్‌లో వేశారు. లారీలకు, ట్రక్కులకు వెల్డింగ్ చేసే పని నాది. ఒకసారి బాగా చెడిపోయిన ట్రక్కు వచ్చింది. అది బాగుచేస్తున్నట్టు చేస్తూనే దాని క్రింద భాగంలో రెండు కమ్మీల్ని బిగించాను. ఆ రాత్రికే డెలివరీ చెయ్యాల్సి ఉంది.

"ఆ మధ్యాహ్నమే నేను ట్రక్కు అడుగుభాగంలో కమ్మీల మధ్యలో పడుకున్నాను. ఎవరూ అనుమానించలేదు. ట్రక్కు బయటకు వచ్చేసింది. దోవలో రోడ్డుమీద అడ్డంగా ఉన్న రాళ్లు నా ఒంటికి తగిలి, గీక్కుపోయింది వళ్లు. అయినా ఓర్చుకున్నాను. రక్తం కారింది. బిగపట్టుకున్నాను. ఎలాగో బయటపడి తప్పించుకు వచ్చేశాను. అంతే! ఆ తర్వాత మళ్ళీ పట్టుబడకుండా జాగ్రత్తపడ్డాను. ఇకముందుకూడా పట్టుబడను."

భోజనాలు పూర్తిచేసి హాల్లోకివెళ్ళి కూర్చున్నారు. తాము పాల్గొన్న, ఓడిపోయిన యుద్ధాలగురించి మాట్లాడుకునే సైనికుల్లా లోగడ చేసిన నేరాలగురించీ, ఎలా పోలీసుల చేతుల్లోంచి తప్పించుకుని బయటపడిందీ చెప్పుకున్నారు.

రాణి వంట ఇల్లంతా సర్ది వెళ్ళి తన గదిలో పడుకుంది.

"నీవుకూడా లాడ్జి ఖాళీచేసి రేపుదయమే ఇక్కడికి

వచ్చేసెయ్. లాడ్జిలో నిన్నెవరన్నా ఆనవాలు పట్టి నిన్ను ఫాలో అయ్యారంటే మనగుట్టు బయటపడిపోతుంది."

"నీకా భయం అక్కర్లేదు."

"ఇక్కడ నేను బాస్‌ని. ఈ పథకంలో ఉండా లంటే నా ఆర్డర్లు పాటించడమే నీ పని. తెలిసిందా?"

"ఓకే! బాస్! రేపుదయమే ఇక్కడకు వచ్చేస్తాను" అంటూ కనకం వెళ్ళిపోయాడు.

కారు స్టార్ట్ అయిన శబ్దం వింటూనే రాజు బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు. తలుపు బిగించి, నిద్రలోకి జారుకుంటున్న రాణిమీదకు ఒరిగాడు.

## 5

సుబ్బారావు ఈ మధ్య ఒక కొత్త విద్య నేర్చుకున్నాడు.

మద్రాసువెళ్ళి ఉద్యోగం కోసం ప్రయత్నిస్తానని చెప్పి, సుభద్ర దగ్గర వందో, యాభయ్యో తీసుకుని మద్రాసు వెళ్ళటం, మస్తుగా త్రాగి రాత్రివేళకు ఇంటికి చేరటం.

సుభద్ర చేతిలో కాష్ ఆడుతోంది. ఇంటి ఖర్చుల క్రింద నెలకు వెయ్యో, రెండు వేలో ఆమె చేతికిస్తున్నాడు ముసలాడు.

సుభద్ర కాలేజీ చదువు మధ్యలో ఆగిపోయింది. ఆమెకు సాహిత్యం అంటే అభిలాష. రోజూ శ్రద్ధగా డాక్టర్ విష్ణువర్ధన్‌కి పేపరు చదివి వినిపిస్తుంది.మధ్యాహ్నం వేళ హెమింగ్వే నవలో, రాజాజీ రామాయణమో చదువుతుంది. తన విజ్ఞాన దాహాన్ని తీర్చుకుంటూనే విష్ణువర్ధన్‌కి కుడిభుజంలా మెలుగుతోంది.

సాయంత్రం లాన్‌లో కుర్చీలు వేసుకుని టీ త్రాగు తూండగా విష్ణువర్ధన్ ఆమెను అడిగాడు. "కాకి ముక్కుకు

దొండపండులా యీ సుబ్బారావు నీకెలా నచ్చాడు!"

"ఈ దేశంలో మగవాడు భర్తగా దొరికిందే మహా భాగ్యం, కట్నాలు ఇచ్చుకోలేని ఆడపిల్లకు. నాకు తల్లీ దండ్రీ లేరు. చిన్నప్పట్నుంచీ మేనత్త పెంపకంలో పెరిగాను. ఆమె కొడుకే సుబ్బారావు. ఏదో వర్క్ షాపులో పని చేస్తుండేవాడు. మా మేనత్తే మా ఇద్దరికీ పెళ్ళి చేసింది. క్రితం ఏడాది ఆమె చనిపోయింది.

ఆమె పోయిన తర్వాత ఉన్న ఇల్లుకాస్త అమ్మి ఆ డబ్బునంతా దుర్వ్యసనాలకు పాడుచేశాడు. డ్యూటీ సరిగా చేయలేదని ఉద్యోగంలోంచి ఊడబెరికారు.

గడవటానికి సంపాదనలేదు. ఉండటానికి ఇల్లులేదు. రెండు నెలలు నరకయాతన పడ్డాం. ఆ తర్వాత మీ నీడలో చేరి మీ దయవల్ల సుఖంగా ఉన్నాం."

"ఏ రకంగా చూసినా వాడు నీకు తగడు."

"నిజమే! కాని అతడికి నా అవసరం ఎంతైనా ఉంది. చిన్నపిల్లాడ్ని సాకినట్టుగా సాకాలి ఆయన్ని. నేను లేకపోతే ఆయనేమైపోయేవారో!"

"నీలాంటి భార్య దొరకటం వాడి అదృష్టం. ఈ మధ్యన వాడు మద్రాసు పోతున్నాడు చాలసార్లు. వాడికి నీవు డబ్బిస్తున్నావా?"

ఆమె ఒక నిమిషం ఆలోచించింది. ఈయన అన్నీ జాగ్రత్తగా గమనిస్తుంటాడు. ఇలాంటి వ్యక్తివద్ద అబద్ధ మాడి గెలవలేం అనుకుంది.

"అవును. ఇంటి ఖర్చులకని ఇచ్చిన దాంట్లోంచి ఇచ్చాను. అదంతా విడిగా లెక్క రాస్తున్నాను. ఆయనకు ఉద్యోగం దొరకగానే ఇచ్చేస్తాం!"

"నీ పిచ్చిగాని వాడికి ఉద్యోగం దొరుకుతుందా?"

"లేకపోతే నేనే ఎక్కడన్నా ఉద్యోగం చేయాల్సి ఉంటుంది మీ పైకం తిరిగి ఇచ్చేందుకు."

"అంత పని చేయనక్కరలేదు. నీవు నాకు సేవచేస్తున్నందుకు జీతం క్రింద సరిపెట్టుకో డబ్బుని. నీకిదే ఉద్యోగం అనుకో! కాకపోతే నా బాధ అల్లా సుబ్బారావు చేతికి డబ్బిచ్చి చేతులారా వాడ్ని చెడగొడుతున్నానేమో అని!"

ఆమె మాట్లాడలేదు.

"లోపలకు పోదాం పద!" అన్నాడు విష్ణువర్ధన్.

స్ట్రాంగ్ రూమ్ తలుపులు తెరిచాడు. ఆమె వెంటరాగా లోపలకు నడిచాడు. "ఇన్నాళ్ళూ నాకున్న డబ్బుని గురించి వాళ్ళూ వీళ్ళూ చెప్పుకోంగా విని ఉంటావ్. ఇప్పుడు కళ్ళారా చూద్దువుగాని! రా!" అంటూ గోడ మీద స్విచ్ నొక్కాడు. గోడలో మరో భాగం తెరుచుకుంది.

ఎదురుగా చిన్నసైజు ఇనప్పెట్టె ఉంది. తాళం అధునాతనంగా ఉంది. దానిమీద నాలుగైదు వరసల్లో అంకెలున్నై. ఆ వరసల్లో కాంబినేషన్‌గా అంకెల్ని జరిపాడు. ఆ తర్వాత చెవిని దూర్చి త్రిప్పాడు. సేఫ్ తెరుచుకుంది.

మనిషి నిలువెత్తున నోట్లకట్టలు కనిపించినయ్. ఆమె దిగ్భ్రాంతి చెందింది. చేతులు కట్టుకుని నిలబడి ఏ విధమైన ఉద్వేగమూ కనబర్చకుండా వాటిన చూసింది నిశితంగా.

"ఇంత డబ్బుని ఇంట్లో పెట్టుకోకపోతే ఏదన్నా బ్యాంక్‌లో వేసుకోగూడదూ?"

"నా డబ్బుని నేను రోజూ కళ్ళారా చూడాలి. అంతే కాదు. నా వైద్యవృత్తిలో ఎంతో మంది పేద వాళ్లు మందులు కొనుక్కోలేని స్థితిలో, సరైన వైద్య

సదుపాయం లేక ప్రాణాలు కోల్పోయారు. వాళ్ళందరికీ డబ్బుంటే వాళ్లు బ్రతికి ఉండేవారే. బహుశా అందుచేతనే కాబోలు మనిషి డబ్బుకు దాసోహం అంటున్నాడు. మానవత్వాన్ని నాశనంచేసి, బానిసల్నిగా మార్చే ఈ డబ్బు అంటే నాకో విధమైన జుగుప్స ఏర్పడింది. అందుకే డబ్బుని నా సేఫ్‌లో బంధించేశాను. ఇప్పుడు ఈ డబ్బంతా నాకు బానిస అయింది కదూ? కాని ప్రజలు నన్నో క్రాక్ అంటారు. సంఘానికి పనికి రాని వాడినని అంటారు.''

"లోకులు కాకులు!'' అంది ఆమె.

విష్ణువర్ధన్ స్ట్రాంగ్ రూమ్ తిరిగి మూసేశాడు.

నా తదనంతరం ఈ డబ్బంతా మూడు భాగాలవుతుంది. ఒక వంతు ధర్మసత్రాలకు చెందుతుంది. వాటి పేర్లు నా విల్లులో వ్రాశాను. మరో వంతు మెడికల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కి రాసేశాను. మిగతా దాంట్లో నీకు ఎక్కువ భాగం చెందుతుంది. మరికొంత కొద్దిమంది బంధువులకు రాశాను. కాని ఈ విషయం ఎవరికీ తెలియరాదు.''

"అలాగేనండీ!''

"ఆఖరికి సుబ్బారావుకిగూడా చెప్పకు. ఇప్పుడే త్రాగి డబ్బంతా నాశనం చేయగలడు.''

"చెప్పనంటే చెప్పను.''

సుభద్ర వంట గదివైపు వెళ్ళిపోయింది. డాక్టర్ విష్ణువర్ధన్ కోటుజేబులో చేతులు పెట్టుకొని పోర్టికోలో పచార్లు చేయసాగాడు. రాములు గేటుకు తాళం వేసి లోపలకు వచ్చాడు.

సరిగా అప్పుడే నల్లరంగు ఫోర్డుకారు అటుగా వెళ్లింది. అందులోని వ్యక్తి డాక్టర్ వంక గుచ్చి చూస్తున్నాడు.

డాక్టర్ విఘ్నవరన్ అతనికేసి ప్రశాంతంగా చూశాడు. అంతలోనే కారు వెళ్ళిపోయింది. దానిమీద నెంబరు కనబడలేదు సరిగా. కాని అక్షరాల్ని బట్టి అది కర్నాటక రాష్ట్రానికి చెందినది అనుకున్నాడు మనసులో.

# 6

లాయర్ నారాయణరావు కొడుకు సుధీర్ పదో తరగతి చదువుతున్నాడు. పుత్రవాడు అయిదడుగుల ఎత్తు. సన్నగా ఉంటాడు.

సుధీర్ తమ ప్రక్క యింటి పెరడులోని మామిడి చెట్టు కాయ కోయాలని రాయి విసిరాడు. అదివెళ్ళి కిటికీకి తగిలింది.

లోపల్నుంచి ఎవరో వ్యక్తి "ఏయ్! ఎవరది?" అంటూ అరచుకుంటూ బయటకు వచ్చాడు.

బయటకు వచ్చిన వ్యక్తిని చూస్తూనే సుధీర్ అదిరి పోయాడు. తెలుగు సినిమాల్లో రౌడీలా ఉన్నాడు అచ్చం. గిరజాల జుట్టు, కోరమీసాలు, మొఖాన పెద్ద గంటు, పెద్ద పెద్ద కనుగ్రుడ్లు. అతడిని చూసి ఝడుసుకున్నాడు సుధీర్.

అంతలోనే అతని తండ్రి నారాయణరావు నొడ్లోకి వచ్చాడు. "రేయ్! వెధవా! ఏం పనిరా! రాళ్ళు విసురుతున్నావా కాయలకోసం! ఎవరికన్నా తగలవూ?" అని కొప్పడి, "సారీ సర్! ఆ రాయి ఎవరికీ తగల్లేదు కదా!" అని ఆ వ్యక్తిని పరామర్శించాడు.

అతడు బదులు చెప్పకుండానే లోపలకు వెళ్ళి పోయాడు.

"ఆఇంట్లోకి మనుషులొచ్చారని నాకు తెలీదు నాన్నా! ఇంకా ఖాళీగానే ఉందనుకున్నాను. లేకపోతే రాళ్ళు

వినురుతానా!'' తండ్రిని చూసిన సుధీర్ దిక్కు
మొగంతో అన్నాడు.

సుధీర్ స్వతహాగా మంచివాడు. అందుకే నారాయణ రావు అతడ్ని మరీ గట్టిగా మందలించలేదు.

పుస్తకాలు తీసుకుని బడికి వెళ్ళిపోయాడు సుధీర్. మేష్టారు పాఠాలు వింటూన్నాగాని అతడి కళ్ళలో ప్రక్కింట్లోంచి బయటకొచ్చిన వ్యక్తి స్వరూపమే గుర్తుకువస్తోంది.

పుస్తకం మూసేసి అతడ్ని గురించే ఆలోచించ సాగాడు. టెక్స్టు పుస్తకంమీద న్యూస్ పేపర్ అట్టవేసి ఉంది. ఆ న్యూస్ పేపర్ చాలా పాతది.

హఠాత్తుగా దానిమీద ఉన్న ప్రకటన చూసి సుధీర్ పాముని చూసినట్టుగా ఉలిక్కిపడ్డాడు.

ఆ ప్రకటనలో ఒక పెద్ద గజదొంగ ఫొటో ఉంది. అతడి ఆచూకీ ఎక్కడున్నా దొరికితే వెంటనే పోలీసు లకు తెలియజేస్తే బహుమతి ఇస్తారని ఉంది.

సందేహం లేదు. ఆ గజదొంగ వీడే. ముమ్మూర్తులా వాడిలానే ఉన్నాడు. తన తండ్రికి ఈ విషయాన్ని తెలియజేస్తే!

వాడ్ని మరోసారి పరీక్షగా చూసి, వాడే అని నిర్ధా రణ చేసుకుని ఆ తర్వాత వాడి అంతు తేల్చుకుంటాను అనుకున్నాడు.

# 7

జోన్స్ టాక్సీలో మహాబలిపురం వచ్చాడు. బస్ స్టాండ్ కి దగ్గరలో ఉన్న లాడ్జిలో రూమ్ తీసుకున్నాడు. టాక్సీలోంచి మూడు సూట్ కేసుల్ని తీసుకొచ్చి రూమ్‌లో పడేశాడు. స్నానంచేసి నీట్ గా ముస్తాబై తన డైరీలోని

నెంబర్‌కి ఫోన్ చేశాడు.

రాజు పలికాడు అవతలివైపు నుంచి. అతని అడ్రసు చెప్పాడు. జోన్స్ తన సూట్‌కేసుల్ని వేసుకొని రాజు ఇంటికి మారాడు.

బ్యాంక్ దోపిడిలు, లక్షలకోసం మనుషుల్ని హత్య చేయటంలో జోన్స్ ఘటికుడని విన్నాడు రాజు. లోగడ మూడు నాలుగుసార్లు జైలుకెళ్ళొచ్చిన వ్యక్తి. రాజుగూడా జైల్లోనే అతడికి పరిచయమయ్యాడు.

జోన్స్ మనిషి ఎర్రగా ఉంటాడు. పిల్లికళ్ళు. మనిషి నాజూకుగా అయిదున్నర అడుగులు ఉంటాడు. అతడు అటు స్టూడెంట్స్‌లోనూ కలిసిపోగలడు, ఇటు హాలీడే ఎంజాయ్ చేయటానికి వచ్చిన టూరిస్టులానూ అవుపించ గలడు. మనిషి ఎప్పుడూ నవ్వుతూ విచారమనేది ఎరగని వాడిలా కనబడతాడు.

రాజుతోనూ, కనకారావుతోనూ పరిచయాలయాక తనసూట్‌కేస్ తెరిచాడు జోన్స్. అందులో .38 పిస్టల్, ఒకపాట్ గన్ ఉన్నయ్. రెండు నెక్‌టైలు, గ్లోవ్స్ ఒక జత, సన్నని దారం ఒకరోల్, పెద్దతాడు, కటింగ్ ప్లయర్, రెంచీ సెట్టు, ఇంకా కొన్ని స్క్రూడ్రైవర్లు ఉన్నయ్.

ముగ్గురు కూర్చుని తమ పథకం గురించి మాట్లాడు కున్నారు.

రాజు బిల్డింగు ప్లాన్ ఒకటి టేబుల్‌మీద పరిచాడు. డాక్టర్ విష్ణువరదన్ ఇంటి ప్లాన్ అది. ప్రవేశద్వారం ఏ దిక్కున ఉన్నదీ, ఇంటికి ఎన్నెన్ని ద్వారాలున్నవీ స్ట్రాంగ్ రూమ్ లొకేషన్ ఇవి అన్నిటినీ సూచిస్తున్నది అందులో.

జోన్స్ దాన్ని పరీక్షగా చూస్తున్నాడు. రాణి

డ్రింక్స్ కలిపి తెచ్చింది. వాటిని టేబుల్ మీద పెట్టింది. జోన్స్ మాన్ లోంచి తల పైకెత్తి ఆమె వంక చూశాడు.

"ఓ! లవ్ లీ!" అంటూ విజిల్ వేశాడు.

"ఆమె జోలికి పోవటం నీ ఆరోగ్యానికి మంచిది కాదు!" అన్నాడు కనకం.

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మరీ మాట్లాడు!" అంటూ ఉరిమి చూశాడు జోన్స్.

రాజు అతని వంక చూస్తూ అన్నాడు. "ఆమె నా లవర్! ఆమె వంక కన్నెత్తి చూడవద్దు!"

"లవ్వర్! హహహా!" అంటూ జోన్స్ పెద్దగా నవ్వాడు. "చూడు పార్ట్నర్! మనందరం భాగస్థులం కదా! ఆమెనుకూడా తలాకాసేపు పంచుకుందాం! ఆడది రంగంలో లేకపోతే జోన్స్ కి ఇన్స్పిరేషన్ రాదు."

నేను చెప్పలేదా అన్నట్టు చూశాడు కనకం, రాజు వంక.

రాజు కళ్ళు కోపంతో ఎర్రబడినై.

"జోన్స్! అనవసరంగా రచ్చచేసి మన పథకాన్ని పాడుచేయకు. కావాలంటే బయటకిపోయి పదిమందిని అనుభవించు. అంతేకాని, ఇక్కడ ఎటువంటి గోల చేయకు," అన్నాడు కనకం.

జోన్స్ రెచ్చిపోయాడు. "ఆడదాన్ని చూస్తే వదలడు ఈ జోన్స్. దాన్ని నా ముందుకు రమ్మను వెంటనే! ఊ రమ్మనండి!" అని అరిచాడు.

రాణి భయం భయంగా హాల్లోకి వచ్చింది.

"నువ్వెక్కడికి! ఆగు! అక్కడే!" రాజు కసిరాడు.

"ఇక్కడ అంతా నా ఆజ్ఞలు పాటించాల్సిందే!" జోన్స్ అన్నాడు మళ్ళీ.

"నీవేం బాస్ వా? ఇంతవరకూ నిన్ను సహించాం!

ఇక మాటమీరితే ఊరుకునేది లేదు!" రాజు అన్నాడు కర్కశంగా.

జోన్స్ తన బొడ్లోంచి కత్తి తీసుకుని రాజుమీదకు దూకాడు. అయితే, కనకం అతడి కాలికి తన కాలు అడ్డంపెట్టి బ్రేక్ వేశాడు.

జోన్స్ క్రింద పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి క్రింద పడిపోయింది.

రాజు దాన్ని అందుకున్నాడు. బోర్లా పడిపోయిన జోన్స్ వెన్నులో ఆ కత్తిని బలంగా, కసిగా దించాడు. మళ్ళీ కత్తిని పైకి లాగాడు. మరోపోటు పొడిచాడు.

జోన్స్ బాధతో అరవబోయాడు. కనకం తన బూట్ కాలుని అతడి నోట్లో త్రొక్కి అదిమాడు. మరో శబ్దం బయటకు రాకుండా జోన్స్ చనిపోయాడు.

రాజు కిటికీవైపు చూచి గబాలున ఎలుకమీదకు చప్పుడు కాకుండా దూకిన పిల్లిలా బయటకు పరుగెత్తాడు. చుట్టూ తిరిగి కిటికీవద్దకు వచ్చాడు. మరు నిముషంలో అతడి చేతిలోని కుర్రాడు గిలగిల తన్నుకుంటున్నాడు అతని పట్టు వదిలించుకోవాలని.

ఆ పిల్లవాడ్ని తీసుకొచ్చి నేలమీదకు కుదించి పడే శాడు. నడుమునున్న బెల్టు ఊడలాగి ఆ కుర్రవాడ్ని గదిలోపెట్టి ఛడేల్, ఛడేల్ మని కొట్టాడు.

"అరవకు! అరిచావో ప్రాణాలు తీస్తాను" అన్నాడు రాజు.

ఆ కుర్రవాడు నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు. అతడి నోటి వెంట నెత్తురు కారుతోంది.

రాణి పరుగెత్తుకొచ్చింది. "వాడ్నిగూడ చంపే స్తారా ఏం? పాపం! చిన్న పిల్లవాడు." అంది.

"నువ్వు నోరు మూసుకో!" రాజు కసిరాడు.

"పిల్లవాడా పిడుగా! నాచేయి అంతా కొరికిపెట్టాడు. ఆరోజు మా ఇంటిమీదకు రాయి విసిరింది నీవేగదూ?" రాజు కుర్రవాడ్ని అడిగాడు.

"మామిడి కాయ కొడదామని విసిరాను" ఏడుస్తూ అన్నాడు కుర్రవాడు.

"నీ పేరేంటి?"

"సుధీర్."

"దొంగలాగ మా ఇంట్లోకి ఎందుకు దూరావ్?"

సుధీర్ పలకలేదు.

కనకం అతడి దవడమీద లాగికొట్టాడు. సుధీర్ గిలగిలలాడిపోయాడు.

"నేనెవరో తెలుసా?" రాజు అడిగాడు.

"లే... లేదు!" అన్నాడు సుధీర్.

మరో దెబ్బ పడింది.

"అవును! తెలును! నీ ఫోటో పేపర్లో చూశాను."

"గుడ్ బోయ్! నీకు స్కూల్లో మంచి మార్కులు వస్తుంటాయనుకుంటాను. ఈ విషయం ఇంకా ఎవరెవరికి చెప్పావ్?"

"ఎవరికీ చెప్పలేదు."

కుర్రవాడ్ని మూలకు నెట్టాడు. నేలమీద పడిపోయాడు సుధీర్.

"అతడు పసిగట్టిన విషయం ఎవరికీ చెప్పలేదు. ఇంట్లో తెలీకుండా చాటుగా మనింటికి వచ్చాడు. కనుక అతడెక్కడున్నదీ ఎవరికీ తెలియదు."

"ఏం చేస్తారు వాడ్ని?" అని ఆదుర్దాగా అడిగింది రాణి. రాజు, కనకం వంక చూశాడు.

"కాళ్ళూ చేతులూ కట్టి పడేయండి ఈ గదిలో. మన పని పూర్తయేవరకూ వాడు బయట పడకూడదు."

అన్నాడు కనకం.

సూట్ కేస్ తెరచి త్రాడు పట్టుకొచ్చారు. సుధీర్ కాళ్ళు రెండూ కలిపి కట్టేశారు. ఆ తర్వాత చేతుల్ని వెనక్కి విరిచి తాడుతో కట్టేశారు. టేప్ తెచ్చి నోటికి అతికించారు.

రాణి దుప్పటి తెచ్చి పరిచింది. పిల్లవాడ్ని దాని మీదకు దొర్లించి గది తలుపులు బయట గొళ్ళెం పెట్టి హాల్లోకి వచ్చారు, రాజు, రాణి కనకం.

హాల్లో జోన్స్ శవం ఇంకా అలానే పడి వుంది. కనకం అతడి జేబులు వెదికాడు. పర్సు బయటకు తీశాడు. అందులో రెండువందలయాభై రూపాయలున్నై.

"యాభై రాణి కిచ్చేసి మనిద్దరం చెరోవంద తీసు కుందాం!" అన్నాడు కనకం.

రాజు సరేనన్నట్టు తల ఊపాడు.

రాణికి ఇంకా భయం తీరనట్టుగానే బిత్తరపోయి చూస్తున్నది.

కనకం తాడుతో శవంకాళ్ళను గట్టిగా బంధించాడు. ఆ తర్వాత చేతులుగూడా కలిపి కట్టాడు. లోపల్నుంచి పాత దుప్పటి తీసుకువచ్చి దాన్లో ఆ శవాన్ని చుట్ట బెట్టాడు.

కనకం,రాజు ఇద్దరూ చెరోవేపు పట్టుకొని ఆ శవాన్ని తీసుకెళ్ళి వెనకాల గదిలో పడేసి తలుపు తాళం వేసేశారు.

"ఈ శవం రెండో రోజుకల్లా కుళ్ళి వాసన వేస్తుంది. యీలోపుగా మన పని పూర్తిచేసుకొని ఈ ఇల్లు ఖాళీ చేయాలి" అన్నాడు రాజు.

ఇద్దరూ తలలూపారు.

రాజు టేబుల్ మీద ప్లాన్ ని పరిచాడు.

''వాళ్ళింట్లో కేవలం నలుగురే ఉన్నారు. డాక్టర్, ఆ అమ్మాయి, దాని మొగుడు సుబ్బారావు, నౌకరు రాములు. సుబ్బారావు ఒక్కడే అందులో కాస్త ఎదురు తిరిగి పోరాడగలవాడు. వాడ్ని అదుపులో పెడితే చాలు.

''మనం కారు వేసుకుని లోపలకు వెడతాం! స్నేహితు లలా ఇంట్లోకి ప్రవేశిస్తాం! ఈ లోపలే టెలిఫోన్ కనెక్షన్ తెంపి పారెయ్యాలి!''

''స్ట్రాంగ్ రూమ్ ఎక్కడుందో తెలుసా?''

''సరిగ్గా తెలీదు. కాని ముసలాడు ఎప్పుడూ ఆ స్ట్రాంగ్ రూమ్ దగ్గరే ఉంటాడట.''

''సాయంకాలం పూట అయితే మనకు వీలు. ఊళ్ళో ప్రజలు చాలామంది బీచ్‌లో జేరతారు. రివాల్వరుతో బెదిరించి ముసలాడిచేత సేఫ్ తెరిపిస్తాం. వాడి చేత్తోనే సూట్ కేసుల్ని నింపిస్తాం. వాళ్ళందర్నీ గదిలో బంధించేసి మనం బయటకువచ్చి మనం వేసుకొచ్చిన కారుని అక్కడే వదిలేసి వాడి కారు తీసుకుని మనం బయట బడతాం!''

''బాగానే ఉంది! ఆ తర్వాత మనం ఇక్కడ్నుంచి బయటపడేదెలా?''

''అదీ వెరీ ఈజీ! ఎందుకంటే మన తలకు క్రాష్ హెల్మెట్‌లు తగిలించుకుంటాం. కళ్ళకు గాగుల్సు పెట్టుకుందాం. అప్పుడు మనల్ని ఎవరూ గుర్తించరు. బయటికి వచ్చి టూరిస్ట్లలో కలిసిపోతాం!''

''అదీ మంచి ఆలోచనే! ప్లాన్ దాచెయ్. ఇక పడుకుందాం!'' అన్నాడు కనకం.

తన బెడ్ పరుచుకుని కనకం దానిమీద వాలిపోయాడు. 'రేపు సాయంకాలం! ఎ డేటు రిమెంబర్!'

అనుకున్నాడు మనసులో.

రాజు మెల్లగా నిద్రలోకి జారుకోగానే రాణి అతడి ప్రక్కలోంచి లేచింది.

నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ బాత్‌రూమ్ ప్రక్క నేవున్న గది తలుపు తీసుకుని లోపలకు వెళ్ళింది.

సుధీర్ దుప్పటిలో పడుకుని ఉన్నాడు. అతడి కళ్ళ వెంట నీళ్ళు ధారలు కారుతున్నయ్.

అతనికి దగ్గరగా మోకాళ్ళమీద కూర్చుంది రాణి. "బాధగా ఉందా?" అని అడిగింది.

"ఊఁ!" అని మూలిగాడు సుధీర్.

లాలనగా అతడి తల నిమిరింది రాణి.

"వీళ్ళు రాక్షసులు బాబూ! వీళ్ళజోలికి రాకుండా ఉండాల్సింది. మీ నాన్న, అమ్మా నీకోసం బెంగ పెట్టుకుంటారు. నీవు ధైర్యంగా ఉండు. వాళ్ళనీకేం ప్రమాదం తలపెట్టకుండా చూస్తాను. రేపు సాయంత్రం వీలుచూసుకుని పారిపోదువు!"

మరో బెడ్‌షీట్, దిండూ తెచ్చింది ఆమె. దిండు అతడి తలక్రింద పెట్టింది. బెడ్‌షీట్ అతని మెడవరకూ కప్పింది.

ఆమె వెళ్ళిపోయింది. ఇలా జరుగుతుందని సుధీర్ ఊహించలేదు. తను ఎక్కడికి వెళుతున్నదీ గూడ తమ్ముళ్ళకిగాని, చెల్లాయికిగాని చెప్పలేదు. అలా చెప్పి ఉంటే వాళ్ళు ఇక్కడకు వెతుక్కుంటూ వచ్చేవారు.

కనీసం వాళ్ళు తనను పట్టుకున్నప్పుడు పెద్దగా అరిచినా బాగుండేది, నలుగురూ పోగయేవాళ్ళు. మొఖంమీద గంటువున్న వ్యక్తి తనను గట్టిగా పట్టేసుకున్నాడు. ఏదో రెండు తన్ని వదిలేస్తారని అనుకున్నాడు తను.

ఇలా కట్టిపడేసి, అవసరమైతే హత్య చేయటానికైనా వెనుకాడరని చిన్నారి మనసుకు తట్టలేదు.

# 8

సుభద్ర మళ్ళీ టీ కప్పులో పోసి ఆయనకు అందించింది.

డాక్టర్ విష్ణువరధన్ టీని చప్పరిస్తూ అన్నాడు. "నీవు ఈ ఇంట్లో అడుగుపెట్టిన నాటినుంచి ఏదో కొత్త అనుభూతి కలిగింది నాలో. జీవితంలో నా అన్నవాళ్ళు లేక మోడులా జీవించానేమో, ఆప్యాయత అంటే ఏమిటో నీ వొచ్చాకనే తెలిసింది నాకు. గత అయిదారేళ్ళ జీవితంతో పోల్చిచూస్తే ప్రస్తుతం నా జీవితం ఆనందంగా గడిచిపోతోంది.

"కాని ఒక్కొక్కప్పుడు భయమేస్తోంది. తుఫానుకు ముందు ఆవరించే ప్రశాంతతలాగ ఈ ఆనందమయ దినాలు రాబోయే ఆపదలకు సోపానాలేమో అనిపిస్తుంది. సుభద్రా! ఏదైనా పుస్తకం తీసుకురా! కాసేపు ఈ ఆలోచనల్ని దూరంగా తరిమేద్దాం!"

"శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యద చదవనా?"

"అది వద్దు. విశ్వనాథవారు రచించిన చెలియలికట్ట తీసుకురా! రాక్‌లో మూడోవరసలో చివరగా ఉంటుంది."

సుభద్ర లోపలకు వెళ్ళి పుస్తకం తెచ్చింది. కాసేపు చదివి వినిపించింది. ఆమె ఎంతో స్ఫుటంగానూ, నిర్దుష్టంగానూ చదువుతుంది. ఎక్కడికక్కడ సమాసాల్ని ఆపి, భావయుక్తంగా చదువుతుంది. అందుకే ఆమె పుస్తకం చదువుతూంటే అతడు ఎంతో ఆనందిస్తాడు.

విష్ణువరధన్ పడుకున్న తర్వాత సుభద్ర తన గదిలోకి వచ్చింది. తను రోజూ చదివే ఎన్నో పుస్తకాల్లోని

సాహిత్యాన్ని సుబ్బారావుకు చెబుదామనుకుంది.

"ఎప్పుడూ పుస్తకాలు? సాహిత్యం? ఏముంటుందా పుస్తకాల్లో! మీరిద్దరూ పుస్తకాల పురుగుల్లాగున్నారు!" అని విసుక్కున్నాడు సుబ్బారావు.

"ఒకసారి మీరూ చదివితే వాటిని మళ్ళీ వదులుతారా?" అంది సుభద్ర.

"పిచ్చిదానా? పురాణాలూ, పుస్తకాలు ముసిలాళ్ళకు. నీకూ, నాకూ పనికిరావు. జీవితమంటే ఏమిటో చూపిస్తాను. రా!" అంటూ ఆమెను తనమీదకు లాక్కున్నాడు.

"ఆగండి! ఏమిటా మోటుసరసం! నన్ను చెప్పనివ్వండి ముందు!" అని వారించింది సుభద్ర.

"చాల్లే! ఆపు నీ సొద! ముసలాడు నీ మాట వింటున్నాడు గదా! వాడిచేత ఏ టెలివిజన్ సెట్టో కొని పారేయిస్తే మనకు బోలెడంత కాలక్షేపంగదా. అలాంటి మంచి పనులు చెయ్యావు. వేలకు వేలు తగలేసి పుస్తకాలు మాత్రం కొని పడేస్తుంటాడు."

ఆమె ఏదో చెప్పబోయింది. అతడా అవకాశాన్ని ఆమెకివ్వకుండానే ఆమెను తన కౌగిట్లో ఇముడ్చుకున్నాడు.

# 9

రాణి దుప్పటి గొంతువరకు కప్పుకుని పడుకుంది. ఆమెకు నిద్రరావటంలేదు. ఆమె ప్రక్కనే రాజు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

రాణి ఆలోచనలన్నీ ఆ పసివానిమీదే ఉన్నయ్. ఈ రోజు శ్రీన్స్ హత్యజరిగింది తలవని తలంపుగా. ఆ తర్వాత అమాయకుడైన సుధీర్‌ని తెచ్చి కట్టిపడేశారు. నీసం అతన్నన్నా ప్రాణాలతో వదిలితే బాగుండును.

ఆమె ఆలోచనలు వెనక్కి మళ్ళినయ్.

తను ఎలిమెంటరీ స్కూల్ టీచర్ కుమార్తె. ఆరుగురు సంతానంలో మూడోది. ఇద్దరక్కలు, ఒక తమ్ముడు, ఇద్దరు చెల్లెళ్ళ సంసారంలో చాలీచాలని జీతంతో జీవితం చాల దుర్భరంగా ఉండేది. తనకు మొదటినుంచి సినిమాలంటే తగని పిచ్చి. రిలీజ్ అయిన ప్రతి సినిమా చూసేది. చిన్నతనంలో నాన్న జేబులో డబ్బులు దొంగతనంగా తీసేది సినిమాకని.

హైస్కూల్లో చేరిన తర్వాత మరో సదుపాయం కలిగింది. తనంటే మోజుపడే కుర్రకారువాళ్లు తనని ప్రతి సినిమాకు తీసుకెళ్ళేవారు. తను తన్మయత్వంతో సినిమా చూస్తుంటే వాళ్లు తన దేహంలో ఎక్కడెక్కడో తడిమేవారు. తను అడ్డం చెప్పేది కాదు. చెబితే తనకు ఫ్రీ సినిమాలు పోతాయని. వాళ్ళని ముద్దుపెట్టుకోనిస్తే పౌడరు డబ్బాలు, రిబ్బన్‌లూ గాజాలకు డబ్బులొచ్చేవి. అలా ప్రారంభమయింది తన తొలి యవ్వనపు రోజులు.

ఒకసారి తన బోయ్ ఫ్రెండ్ తనను సినిమాల్లో చేరుస్తానని మభ్యపెట్టి ఇంట్లోంచి లేపుకుపోయాడు. ఇద్దరూ మద్రాసు చేరారు. అతగాడికి ఫిల్మ్ స్టుడియోల్లో వ్యక్తులు తెలుసు. అందుకని తను నాలుగైదు స్టుడియోలు, సినిమా షూటింగ్‌లు చూడగలిగింది.

ఒకనెల తనను అనుభవించిన తర్వాత ఆ ఫ్రెండ్ తనను మరో వ్యక్తికి అప్పజెప్పి పరారయ్యాడు.

ఆ కొత్త పార్ట్‌నర్ ఏదో స్టుడియోలో మేకప్ మెన్ క్రింద అసిస్టెంట్. అతడి పుణ్యమా అని తనకు ఒక సినిమాలో పోర్షన్ దొరికింది. తన ఆనందానికి అవధిలేదు.

అయితే సెన్సార్ కత్తెరకు తనున్న సీన్ కాస్త బలి అయింది. వెండి తెరమీద కనుపించాలన్న తన ఆశ

అడియాసే అయింది.

ఈ లోపల తనను ఎందరో చేతులు మార్చారు.

సరిగ్గా అటువంటి సమయంలో రాజు తారసిల్లాడు. "ఈ సినిమాలోకం కేవలం పైపై మెరుగుల వల్లే మాత్రమే. హాయిగా ఒకడితో సిరపడు! స్టార్ అవాలనే ఎండమావుల్లో ఎందుకు పరుగెత్తుతావ్!" అని సలహా ఇచ్చాడు.

సినిమా ఛాన్స్‌లకోసం అడ్డమైన వాడి దగ్గరా పడుకుని ఇప్పటికే తను ఆరోగ్యం పాడుచేసుకుంది. అందుకే రాజుతో ఉండిపోయింది.

రాజు ఏదో కంపెనీలో పనిచేస్తున్నానని చెప్పాడు. కాని ఒకసారి అతడికోసం పోలీసులు వచ్చారు. దాంతో అతడు దొంగ అని తెలుసుకుంది. హత్యలు చేయడానికి కూడా వెనుకాడని వ్యక్తి అని తెలిసింది.

అయినా అతడితోనే జీవితాంతం గడిపివేయాలను కుంది.

ఇక్కడకు వచ్చేటప్పుడు రాజు తనను ఎంతగానో బ్రతిమాలాడు. ఎన్నో విధాల నచ్చచెప్పాడు.

ఎవరో ధనికుడింట్లో దొంగతనం చేయబోతూన్నట్టు చెప్పాడు. ఇదే ఆఖరి నేరం అన్నాడు. ఈ పని సఫలం అయితే మిగతా జీవితమంతా నేరం చేయాల్సిన అవసరం ఉండదని వక్కాణించాడు.

తను సరేనని అతడి వెంటే వచ్చింది.

అతడు నేరస్తుడే కావచ్చు. హంతకుడు అవచ్చు. కాని తనను భార్యకన్న మిన్నగా చూసుకుంటున్నాడు. అతడి పాలనలోకి వచ్చాక తను మరో పరాయివాడి కోర్కెతీర్చి బ్రతకాల్సిన ఖర్మ తప్పింది.

ఈ ఒక్కసారి రాజు పథకం నెరవేరితే బాగుండును

అని మనసులోనే దేవుణ్ణి ప్రార్థించింది.

ఆ తర్వాత ఆమె కనురెప్పలు బరువుగా వాలిపోయినయ్.

# 10

లాయరు నారాయణరావు ఇంటికి చేరేసరికి బాగా పొద్దుపోయింది. పిల్లలు అన్నాలు తిని పడుకున్నారు.

నారాయణరావు భార్య సరసనే కూర్చుని తీరిగ్గా తృప్తిగా భోజనం పూర్తిచేశాడు. స్టడీ రూమ్‌లోకి వెళ్ళి ఆ రోజే పోస్టులో వచ్చిన లా జర్నల్ తిరగేశాడు. భార్య వంటిల్లు సర్ది వచ్చింది.

"పిల్లలంతా పడుకుంటే ఎంత ప్రశాంతంగా ఉంది! వెళ్ళి అలా ఆరుబయట వెన్నెల్లో కూర్చుందాం!" అన్నాడు నారాయణరావు.

"పాపం! మీరు మరీ చిన్నవారైపోతున్నారు ఈ మధ్య" అంది నారాయణరావు భార్య సరోజ.

ఇద్దరూ వరండాలోంచి నడిచివెళ్ళి చెట్ల క్రీనీడలో గడ్డిమీద కూర్చున్నారు. బయట పిండారబోసినట్లుగా వెన్నెల కాస్తూంది. సరోజ తలలోని మల్లెచెండు వాసన అతని వేపుకు మత్తుమత్తుగా వీస్తున్నది. అతడి చేతులు ఆమెచుట్టూ తిరిగినయ్. అతని చేతుల్లో వెన్న ముద్దలా ఆమె కరిగిపోయింది.

ప్రక్కనేవున్న బంగళాలో ఇంకా లైట్లు వెలుగుతున్నయ్.

సరోజ చీర సవరించుకుని ఇంట్లోకి వచ్చింది. ఆమె వెనుకనే నారాయణరావుగూడ వచ్చాడు.

తలుపు లోపల గడియపెట్టి తాళం వేశాడు. అన్ని గదుల తలుపులు వేసి ఉన్నాయో, లేదో చెక్ చేసి బెడ్

రూమ్‌లోకి వచ్చాడు.

ఇంట్లో పిల్లలు ఇద్దరే నిద్రపోతూ కనుపించారు.

"సుధీర్ ఏడీ?" అని అడిగాడు నారాయణరావు.

"వాడి గదిలో ఇంకా చదువుకుంటున్నాడేమో!" అంది సరోజ. ఆ పూట వాడు భోజనానికికూడా రాలేదని అప్పుడు జ్ఞప్తికి వచ్చింది ఆమెకు.

ఇద్దరూ ఆతృతగా సుధీర్ చదువుకునే రూమ్‌లోకెళ్ళి చూశారు. లైటు వెలుగుతూనే ఉంది. పిల్లవాడు లేడు. ఎక్కడికెళ్ళినట్టు? ఏమయినట్టు?

సామాన్యంగా చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళేవాడు కాదు సుధీర్. ఆఖరుకు బడికి వెళ్ళేటప్పుడుగూడా "అమ్మా! బడికెళ్తున్నా" అని చెప్పి మరీ వెళ్ళే అలవాటు వాడికి.

"ఏదన్నా సినిమాకు వెళ్ళాడేమో!"

"అదీ లేదండి.వాడు సాయంత్రంనుంచే కనపడలేదు!" అన్నది సరోజ ఏడుపు దిగమింగుకుంటూ.

దూరంగా సముద్రపు అలలు ఉవ్వెత్తుగా లేచి పడుతున్నయ్. ఎవరన్నా ఫ్రెండ్స్‌తో సముద్ర స్నానానికి పోయి ప్రమాదానికి గురికాలేదుగదా అన్న భయం ఇద్దర్లో కలిగింది.

"ఎవరింట్లోనన్నా చదువుకోవడానికి వెళ్ళాడేమో! కనుక్కొని వస్తాను. నువు తలుపేసుకో!" అంటూ నారాయణరావు సైకిల్ వేసుకుని సుధీర్ క్లాస్‌మేట్స్ అందరిళ్ళలోనూ అడిగివచ్చాడు.

ఎవరినడిగినా తమ ఇంటికి రాలేదంటే తమ ఇంటికి రాలేదన్నారు.

విచారంతో నారాయణరావు ఇంటికి తిరిగివచ్చాడు.

"వాడిజాడ ఎక్కడా తెలీలేదు సరోజా!" అన్నాడు

దిగులుగా.

"అయ్యో! నా బాబుకేమయిందో ఏమోనండీ! నాకు భయమేస్తోంది" అంటూ శోకాలు పెట్టింది సరోజ.

"ఊరుకో సరోజా! రేపుదయం అన్నా రాకపోతాడా? రాకపోతే అప్పుడే పోలీసు రిపోర్టు ఇద్దాం. నలుగుర్నీ పోగుచేసి వెదుకుదాం!" అని ఊరడించాడు నారాయణ రావు.

సరోజ దుఃఖంతో ఏడుస్తూన్నది. నారాయణరావు ఊరడించినకొద్దీ ఆమె దుఃఖం ఎక్కువైపోతున్నది.

నారాయణరావు పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాడు. ఇన్స్‌పెక్టర్ ఆర్ముగం అతడి స్నేహితుడే.

"ఇన్స్‌పెక్టర్ మా అబ్బాయి కనిపించటం లేదు!" అన్నాడు జీరబోయిన కంఠంతో.

"అయ్యో పాపం! ఏదైనా సినిమాకు వెళ్ళాడేమో కనుక్కున్నారా?" ఇన్స్‌పెక్టర్ సానుభూతిగా అడిగాడు.

"లేదు! అతని స్నేహితులందర్నీ వాకబు చేశాం. అసలు రాత్రి భోజనాల టయిమ్ వరకూ ఇంట్లోనే ఉన్నాట్ట. ఆ తర్వాత నుంచి అతని జాడలేదు."

"ఎన్నేళ్ళుంటాయ్?"

"పధ్నాలుగేళ్ళు! పేరు సుధీర్. పదోక్లాసు చదువు తున్నాడు."

"ఇదివరకు ఎప్పుడన్నా ఇలా ఇంట్లోంచి మాయ మయ్యాడా?"

"లేదు ఇన్స్‌పెక్టర్! వాడు చాలా మంచి నడవడి కలవాడు. ఇంట్లో చెప్పకుండా ఎక్కడికీ పోడు."

"ఆల్‌రైట్! వెళ్ళేటప్పుడు ఏ డ్రెస్ వేసుకున్నాడో చెప్పండి. అనవాళ్ళుగూడా చెబితే వెదికిస్తాం!"

నారాయణరావు వివరాలు చెప్పాడు.

పోలీస్ స్టేషన్ నుంచి నారాయణరావు భారంగా అడుగులు వేసుకొంటూ సముద్రపు ఒడ్డుకు వెళ్ళాడు. తీరం వెంటే నడుస్తూ అలల వైపుగా చూశాడు చాలాసేపు.

'అలా జరిగి వుండదు. వెంట తోడు లేకుండా సముద్రస్నానం ఎన్నడూ చేయడు' అనుకున్నాడు మనసులో.

ఇంటికి చేరుకున్నాడు. వరండాలో సరోజ తన కోసమే ఎదురు చూస్తున్నది. తనను చూడంగానే తన గుండెలమీద తలవాల్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఊరుకో! సరోజా! రేపీపాటికి సుధీర్ మన చేతుల్లో ఉంటాడు!" అని ఊరడించాడు.

# 11

రాజా మేలుకున్నాడు. ఉదయకిరణాలు కిటికీలోంచి గదిలోపడి గదంతా వెలుగుని విరజిమ్ముతున్నయ్.

రాజు లేచాడు బెడ్ మీదనుంచి. ఉదయిస్తున్న సూర్యుడి వంక చూశాడు. ఎర్రగా అగ్నిగోళంలా అప్పుడే పైకి వస్తున్నాడు.

ఈ రోజు తన జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన రోజు. రేపువుదయానికి తను అత్యున్నత స్థితిలో లక్షలకు వారసుడయిపోతాడు.

తన ప్రక్కలో రాణిలేదు. ఆమె తనకంటే ముందల కడే లేస్తుంది. బహుశా బాత్‌రూమ్‌లోనో, వంట గది లోనో వుండి వుంటుంది. ఎందుకో అతనికి అనుమానం వేసింది. లేచి వంట గదిలోకి వెళ్ళాడు. ఆమె అక్కడ లేదు. బాత్‌రూమ్ వంక చూశాడు. ఆ తలుపు తీసే వుంది.

ప్రక్కగది తలుపు తెరిచి వుంది. బహుశా ఆపిల్ల వాడ్ని విడిపించిందేమో అని భయపడ్డాడు. తమ పని అయ్యేదాకా వాడు బయటికి వెళితే పోలీసులకు తమ గురించి తెలిసిపోతుంది. తమ ప్లాను అంతా పాడైపోతుంది.

రాజు లేవకముందే రాణి నిద్రలేచింది. వంట గదిలోకి వెళ్ళి మిల్క్ పౌడర్ కలిపి పాలు తయారుచేసింది. చక్కెర కలిపింది. అల్మరా తెరచి బ్రెడ్ తీసింది. లోపలకి నడిచింది.

సుధీర్ అప్పటికే నిద్రలేచాడు. కళ్ళు తెరుచుకుని నిస్సహాయంగా పడుకొని వున్నాడు.

రాణి అతని దగ్గరే కూర్చుంది.

"ఆకలిగా వుందా?"

అవునన్నట్లు తలవూపాడు.

"నీకు పాలు తెచ్చాను. కాని నీ నోటి ప్లాస్టరు తీశాక నీవు అరచి గోల చేయకూడదు. చేశావో వాళ్ళు వచ్చి నిన్నూ, నన్నూ ఇక్కడికిక్కడే చంపి పాతేస్తారు! సరేనా? అరవవు కదూ?"

అరవను అని తల అడ్డంగా వూపాడు.

అతడి నోటికున్న ప్లాస్టర్ లాగేసింది రాణి. అతడికి కొంచెం బాధ కలిగింది. అయినా ఓర్చుకుని అరవకుండా వుండ గలిగాడు.

అతడు పడుకున్న దుప్పటి అంతా తడిసిపోయింది. ప్రక్కలోనే మూత్రవిసర్జన చేసుకున్నట్టున్నాడు పాపం అనుకుంది. అతడ్ని ప్రక్కకు దొర్లించి ఆ దుప్పటి మార్చి మరో దుప్పటి పరిచింది.

అతడ్ని కూర్చోబెట్టి పాలు త్రాగించింది. బ్రెడ్ ముక్కలు త్రుంచి నోట్లో పెడుతోంది.

సరిగా అదే సమయానికి రాజు తలుపు నెట్టుకుని

లోపలకు వచ్చాడు.

అతడ్ని చూసి రాణి ఆకులా వణికిపోయింది.

"ఏం చేస్తున్నావ్ ఇక్కడ!" అరిచాడు రాజు.

"ఆకలిగా వుందేమోనని కొంచెం రొట్టె ఇస్తున్నాను" అంది తక్కువ స్వరంతో.

"నువ్వంటే మచ్చిక అయినట్టున్నాడు! అరచిగోల చేయలేదు! ఇక మరోసారి ఎప్పుడూ నాతో చెప్పకుండా వీడి దగ్గరకు రావద్దు."

"అలాగే!"

అతడి నోటికి మళ్ళీ ప్లాస్టర్ అంటించాడు రాజు. ఇద్దరూ బయటకు నడిచారు.

# 12

రాణి ఇల్లంతా నీళ్ళుపోసి కడిగింది. అలమార్లు, తలుపులు అన్నీ తడిగుడ్డతో శుభ్రంచేసింది. దేనిమీదా వాళ్ళ వేలి ముద్రలు దొరక్కుండా ఇల్లంతా అనుమానమున్నచోటల్లా తుడిచింది.

కనకం హోటలుకెళ్ళి క్యారియర్ భోజనం తెచ్చాడు. ముగ్గురూ ఆరగించారు.

ఆఖరి ఘట్టం ప్రదర్శించే నటులలాగా అంతా రెడీ అయారు.

కనకం మళ్ళీ బయటకు వెళ్ళాడు. బస్టాండ్‌కు దగ్గర్లో ఒక టీ స్టాల్ ముందు బెంచీమీద కూర్చున్నాడు.

ఆ పూట సుబ్బారావు మద్రాసు వెడతాడని అతడికి తెలుసు. సుబ్బారావు ఈ మధ్య సవేరాలో 'జాలీ' కేబరే డ్యాన్సుకి వెళ్ళటానికి అలవాటు పడ్డాడు. ఈ రోజుగూడా సవేరా హోటల్లో ఆమె డ్యాన్సు ప్రోగ్రాం వుంది.

సుబ్బారావు మధ్యాహ్నం వేళకు బస్సుస్టాండ్‌కి వచ్చాడు.

కాని అతడు ప్రయాణ సన్నాహంలో లేడు. జరిగిందేమంటే, భార్య సుభద్రని డబ్బు అడిగితే లేదంది. ఆమె మీద అలిగి కాసేపు అలా బయటకన్నా పోయివద్దామని బస్‌స్టాండ్ కేసి వచ్చాడు.

అతడ్ని చూస్తూనే కనకారావు, సుబ్బారావు దగ్గరకు వెళ్ళి ఆప్యాయంగా పలకరించాడు.

"హాలో బ్రదర్! ఇక్కడున్నావేంటి నీవూను! పిక్‌నిక్‌కి వచ్చావా ఏమిటి?" అని ప్రశ్నించాడు.

సుబ్బారావు అతడ్ని తేరిపార చూశాడు.

"అదేమిటి అలా చూస్తావ్! సవేరా హోటల్లో జూలీ కాబరే ప్రోగ్రాంకు మనిద్దరం చాలాసార్లు ఒకే టేబుల్ దగ్గర కూర్చున్నాం. గుర్తురాలేదా?"

'సవేరా', 'జూలీ' అనే పేర్లు అతివేగంగా పనిచేసినయ్ అతడిమీద. ఒకవేళ అతడు చెప్పేది నిజమేనేమో! తనూ అతడూ ఒక టేబుల్ దగ్గర కూర్చుని ఉండచ్చు. తనకి సరిగా గుర్తులేదు. క్యాండిల్ లైటులో అతని ముఖాన్ని తను సరిగాచూసి ఉండకపోవచ్చు. అదీగాక అందరిదృష్టి జూలీ నునుపైన అవయవాలమీద ఉంటుంది. ప్రక్కన మగవాళ్ళ ముఖాలుచూసే తీరిక ఎక్కడ.

"అవునవును! నేను సరిగా పోల్చుకోలేకపోయాను! ఏమిటి మీరిలా వచ్చారు!"

"నేనూ మా ఫ్రెండ్ ఇద్దరం కారులో కంచిచూసి వస్తూ ఇక్కడ ఆగాం. సాయంత్రానికి మద్రాసు చేరాలి. జూలీ ప్రోగ్రాం మిస్ అయితే ఎలా?" అన్నాడు కనకం నవ్వుతూ.

"బ్రదర్! మీరు మరోలా అనుకోకుండా ఉంటే

సాకూ లిఫ్టు ఇవ్వగలరా?" సంశయిస్తూ అడిగాడు సుబ్బారావు.

"ఆ మాట అడగడానికి సందేహిస్తారేం! ఉయ్ ఆల్ ఆర్ ఫ్రెండ్స్! తప్పకుండా రండి!" అన్నాడు కనకం.

సుబ్బారావు ఆనందానికి అవధుల్లేవు. కాకపోతే పవేరాలో దిగటానికి డబ్బుకావాలి. అందాకా వెళ్ళాక పర్సు మరిచిపోయి వచ్చాననో, లేక జారిపోయిందనో బొంకవచ్చు. ఆ తర్వాత వాళ్ళే తననూ తీసుకుపోతారు లోపలికి అనుకున్నాడు.

"రండి! వెడదాం! మా ఫ్రెండ్ అతనికి తెలిసినవాళ్ళ ఇంటిదగ్గర ఉంటానన్నాడు!" అంటూ కనకం దోవ తీశాడు. అతడు కనకాన్ని అనుసరించాడు.

ఇద్దరూ రాజు బంగళాలోకి వెళ్ళారు. రాజు వీళ్ళకోసమే ఎదురు చూస్తున్నాడు ఆత్రంగా. సుబ్బారావు వెనకగా నడుస్తూ కనకం కన్నుగీటాడు. రాజు అంతా సక్సెస్ అయిందని సంతోషపడ్డాడు.

రాణి బాటిల్స్ తెచ్చి టేబుల్ మీద పెట్టింది.

"కొంచెం ఔషధం సేవించి బయలుదేరుదాం సుబ్బారావుగారూ!" అన్నాడు కనకం.

"ఓ! దానికేం? నేనూ రెడీ!" అన్నాడు సుబ్బారావు.

గ్లాసులు నిండినయ్. సుబ్బారావు వెంటవెంటనే త్రాగుతున్నాడు. అతడికి ఎదురుగా మరో గదిలో రాణి బట్టలు మార్చుకుంటోంది. ఓరగా వేసి ఉన్న తలుపు సందులోంచి సగం సగం నగ్నశరీరం కనబడుతోంది. మత్తు ఆవరిస్తున్న కొద్దీ అతడికి నిషా ఎక్కుతోంది.

వెనకనుంచి అతడి తలమీద గట్టి దెబ్బపడింది. అంతే! అతడు స్పృహతప్పి పడిపోయాడు.

రాజు గుడ్డపేలికలను నీళ్ళలో తడిపి వెంటనే అతడి

తలకు కట్టుకట్టాడు.

ఆ తర్వాత ముగ్గురూ గబగబ పనిచేయసాగారు. ఎవరో వెనుకనుంచి తరుముతున్నంత వేగంగా సామాన్లన్నీ సర్ది కారులో పెట్టారు.

చేతులకు సర్జికల్ గ్లోవ్స్ తొడుక్కున్నారు. తలకు క్రాప్ హెల్మెట్స్ తగిలించుకున్నారు. కూలింగ్ గాగుల్స్ పెట్టుకున్నారు. ఈ కొత్త మేకప్‌లో ఎవరూ తొందరగా గుర్తించలేరు.

సుబ్బారావుని చెరొక వేపు పట్టుకుని కార్లో పడేశారు.

ఇంట్లో తమకు సంబంధించిన సామాన్లు ఏవీ లేవని నిర్ధారణ చేసుకున్నారు. డ్రైవింగ్ సీట్లో కనకం కూర్చున్నాడు. అతని ప్రక్కనే రాజు కూర్చున్నాడు. వెనుక సీట్లో సుబ్బారావు ఒళ్ళు తెలీకుండా మైకంలో పడి ఉన్నాడు.

రాణి కారులో ఎక్కటానికి తడబడుతూన్నది.

"ఏమిటాలస్యం! త్వరగా ఎక్కు! వాడికి మళ్ళీ తెలివి వస్తే ఇబ్బంది!" అని కసురుకున్నాడు రాజు.

"ఒక్క నిమిషం! టాయిలెట్‌లోకి వెళ్ళొస్తాను" అంది రాణి.

"కానీ! త్వరగా ఏడు! మీ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది" అని విసుక్కున్నాడు.

రాణి లోపలకు పరుగెత్తింది. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి టాప్‌ని పూర్తిగా తిప్పింది. నీళ్ళు పెద్ద శబ్దం చేస్తూ బేసిన్‌లో పడుతున్నాయ్.

రాణి ప్రక్కగదిలోకి నడిచింది. సుధీర్ కళ్లు తెరుచుకుని పైకప్పు కేసి చూస్తూ పడుకున్నాడు.

అతడి నోటికి అతికించివున్న ప్లాస్టర్ని గభాల్న పీకేసింది. కాలికి కట్టివున్న తాడు ముడి విప్పింది. చేతులకి

వున్న కట్లుగూడ ఊడదీసింది.

"వాళ్ళు బయటికి వెళ్ళిపోతున్నారు. ఒక అరగంట ఇలాగే ఇక్కడే ఉండిపో. ఆ తర్వాత గోడదూకి మీ ఇంట్లోకి వెళ్ళు. ఎవ్వరికీ ఏమీ చెప్పకు. ఏం?" అంది రాణి.

అలాగే అన్నట్టు సుధీర్ తల ఊపాడు.

గది తలుపు దగ్గరగాలాగి, రాణి వంటగది దాటుకుని పొల్లోంచి బయటకు పరుగెత్తింది.

కారు డోర్ లాగి వెనుకసీట్లో సుబ్బారావు ప్రక్కగా కూర్చుంది.

"రైట్!" అంది రాణి.

కారు స్టార్టయింది. సాయంత్రం నాలుగవుతోంది. రోడ్లమీద జనసంచారం అట్టేలేదు.

# 13

డాక్టర్ విష్ణువరన్ ఇంటిముందు కారాగింది.

కనకం గేటుముందు నిలబడి పెద్దగా అరిచాడు.

"ఎవరయ్యా లోపల! త్వరగా రండి! సుబ్బారావట! మీ మనిషికదా! స్పృహతప్పి రోడ్డుమీద పడిపోయాడు."

లోపల్నుంచి రాములు పరుగెత్తుకొచ్చాడు. తాళంతీసి గేటు తెరిచాడు.

కారు లోపలకు వచ్చింది.

ఇంతలో సుభద్రగూడ బయటకు వచ్చింది.

కనకం, రాజు ఇద్దరూ సుబ్బారావుని చేతులమీద లోపలకు తీసుకువెళ్ళారు. సుభద్ర ఆత్రృతగా వాళ్ళకు దోవచూపింది.

డాక్టర్ విష్ణువరన్ గదిలోకి తీసుకెళ్ళి బెడ్ మీద పడుకో బెట్టారు. విష్ణువరన్ అతడికి వైద్యంచేసే పనిలో నిమగ్నుడయాడు.

రాణి కారుని రివర్స్ చేసింది. లోపల్నుంచి వాళ్ళు రాగానే పారిపోవటానికి వీలుగా ఉండటానికి.

కారులోంచి తాడుతీసింది. ఆ తాడుకి చివర చిన్న రాయి ఉంది. ఆ రాయి పుచ్చుకుని తాడు మధ్యలో పట్టుకుని రాయిని టెలిఫోన్ తీగలమీదకు విసిరింది. తాడు తీగలమీదుగా క్రిందకు వ్రేలాడుతోంది. తాడు రెండు కొనల్ని పుచ్చుకుని తన బలంకొద్దీ లాగింది. టెలిఫోన్ తీగలు తెగి చివరలు నేలమీద ఆనుతూ ఉన్నయ్.

"ఏయ్ అమ్మాయ్! ఏమిటా పని!" అన్నాడు రాములు. ఆమె కోంటెతనానికి ఆ పని చేస్తున్నదని అనుకున్నాడు అతడు.

"ఇలారా మాట!" అంది రాణి.

ఏదో రహస్యం వినేవాడిలా అతడు దగ్గరకు వచ్చాడు. వెనుకగా దాచిన పెద్ద రెంచీతో అతడి తలమీద మోదింది.

అతడు "అబ్బా!" అంటూ పడిపోయాడు. అతడ్ని లాక్కువెళ్ళి గోడవారగా చెట్లల్లో పడేసింది.

గేటు దగ్గరకు వెళ్ళి బార్లా తెరిచింది. రివాల్వర్ని తన ప్యాంటు జేబులోదాచుకొని రెడీగా కారుదగ్గరే నిల బడింది.

రాజు తనచేతిలో పిస్టలు చూపిస్తూ "హాండ్సప్! ప్రాణాలమీద ఆశవుంటే కదలద్దు!" అని అరిచాడు.

కనకం మరో పిస్టలుతో సుభద్రను పొదివి పట్టు కున్నాడు.

స్టెతస్కోప్ జారవిడిచి విష్ణువర్ధన్ చేతులు పైకెత్తి నిలబడ్డాడు.

"డాక్టర్! మాకు అనవసరంగా రక్తపాతం కలిగించటం ఇష్టంలేదు. త్వరగా మీ సేఫ్ తెరవండి!" గర్జిం

చాడు రాజు.

"మిస్టర్! మీరేంచేసినా ఫర్వాలేదు. కాని నేను హార్ట్ పేషెంట్ ని. నాకేమాత్రం ఆదుర్దా కలిగించినా నాకు హార్ట్ ఎటాక్ వస్తుంది. ఆ తర్వాత సేఫ్ ఎలా తెరవాలో ఎవరూ చెప్పలేరు!"

"ఆల్ రైట్! కనకం! ఆ అమ్మాయిని వివస్త్రని చెయ్యి. అతడు మాటలతో లొంగడు!" అన్నాడు రాజు.

డాక్టర్ విష్ణువర్ధన్ బ్రాన్పడిపోయాడు. తనను సేఫ్ రహస్యం చెప్పమని చిత్రహింసలు పెట్టినా ఓర్చుకోవాలి. వాళ్ళకా రహస్యం చెప్పగూడదు అనుకున్నాడు. కాని వాళ్లు తనను వదిలేసి, సుభద్రను పట్టుకున్నారు. తన యావదాస్తిపోయినా సరే కాని, ఆమెకు హాని జరిగితే తను భరించలేడు.

"ఆగండి! సేఫ్ ఎలా తెరవాలో చెబుతాను. మూడూ, ఏడూ, రెండు త్రిప్పండి" అంటూ తాళాలు ఇవ్వబోయాడు.

"సేఫ్ ని తాకంగానే మాకు ఎలక్ట్రిక్ షాక్ తగలాలనా? ఆ పప్పులేం వుడకవ్. సేఫ్ తెరు!"

డాక్టర్ విష్ణువర్ధన్ సేఫ్ దగ్గరకు నడిచాడు. స్విచ్ బోర్డుమీద ఒక స్విచ్ ని క్రిందకు నొక్కాడు. ఆ తర్వాత స్ట్రాంగ్ రూమ్ తాళం తీశాడు. షట్టర్ పైకి లేచింది.

అతడి వెన్నులో రివాల్వర్ ని గ్రుచ్చిపట్టి లోపలకు వెళ్లాడు రాజు.

నెంబర్ లాక్ లో రెండు మూడు పరసలు త్రిప్పాడు. కీహోల్ లో తాళం చెవి దూర్చి త్రిప్పాడు. సేఫ్ తలుపుని బలంగా లాగాడు. ఆ లాగటంలో కొంచెం వెనక్కి తూలాడు.

అలా జరుగుతుందని వూహించిన రాజు తమాయించు

కుని పొజిషన్‌లో నిలబడ గలిగాడు. లేకపోతే డాక్టర్, తనూ ఇద్దరూ క్రింద పడిపోయేవారు. చేతిలోని రివాల్వరు దూరంగా పడిపోయేది. అంతా తలక్రిందులై తాము చావటమో లేక ప్రాణాలతో పట్టుబడటమో జరిగేది.

మనిషెత్తు సేఫ్‌లో నోట్ల కట్టలు చూసి రాజు, కనకంల కళ్ళు ఆదోరకం వెలుగుతో మెరిసినయ్.

"ఏమిటిదంతా? ఆ డబ్బు ముట్టుకోవటానికి వీలేదు" అని అరుపు వినపడింది. కనకం అటువేపు చూశాడు, ఒక చేత్తో సుభద్రను గట్టిగా పొదివి పట్టుకుని.

సుబ్బారావుకు మెలకువ వచ్చింది. కళ్ళు తెరుస్తూనే అతడి చూపులు తెరిచివున్న సేఫ్‌లోని నోట్ల దొంతరల మీద పడింది. తన భార్య మరొకడి చేతిలో బందీ అయి వుండటం, వాళ్ళ చేతుల్లోని రివాల్వర్సు చూసి పరిస్థితి వూహించాడు.

"మిస్టర్ లేచి నిల్చో. చేతులు మెడమీద అనించి గోడవైపు తిరుగు!" కనకం అరిచాడు.

"రాస్కెల్! నన్ను మోసం చేసింది ఇందుకా. చూసుకో నిన్నేం చేస్తానో!" అంటూ చేతికందుబాటులోవున్న ఫ్లవర్ వేజ్‌ని తీసి కనకం మీదకు విసిరాడు. కనకం కొంచెం ప్రక్కకు తిరిగాడు.

ఫ్లవర్ వేజ్ గాలిలోంచి వచ్చి సుభద్రకు తగిలింది. కణతకు దెబ్బతగిలింది. నెత్తురు కారింది. తుడుచుకునే అస్కారంకూడా లేకుండా ఆమె చేతుల్ని కనకం అదిమి పట్టుకున్నాడు. ఆమె తనకు తగిలిన దెబ్బ నుంచి తేరుకునేలోగా మరో ఘోరం జరిగింది.

కనకం చేతిలోని రివాల్వరు ప్రేలింది. సుబ్బారావు గుండెలో ఒకటి; పొట్టలో ఒక బుల్లెట్ దిగినయ్.

మెలికలు తిరుగుతూ నేలమీద పడిపోయాడు సుబ్బారావు.

"వద్దు! వద్దు! కావాలంటే నన్ను చంపండి! ఆయన్నేం చేయవద్దు!" అని అరిచింది సుభద్ర.

కాని అప్పటికే సుబ్బారావు ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయినయ్.

డాక్టర్ విష్ణువర్ధన్, సుభద్ర అరుపులకు చలించిపోయాడు. అతడి కళ్ళు చెమర్చినయ్. పెదవులు వణికినయ్. తను ఏం చేయటానికీ ఆస్కారం లేదు. సాహసించి ఏదైనా చేస్తే తన కళ్ళముందే సుభద్రను నానా భీభత్సం చేస్తారు. అది తను సహించలేడు.

రాణి సూట్‌కేసుల్ని తెచ్చి అక్కడ్నుంచి తిరిగి తను క్రిందకు వెళ్ళిపోయింది. రాసులుగా పడివున్న నోట్లకట్టలను చూసిగూడ ఆమె చలించలేదు. త్వరగా ఈవ్యవహారం పూర్తయి ఇక్కడ్నుంచి తాము తప్పించుకుని బయటపడితే చాలు అన్నట్టుగా ఆమె ఆతృత పడుతున్నది.

రాజు సూట్‌కేసుల్ని తెరిచి సేఫ్ దగ్గర వుంచాడు. విష్ణువర్ధన్ తన స్వంత చేతుల్తో నోట్లకట్టలను వాటిలో సర్దాడు. అతడికీ, వీళ్ళకు కావల్సినదేదో తీసుకుని వాళ్ళు ఎంత త్వరగా ఈ ఇంటిని వదిలిపోతే అంత మంచి దనిపించింది.

క్రింద నుంచి కారు హారన్ అదే పనిగా మ్రోగింది. రాజూ, కనకం ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. కారుహారన్ మ్రోగిందంటే ఎవరో వచ్చారని సంకేతం.

కనకం కిటికీ దగ్గరకు వెళ్ళి తొంగిచూశాడు. మరో కారు వచ్చి ఆగింది. అందులోంచి ఇద్దరు స్త్రీలు, ఓ ముసలాయన దిగారు.

సూట్‌కేసులు నిండినయ్. వాటిని మూసేశారు.

సేఫ్‌లోదంతా ఎత్తుకుపోవాలంటే ఓ లారీ కావాలి. దొరికినదానితో తృప్తి పడకుండా అత్యాశకు పోతే అసలుకే ముప్పు కలగవచ్చు.

సేఫ్ మూసేసి, షట్టరు క్రిందకులాగి తాళం వేసేశాడు, విఘ్నేశ్వరన్. వెనక్కు వచ్చి సోఫాలో కూర్చున్నాడు. అతడి ప్రక్కగా రాజు మరో కుర్చీ లాక్కుని కూచు న్నాడు. అతడి చేతిలోవున్న రివాల్వరుపై టకలు కప్పాడు.

"వాళ్ళు వస్తున్నట్టున్నారు, వెధవ వేషాలు వేసి ప్రాణాలు పోగొట్టుకోకండి!" అని హెచ్చరించాడు.

సుభద్రను అలానే పొదివి పట్టుకుని తలుపు వెనకగా దాక్కున్నాడు కనకం.

వచ్చిన అతిథులు లోపలకు రాంగానే ధడాలున తలుపు మూసేశాడు కనకం.

వాళ్ళలో ఒకామె నేలమీద శవాన్ని చూసి భయంతో కెవ్వుమని అరవబోయింది. కాని ముసలాయన ఆమె నోరు మూసేశాడు. "ఇక్కడ అంతా నవ్యంగా లేనట్టుందే!" అన్నాడు నింపాదిగా.

"అది మీ సత్ప్రవర్తనమీద ఆధారపడి వుంటుంది. అలా ఆ మూలకు వెళ్ళి గోడవైపుకు తిరిగి నిల్చోండి. మీ చేతులు మెడమీద వుంచండి. అయిదు నిముషాల్లో వెళ్ళి పోతాం! ఆ తర్వాత మీరు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు!" అన్నాడు కనకం రివాల్వర్‌ని వాళ్ళందరి వంకా ఆడిస్తూ.

"బాబూ! ప్రాణాలు తియ్యకు! చచ్చి నీ కడుపున పుడతాం!" అంది మరొకామె.

నేలమీదవున్న తాడుతో రాజు, డాక్టర్ విఘ్నేశ్వరన్‌ని సోఫాకేసి కట్టేశాడు. కాళ్ళూ చేతులు గట్టిగా బంధిం చాడు. అతడికి హార్ట్ ఎటాక్ వచ్చి సోఫాలో అచేత

నంగా పడిపోయాడు.

తర్వాత సుభద్రను మరో కుర్చీలో కూర్చోబెట్టి తాళ్ళతో కట్టేశారు. వచ్చిన ముగ్గురు అతిధుల్నిగూడా తాళ్ళతో కట్టిపడేశారు. టేప్ తీసి వాళ్ళ అందరి నోళ్ళకు అతికించేశారు. సుభద్ర కన్నీరు మున్నీరుగా ఏడవసాగింది.

కిటికీలోంచి తల బయటికి పెట్టి రాణిని కేకేశాడు.

ఆమె పైకి వచ్చింది. సూట్ కేస్ తీసుకోమన్నట్టు సంజ్ఞ చేశాడు. ఆమె సూట్ కేస్ తీసుకుని క్రిందకు నడిచింది మెట్లుదిగి.

కనకం మరో సూట్ కేసు పుచ్చుకున్నాడు. రాజు క్రిందవున్న మూడో కేస్ని అందుకోవడానికి ముందుకు వంగాడు. ఆతని చేతిలోని రివాల్వరు ప్రేలింది.

బుల్లెట్స్ సూటిగా వెళ్ళి కనకానికి తగిలాయి. అతడి చేతిపట్టు విడిపోయింది. చేతిలోని సూట్ కేస్ క్రింద పడిపోయింది. ఆ తర్వాత అతడు నేలకూలాడు.

"రాజు సంపాదనలో వాటా ఎవరికీ దక్కకూడదు! గుడ్ బై పార్ట్నర్!" అంటూ రాజు రెండు చేతుల్లోనూ రెండు కేసుల్నూ తీసుకుని క్రిందకు పరుగెత్తాడు.

అప్పటికే రాణి తను తీసుకొచ్చిన సూట్ కేసుని తమ కారులో వేసి స్టీరింగ్ ముందు కూర్చుంది రెడీగా.

అతిధులు తీసుకువచ్చిన కారుని చూడంగానే రాజుకి ఐడియా వచ్చింది.

అంతలోనే దూరంగా మైక్ లో ఏదో ప్రకటన వినిపించింది.

# 14

కారు వెళ్ళిపోయిన చప్పుడు విని సుధీర్ లేచి నిల బడ్డాడు.

తనను కట్టివేయబడిన తాళ్ళ ఒరిపిడికి కాళ్ళూ చేతులూ ఒరవడి పడి ఆ చోట్లంతా మంటగా వుంది. నోరు తడారి పోయి వుంది.

గోడను ఊతంగా కాళ్ళు జాడించాడు ఒకసారి. ఒక రోజల్లా కట్టిపడివేయటం మూలాన కాళ్ళు సరిగా అనటంలేదు.

ఇంట్లోంచి ఎక్కడన్నా అలికిడి వస్తుందేమో అని చెవులు రిక్కించి విన్నాడు. ఆ ఇంట్లో ముగ్గురిలోనూ ఒకడ్ని క్రూరంగా చంపేశారు. మిగతా ఇద్దరు రాక్షసుల్లో ఒకడు ఇంకా ఇంట్లోనే వుండవచ్చు అనే అనుమానంతో కొంచెంసేపు నిరీక్షించాడు. ఇంట్లో మనుషులున్న అలికిడి రాకపోవటంతో అతడు తలుపు తెరిచాడు.

బయట ప్రపంచం అంతా మామూలుగానే కనబడింది అతడికి. చెట్లమీద అరుస్తూ గోలచేస్తూన్న పక్షులను చూడంగానే అతడిలో నూతనోత్సాహం వచ్చింది. ఇప్పుడు తను కూడా స్వతంత్రుడే. ఆ రాక్షసులు వెళ్ళిపోయారు.

వాళ్ళు తన చేయి దాటిపోయారనేసరికి వుద్రేకం కలిగింది. ఆ రాక్షసుల్ని వదలగూడదు అనుకున్నాడు.

గబగబ అడుగులు వేస్తూ గోడ దగ్గరకు వెళ్ళాడు. నాలుగడుగుల పిట్టగోడ అది. ఒక్క వూపులో ఎగిరి కూర్చున్నాడు. మరో గెంతుతో తన ఇంటి ఆవరణలో వున్నాడు.

పెరటి తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు. అతని తల్లి ముందు వసారాలో కూర్చుని ఏడుస్తూ వున్నది చెల్లాయిని ఒళ్ళో కూర్చోబెట్టుకుని.

సుధీర్ ని చూస్తూనే ఆమె ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"సుధీర్! నాయనా! ఎక్కడికి వెళ్ళావ్ మమ్మల్ని వదిలి!" అని అరిచింది.

రోడ్డుమీద గేటు దగ్గర నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్న తండ్రి లోపలకు పరుగెత్తుకొచ్చాడు.

"సుధీర్! ఎక్కడకు వెళ్ళావు!" అన్నాడు ఆత్రంగా. సుధీర్ ఒంటిమీద ఒరపిడి చారల్ని చూస్తూ "ఏమైంది?" అనడిగాడు.

"ప్రక్కింట్లోకి దిగాను నాన్నా! వాళ్ళు నన్ను బంధించి గదిలో దాచారు. ఆ ఇంట్లో ఇంకో శవంగూడా వుంది. వాళ్ళు ఇంకా ఇద్దరు మొగవాళ్లు, ఒక ఆడామె వుంది. అందులో ఒకడి ఫోటో పేపర్లోగూడా వేశారు పోలీసువాళ్ళు. వాడ్ని పట్టుకుంటే బహుమతి అని ప్రకటించారు. వాడు అవునో, కాదో నిర్ధారణ చేసుకుందామని వెళ్ళాను. వాళ్ళకు పట్టుబడిపోయాను. ఆడామె చాలా మంచిది నాన్నారూ! నన్ను చంపకుండా కాపాడింది! నాన్నా! మనం పోలీస్టేషన్ కి వెళ్ళాలి!"

సుధీర్ ఏకబిగిన మాట్లాడేస్తుంటే గుడ్లప్పగించి విన్నారు నారాయణరావు, సరోజ.

మరో పావుగంటలో పోలీస్ వేన్ వచ్చి ఆ ఇంటి ముందు ఆగింది. పోలీసులు ఇల్లంతా శోధించి కుళ్లుకంపు కొడుతున్న శవాన్ని బయటకు లాగారు.

సుధీర్ చెప్పిన ఆనవాళ్ళను బట్టి మాజీ హంతకుడూ, నేరస్థుడూ అయిన రాజుని ఇట్టే పోల్చుకున్నారు. నల్లకారు అనిగూడా సుధీర్ చెప్పాడు.

వెంటనే అన్ని స్టేషన్లకూ మెసేజ్ చెప్పబడింది. మహాబలిపురం నుంచి బయటకు వెళ్ళే రోడ్లన్నిటిమీద గట్టి బందోబస్తు చేయబడింది. వచ్చేపోయే ప్రతికారునీ చెక్ చేసిగాని మరీ పోనివ్వటంలేదు.

అంతేకాకుండా, పోలీస్ వేన్ మైక్‌లోంచి ప్రకటన చేయబడింది పౌరుల రక్షణ గురించి.

ఇన్‌స్పెక్టర్ ఆర్ముగం షాక్ తిన్న వాడిలా లేచాడు. ఆ నేరస్థులు ఈ ఊరు ఏ పథకంతో వచ్చి వుంటారు? ఎంత ఆలోచించినా, వారి గమ్యం డాక్టర్ విష్ణువర్ధన్ కారాగారం దగ్గరికి పోతున్నది అతని ఆలోచన.

జీప్ వేసుకుని మరో నలుగురు పోలీసుల్ని వెంటబెట్టు కుని డాక్టర్ విష్ణువర్ధన్ ఇంటికి బయలుదేరాడు.

# 15

దూరంగా మైక్‌లో పోలీసులు చెబుతున్న ప్రకటన వినబడుతోంది.

"రాణి! త్వరగా! నీవు ఆ కారులో మద్రాసు వేపుగా పద! నేనూ ఈ రెండో కారులో వచ్చి నిన్ను కలుసు కుంటాను!" అని అరిచాడు.

రాణి కారు స్టార్టుచేసింది. కారు బయటకు దూకింది. మలుపులు తిరిగింది. వెనుక వేపునించి వస్తున్న జీప్‌లోని ఆర్ముగం సంతోషంతో అరిచాడు.

"అదుగో! అదే కారు! జీపు పోనీయ్ వేగంగా!"

రియర్ వ్యూలో వెనుకగా పోలీసు జీపు రావటం రాణి కంటబడింది. ఆమెలో ఉద్వేగం ఎక్కువయింది. కాలు ఏక్సిలేటర్‌ని బలంగా త్రొక్కింది.

కారుకీ జీప్‌కీ దూరం హెచ్చయింది. అదే పనిగా హారన్ మ్రోగిస్తూ కారుని పోనిస్తున్నది రాణి. దోవలో

మనుష్యులు బండ్లూ అడ్డం వస్తూన్నా ప్రక్కకు తప్పుకుని ముందుకు పోతున్నదే గాని బ్రేక్ మీద కాలు పెట్టలేదు.

రాణికారు అటు వెళ్ళగానే దాని వెంట పోలీసు జీప్ వెంబడించటం చూశాడు రాజు. తన అదృష్టం బాగుండి వాళ్ళు తనని చూడలేదు.

మైక్‌లో పోలీసు ప్రకటన వినపడుతోంది. "యూవర్ ఎటెన్షన్ పోలీస్ పర్సనల్. నేరస్థులు కారులో మద్రాసు వెళ్ళే హైరోడ్డు మీదుగా పారిపోతున్నారు. పోలీసు కార్లూ జీప్‌లూ అన్నీ అటుగా వెళ్ళాలని సర్కిల్ ఇన్‌స్పెక్టర్ వారి ఆజ్ఞ. కారు నల్లరంగుది. నెంబరు MYP 2698. పాత మోడల్ ఫోర్డ్!"

రాజు నవ్వుకున్నాడు. తిరిగ్గా కారుని టూరిస్ట్ లాడ్జీ ముందు ఆపాడు. రెండు సూట్‌కేసుల్నీ మోసుకుని లోపలకు వెళ్ళాడు.

రూమ్‌లో సూట్‌కేసులు తెరిచాడు. ఆ డబ్బునంతటిని రెండు పెద్ద సైజు గుడ్డసంచుల్లో సర్దాడు. నెత్తిమీద హెల్మెట్ తీసేశాడు. బాత్‌రూమ్‌లోకెళ్ళి శుభ్రంగా స్నానం చేశాడు.

ఈ ఊరినుంచి బయటపడాలంటే రోడ్డు రవాణా అంతా చెక్ చేయబడుతోంది, కనుక కారులోగాని, టాక్సీలోగాని, బస్సులోగూడ తను పోలేడు. ఇక పోతే సముద్రం మీదుగానే పారిపోవాలి!

గది తాళంవేసి టూరిస్ట్ క్లబ్ కేసి నడిచాడు. తీరంలో మోటార్‌బోటు ఒకటి ఉంది. సముద్రంలోనుంచి వచ్చే నీళ్ళమీదుగా ప్లాట్ ఫారమ్ ఒకటి ఉంది. దాని ప్రక్కనే మోటార్ బోటు ప్లాట్ ఫారంమీద రొయ్యకు కట్టివేయబడి ఉంది.

దూరంగా మినుకు మినుకుమంటూ సముద్రంమీద లైట్లు కనబడుతున్నాయ్. అదీ ఏదో పట్టణం అయి ఉంటుంది. తెల్లారేలోగా తను ఆ తీరాన్ని చేరుకోగలిగితే, మర్నాడుదయంకల్లా తను కోటీశ్వరుడైపోతాడు.

ప్లాట్ ఫారమ్ చివరగా ఆయిల్ టిన్ను ఉంది. అదృష్టమంటే తనదే అనుకున్నాడు రాజు. కాకపోతే మోటార్ బోట్, ఆయిల్ టిన్ను అన్నీ అక్కడే సమకూరుతాయా?

హోటల్లో భోజనంచేసి సంచుల్ని భుజానికి తగిలించుకున్నాడు. రివాల్వరు జేబులో భద్రపరుచుకుని ఆటోరిక్షాలో క్లబ్ వేపుగా వెళ్ళాడు. బీచ్లోంచి అడుగులు వేసుకుంటూ బోట్ క్లబ్ ప్లాటుఫారమ్ మీదకు వెళ్లాడు. సంచుల్ని బోటులో పడేశాడు.

ఊళ్ళో సంచలనంగా ఉండటంవల్ల జనం అందరూ ఎవరిళ్ళలో వాళ్ళు ఉండిపోయారు. మాటిమాటికీ వినపడే సైరన్లూ, ప్రకటనలూవిని హంతకులు తమ ఇంట్లోకి దూరతారేమో అని జాగ్రత్తపడుతున్నారు.

అందుకే బోట్ క్లబ్ గూడ నిర్మానుష్యంగా ఉంది. ఎవరూ లేరు.

రాజు ఆయిల్ టిన్నుని తీసుకుని బోట్లో పెట్టాడు. ప్లాట్ ఫారమ్మీది తాడుని కత్తితో కోసేశాడు.

తెడ్డు తీసుకుని బోట్ని సముద్రంలోకి పోనిచ్చాడు. గంటసేపు అలా గడిచిన తర్వాత తెచి డబ్బాలోని ఆయిల్ని ఇంజనులో పోశాడు. ఆ తర్వాత ఇగ్నిషన్ కీ త్రిప్పాడు.

ఒకటి రెండుసార్లు ట్రబులిచ్చిన తర్వాత మూడోసారి బోట్ స్టార్టయింది.

అనంతమైన ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నయ్. అగాధమైన సముద్రంమీద బోటులో రాజు ముందుకు సాగిపోతున్నాడు. రేపుదయానికి తను ఏదో ఒకతీరాన్ని తాకితే ఆ తర్వాత తను ఎలా జీవించబోయేది ఊహించుకుంటూవున్నాడు.

బోట్ ఇంజన్ చప్పుడు మినహా మరో శబ్దం వినరావటంలేదు. సముద్రం మీదుగా వచ్చేగాలికి అతడి జుట్టు రేగిపోతున్నది.

# 16

రాజు తన అవసరం పూర్తవగానే కనకాన్ని కాల్చి చంపటం ఆమెకు బాధ కలిగించింది. కాస్తో, కూస్తో వాడికే పారేస్తేపోయేది. నిర్లిప్తంగా ఉన్న రాణికి పోలీస్ సైరన్ వినేసరికి ఆమెలో సంచలనం ప్రారంభమయింది.

కారు వేగం తగ్గకుండా జాగ్రత్త పడుతున్నది. జైలు కటకటాలు, పోలీస్ మాట్రన్ల అదిలింపులూ, జైల్లో ఖైదీల ఇబ్బందులు అన్నీ ఆమె కళ్ళముందు తిరిగినయ్.

ఎదురుగా పెద్ద ట్రక్కు వస్తోంది. మరోవైపు మలుపులోంచి చెవర్లెట్ కారు వస్తోంది. ట్రక్కుకి సైడ్ ఇచ్చి హారన్ మ్రోగిస్తోంది, అదే పనిగా.

చెవర్లెట్ కారు ఎడమ ప్రక్కనుంచి కుడివేపుకు రోడ్డు కడ్డంగా వచ్చింది. స్టీరింగ్ త్రిప్పింది గిర్రున. కారు బాగా ప్రక్కకు వెళ్ళింది. చెవర్లెట్‌ని తప్పుకుని మళ్ళీ రోడ్డెక్కింది.

కాని ఈలోగా చెవర్లెట్ కారు స్పీడు కొంచెం తగ్గించటంలో తనకారు దాని డిక్కీని రాచుకుంటూ రోడ్డెక్కింది. చెవర్లెట్ రోడ్డుదిగి ప్రక్కనే వున్న చిన్న గోతిలోకి దిగబడింది. డ్రైవర్ తిట్టుకుంటూ

దిగాడు.

రాణి నవ్వుతుంది తన సాహసానికి. ఏదో స్టంట్ పిక్చర్లో హీరోయిన్‌లా తను గొప్ప ఫీట్ చేసింది.

ఆమె కళ్ళముందు స్టుడియోలూ, కెమెరాలూ మెదిలినయ్. లైట్ల వెలుగులో తను హీరోయిన్ వేషంలో కెమెరా ముందు నిలబడింది. షూటింగ్ జరుగుతోంది. సస్పెన్స్‌తో నిండిన ఏడ్వెంచర్ సీన్‌లో తను పాల్గొంటున్నట్టుగా ఫీలయింది.

మరో జంక్షన్ వచ్చింది. ఈ నాల్గురోడ్ల కూడలిలో కొంచెం ట్రాఫిక్ కనబడింది. ఎద్దుల బండ్లూ, కార్లూ, పొరుగూరి సినిమా జనం కొంతమందీ నడుస్తున్నారు.

రాణి హారన్ మ్రోగిస్తూ జనం తక్కువగా ఉన్న మలుపులోకి త్రిప్పింది.

ఎదురుగా మరో అంబాసిడర్ కారు ఎదురువచ్చింది. అయినా ఆమె ఆగలేదు. ఎదురుగా అతివేగంగా డేర్ డెవిల్‌లా వస్తున్న కారును చూసి అంబాసిడర్ కారు ప్రమాదాన్ని ఊహించి సెకన్లలో ప్రక్కకు తప్పుకుంది.

రాణి నిట్టూర్పు విడిచింది. కారు ఇంకొంచెం ముందుకు పోయేసరికి ముందు మరో కారు అడ్డం వచ్చింది. ఆ కారూ తనుపోతున్న వేపే పోతున్నది. కాని తను దానికన్నా వేగంగా పోవాలి.

ఆ కారు సైడ్ ఇవ్వడం లేదు. వ్యూ ఫైండర్‌లోకి చూసింది. పోలీస్ జీప్ దగ్గరౌతున్నది.

తన కారు స్పీడు ఎక్కించింది. ముందు పోతున్న కారుని ఒక ప్రక్కగా గుద్దేసింది. ముందు కారు అడ్డదిడ్డంగా తిరుగుతూ ప్రక్కకు జారిపోయింది.

విలన్‌లా పెద్దగా నవ్వుతూ తన కారుని ముందుకు

దూకించింది రాణి.

ఆ తర్వాత రోడ్డు క్లియర్ గా ఉంది. సంతోషంతో ఎగిరిపడింది రాణి. ఏక్సిలేటర్ ని త్రొక్కింది. కారు ఇంకా వేగాన్ని పుంజుకుంది. స్పీడో మీటరు ఎనభైమైళ్ళ వేగాన్ని చూపిస్తోంది.

వందగజాల దూరంలో రైలుపట్టాలు కనుపిస్తున్నాయ్. అక్కడ గేటులేదు. అది ఓపెన్ క్రాసింగ్. వార్నింగ్ బోర్డుమాత్రం రోడ్డుప్రక్కనే ఉంది.

రెండువైపులా చూసింది రాణి. ఒకవైపునుంచి ఎక్స్ ప్రెస్ బండి వస్తున్నది.

రైలు రాకముందే తను రైలుపట్టాల్ని దాటిందంటే పోలీస్ జీప్ రైలు వెళ్ళేదాకా వెనుకే ఆగిపోవలసి ఉంటుంది. కనుక ఈ అవకాశాన్ని దాటి పోనివ్వగూడ దనుకుంది రాణి.

రైల్లోంచి పెద్దగా కూత వినిపించింది వార్నింగ్ గా. అయినా ఆమె లక్ష్యపెట్టలేదు. లెవల్ క్రాసింగ్ మీదకు రాంగానే భయంతో స్టీరింగ్ త్రిప్పింది. ఆమె కళ్ళ ముందు ఏదో మెరుపు కనుపించింది. కారుని రైలు ఢీ కొట్టింది.

రైలుపట్టాల మీదుగా కారుని నెట్టుకుంటూ రైలు ఫర్లాంగు దూరంవెళ్ళి ఆగింది. కారు నుగ్గునుగ్గు అయిపో యింది. స్టీరింగ్ రాడ్ ఊడివచ్చి రాణి గుండెల్లో పొడుచుకుంది. కళ్ళు తేలవేసి నోరు తెరచుకుంది.

ఆమె కళ్ళముందు నోట్లకట్టలు మెదిలినయ్. ఆ తర్వాత ఆమె ప్రాణాలు గాలిలో కలిసి పోయినయ్.

పోలీసులు కారుచుట్టూ మూగారు.

నడి సముద్రంలో బోటు ఆగిపోయింది. ఇంజన్ పని చేయటం ఆగిపోయింది. రాజు త త్తరపాటుతో ఇంజన్ ని చెక్ చేశాడు. అందులో ఆయిల్ అయిపోయింది.

డబ్బాఖరించి ఇంకా ఆయిల్ పోశాడు. మళ్ళీ ఇంజన్ స్టార్ట్ చేశాడు. అది మొండికేసింది. గంటవరకూ అలానే పెనుగులాడాడు. కాని లాభంలేకపోయింది.

సిగరెట్ వెలిగించాడు. ఉస్సురంటూ నిస్సహాయంగా సీట్ లో కూలబడ్డాడు.

ఒక గంటసేపు తెడ్డువేసి బోటుని నడిపాడు. అయినా గమ్యం కనిపించలేదు. జబ్బలు విపరీతంగా నొప్పిపెట్ట సాగాయి.

మరో గంట గడిచింది.

అతడికి దాహం వేసింది. నోట్లో లాలాజలాన్ని ఊరించు కోవడానికి ప్రయత్నం చేశాడు. క్రమేపీ నోరు ఎండిపో తున్నది.

దాహం పట్టలేక ముందుకు వంగి సముద్రంలోని నీళ్ళు చేతులోకి తీసుకుని నోట్లో పోసుకున్నాడు. కొంచెం దప్పిక తీరినట్టుగా ఉంది, నీళ్ళు ఉప్పగా అనిపించినా!

మళ్ళీ అయిదు నిముషాలు కాకుండానే అతడికి మళ్ళీ దాహం వేసింది. సముద్రపు ఉప్పునీరు త్రాగితే దాహం ఎక్కువౌతుందన్న విషయం అతడికి తెలీదు. ఉప్పు ప్రభావంవల్ల నోటిలో త్వరత్వరగా తడి ఆరిపోతుంది.

తన తొందరపాటులో తను నీరుగాని, ఆహారాన్ని గాని తెచ్చుకోలేదు. తెల్లారేసరికి ఏదో ఒకతీరాన్ని తాకకపోతానా అనుకున్నాడు. కాని ఈ బోటు తనను నడిసముద్రంలో ముంచుతుందని అనుకోలేదు.

సూర్యుడు సముద్రంలోంచి పైకి వచ్చాడు. అతడికి దాహం ఎక్కువౌతోంది. పిచ్చిగా తల వెంట్రుకలు పీక్కున్నాడు.

ఎండ వేడిమి నుంచి తలకాయగూడ దాచుకునే చోటులేదు ఆ బోట్‌లో. సూర్యుడు పైకి వచ్చేకొద్దీ అతడు పెనంమీద బ్రెడ్‌లా మగ్గిపోసాగాడు.

సూట్‌కేస్ తెరిచి నోట్లకట్టలను ఆశగా తడిమాడు. ఆ తర్వాత వాటిని నాలుకతో నాకాడు. ఆ తర్వాత అచేతనంగా వాటిమీదనే పడిపోయాడు.

తెలివి తప్పిపోయేటప్పుడు అతనికి ఏదో శబ్దం వినిపించింది. తనబోటు ఇంజెన్ స్టార్ట్ అయినట్టు కలగన్నాడు. కళ్ళు తెరుద్దామని యత్నించినా తెరిపిడి పడలేదు. క్రమేపీ మత్తు ఆవరించింది అతన్ని.

మరో గంట గడిచేక హెలికాప్టర్ వచ్చింది అటుగా. అందులోనుంచి ఇన్‌స్పెక్టర్ ఆర్ముగం బైనాక్యులర్స్‌తో చూస్తున్నాడు.

"అదుగో మోటర్ బోట్" అంటూ అరిచాడు సంతోషంగా.

వైర్‌లెస్ రిసీవర్‌లో మెసేజ్ చెప్పసాగాడు.

మరో పావుగంటలో తీరం నుంచి మోటర్‌బోట్లు నీళ్ళమీదికి ఉరికినయ్.

# 18

డాక్టర్ విఘ్నేశ్వరన్ కళ్ళు తెరిచేసరికి ఎదురుగా సుభద్ర కనుపించింది. నౌకరు రాములు చేతులు కట్టుకొని నిలబడ్డాడు. మరో డాక్టర్, లాయర్ నారాయణ రావూ, సర్కిల్ ఇన్స్‌పెక్టర్ల వంక చూశాడు. ఇన్స్‌పెక్టర్ ఆర్ముగం నిలబడి వున్నాడు. అతడి ప్రక్కనే సీళ్ళు వేయబడిన రెండు సూట్‌కేసులవంక ఆశ్చర్యంగా

చూశాడు.

డాక్టర్ అతడిని పరీక్షించాడు మళ్ళీ. "యస్! నౌ యూ కెన్ టాక్ టు హిమ్!" అన్నాడు నవ్వుతూ.

సర్కిల్ ఇన్స్పెక్టరు ముందుకు వచ్చాడు. "మీ అదృష్టాన్ని అభినందించలేకుండా వున్నాను డాక్టర్! మీ డబ్బు చాలా భాగం దొరికింది."

"థాంక్యూ సర్! మీ సేవ మరువలేనిది. పోలీస్ వెల్‌ఫేర్ ఫండ్‌కి నా విరాళం లక్ష రూపాయలు రాసుకోండి!" అన్నాడు విష్ణువరన్.

కాసేపు ముచ్చటించుకుని అందరూ వెళ్ళిపోయారు.

గేటులో ప్రెస్ రిపోర్టర్లు ఇన్స్పెక్టర్ ఆర్ముగం చుట్టూ మూగి ప్రశ్నలు వేస్తున్నారు.

"మామయ్యా! ఈ అనర్థానికంతా కారణం నేను! నావల్లనే ఇంటికి శని పట్టింది. నేనుగూడా ఈ ఇంటికి దూరంగా వెళ్ళిపోతాను!" అంది సుభద్ర.

"అలా అనకు సుభద్రా! నీకోసమే డబ్బుపోయినా నేను లక్ష్యపెట్టలేదు. ఈ ఇంటికి లక్ష్మివి నీవు. నీవు లేందే నేను బ్రతకలేను. నా జీవితపు చరమ ఘడియల్లో హాయిగా కన్నుమూయడానికే నిన్ను దేవుడు నా దగ్గరకు పంపాడు. ఇది నీ ఇల్లు! ఇంకా ఎక్కడకు పోతావ్!" అంటూ ఆమె చేతిని ఆప్యాయంగా నిమిరాడు విష్ణువరన్.

"మామయ్యా!" అంటూ అతడి గుండెలపై వ్రాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది సుభద్ర.

"అవసరంవున్న దానికన్న ఎక్కువ సంపద వుండటం కూడా అనర్థమే, డబ్బు పాపిష్టిది! నా వీలునామా ప్రకారం స్వచ్ఛంద సేవా సంస్థలకు, మెడికల్ రిసెర్చి

ఇన్స్టిట్యూట్ కి విరాళాలు రేపే పంపేస్తాను. మిగతా డబ్బు బ్యాంకులో వేసి వచ్చే వడ్డీతో నిశ్చింతగా బ్రతుకు దాం!'' అన్నాడు డాక్టర్ విష్ణువర్ధన్ స్ట్రాంగ్ రూమ్ వంక చూస్తూ.

*　　　*　　　*

ముగ్గురు మూర్ఖులు :—

నేరస్థుడ్ని నమ్ముకొని బంగారు జీవితాన్ని పోగొట్టు కున్న రాణి, మొదటి మూర్ఖురాలు!

తోటి నేరస్థుడ్ని నమ్మి, అతడికి సాయంచేసి ప్రాణాలు పోగొట్టుకున్న కనకం, మరో మూర్ఖుడు!!

తను కొల్లగొట్టుకొచ్చిన సంపదను చూసుకుని మురిసి పోయి గుడ్డిగా మృత్యుముఖంలోకి పారిపోయిన రాజు, చివరి మూర్ఖుడు!!!

—: ఐ పో యిం ది :—

# ఆశను చుట్టిన అరిష్టాలు

ఏ. వీ. మోహన్రావ్

ఆఖరి దమ్ములాగి సిగరెట్ డస్ట్‌బిన్‌లోకి విసిరాడు అశోక్.

అతడికి విపరీతంగా విసుగుపుట్టుకొచ్చింది. సరయిన టైమ్‌కు వచ్చివుంటే విమానం ఆరుగంటల ముందువచ్చి వుండవలసింది.

బొంబాయిలో ఎయిర్‌పోర్టు ఎంప్లాయిస్ సమ్మె ఆకస్మికంగా ప్రారంభించారనీ, అందువల్ల విమానాల రాకపోకలకు అంతరాయం కలుగుతున్నదనీ, ఏక్షణంలోనైనా విమానం రావచ్చనీ పదినిముషాలకొకమారు లౌడ్ స్పీకరులో గొంతు చించుకొని చెప్తున్నాడు అనౌన్సరు.

బాస్‌పైన కోపమొచ్చింది. కార్లోనో రైల్లోనో

తగలబడితే గంట అటూ ఇటూగా వచ్చి వుండేవాడు. కానీ ఆయనరాడు. విమానాల్లో తిరగటం స్టేటస్. ఏ మధ్య దారిలోనో కూలిపోస్తాడేమోనన్న అనుమానం వేసింది.

అశోక్ ఉద్యోగంలో చేరి ఆరునెలలయింది. అతను బాస్‌ను ఎప్పుడూ చూడలేదు. విన్నాడు. ఆయన సెక్రటరీవచ్చి అశోక్‌ను ఇంటర్వ్యూ చేసి మద్రాసులో ఆయన వున్న వ్యాపారాలన్నింటికీ మేనేజర్‌గా నియమించి పోయాడు.

వెయ్యిరూపాయలు జీతం ఇస్తున్నారు. ఒంటరిగాడు అతడు. వెనకా ముందూ ఎవ్వరూలేరు.

తినడం త్రాగడం అందమైన అమ్మాయిలతో పరిచయాలు పెట్టుకొని, అవకాశం దొరికితే వాళ్ళతో ఆనందంగా గడపడం అతని అలవాట్లు.

ఏ పరిస్థితుల్లోనూ ఏ అమ్మాయితోనూ అతను ప్రేమ గీమాలు పెట్టుకోలేదు. అతనికి ప్రేమపైన, పెళ్ళిపైన సదభిప్రాయం లేదు.

అశోక్ యం. కామ్ చదివాడు. రకరకాల ఉద్యోగాలు చేశాడు. రేపటిగురించి ఆలోచించడం అతని కలవాటు లేదు.

బాస్ గుర్తుకొచ్చాడు.

విమానంలో కూర్చొని ఎప్పుడెప్పుడు బయలుదేరు తుందాని ఎదురుచూస్తుంటాడనుకున్నాడు.

ఆరోజు అతనికి మంచి పార్టీ వుంది. ఆఫీసులో పని చేసే వనజ ఇస్తానంది. ఆరాత్రంతా అతనితో వుంటా నని కూడా చెప్పింది. బాస్ ట్రంకాల్ చేసి చెప్పాడు తను వస్తున్నట్లు. కారు తీసుకుని ఎయిర్‌పోర్టుకు వచ్చి

వుండమని హుకుంజారీ చేశాడు.

వనజకు పరిస్థితి వివరించి, సర్ది చెప్పి, పంపాడు. ఆమె నొచ్చుకుంటూ వెళ్ళిపోయింది. అశోక్ కారుతీసుకుని విమానాశ్రయాని కొచ్చేశాడు.

జాఁమ్ మంటూ రొద చేసుకుంటూ పెద్ద విమానం టెర్మినల్ చుట్టూ తిరగసాగింది.

లౌడ్ స్పీకర్లో బొంబాయి నుండి వచ్చిన విమానం మరో రెండు నిముషాల్లో లాండ్ కాబోతూందని అనౌన్సరు గొంతు బాదుకొని చెప్పాడు.

అశోక్ వడివడిగా రన్ వే వేపు పరుగెత్తాడు.

విమానం ఆగింది. లాడర్ వేశారు. తలుపు తెరుచు కొంది. నలుగురైదుగురు దిగి క్రిందకొచ్చారు. వాళ్ళ వెనుక పొట్టిగా, లావుగానున్న బట్టతల వ్యక్తి వెలుపలకొచ్చి క్రిందున్న జనం కేసి చూశాడు. గుర్తుపట్టాడు అశోక్ అంతకు క్రితం అనేకసార్లు ఆఫీసులో బాస్ ఫోటో చూడటంవల్ల.

అశోక్ చెయ్యిపైకెత్తి గాల్లో ఊపాడు.

బాస్ కూడా చెయ్యి ఊపాడు. ఆ తర్వాత మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ మెట్లుదిగి రాసాగాడు. ఆయన వెనుకగా ఆరడుగుల పొడవున్న అమ్మాయి దిగ సాగింది.

అశోక్ ఎదురువెళ్ళి తన్నుతానే పరిచయం చేసు కొన్నాడు.

బాస్ వెనక్కి తిరిగిచూచి "కమాన్ బేబీ! మన మానేజర్ వున్నాడు" అన్నాడు.

ఆ అమ్మాయివచ్చి తండ్రి ప్రక్కగా నిలుచుంది.

"మా బేబీ!" అన్నాడు బాస్.

"గ్లాడ్ టు మీట్ యూ!" అన్నాడు అశోక్ నవ్వు మొఖాన్ని వెలిగించి.

బేబీ అశోక్ కేసి చూసింది. భారీ విగ్రహం. కోల మొహం. ఉంగరాల జుట్టు, వెడల్పైన ఛాతీ, మోకాళ్లను దాటిన చేతులు, ఖరీదైన సూటులోవున్న అతని రూపం ఆమెకు అత్యంత మనోహరంగా కనుపించింది.

"వెరీ గ్లాడ్ టు సీయూ!" అంది నవ్వుతూ.

అశోక్ ఆమెకేసి చూశాడు. బెల్ బాటమ్స్ తొడుక్కుంది. బెల్ షర్టు వేసుకుంది. వెంట్రుకలు పొట్టిగా కత్తిరించుకుని, మధ్య పాపట తీసుకుంది. చెవులకు ప్లాస్టిక్ పూలలాంటి వేవో వ్రేలాడసాగాయి. పెద్ద పెద్ద అద్దాలున్న గాగుల్స్ తగిలించింది. ముక్కు మాత్రం పెద్దదిగా మొఖాన్ని దాచేస్తూ ముందుకు పొడుచుకొచ్చింది.

అన్నింటికన్నా అతనికి కొట్టొచ్చినట్లు కనిపించిన లోపం, ఆమె ఛాతీ టెన్నిస్ కోర్టులా చదరంగా వుండటం. అసలు ఎవ్వరన్నా చెపితే తప్ప ఆమెను ఆడ మనిషని ఎవ్వరూ గుర్తించలేరు.

"కారు వెలుపలుంది. వెళ్దామా!" అడిగాడు అశోక్.

"మాకు రూంస్ బుక్ చేశావా?" అడిగాడు బాస్.

"ఆఁ! ఓషియనిక్‌లో ఏ. సీ. రూంలు రెండు రిజర్వు చేశాను. ఆఫీసునుండి ఇద్దరు బాయ్స్‌నుకూడా అక్కడకు పంపాను" అన్నాడు అశోక్.

"వండర్‌ఫుల్! ఐ లైక్ యూ!" అన్నాడు మెల్లగా నడవలేక నడవలేక అడుగులు ముందుకేస్తూ.

అందరూ కారెక్కారు. అశోక్ వీల్ వద్ద చేరాడు. ప్రక్కనే బేబీ కూర్చుంది. బ్యాక్ సీట్‌లో బాస్ చేరబడ్డాడు.

రివ్వుమంటూ దూసుకుంటూ పోసాగింది కారు.

ఒక్కచేత్తోనే డ్రైవ్ చేస్తున్న అశోక్ కేసి చూడ సాగింది బేబీ. ఎనభైకి తగ్గకుండా పోతున్నాడు. సులువుగా టర్నింగ్ లు కొడుతూ, ఓవర్ టేక్ చేస్తూ పోతున్న కారును చూసి అశోక్ డ్రైవింగ్ ను లోలోపలే మెచ్చు కుంది బేబీ.

కారు ఓషియానిక్ చేరింది. దిగి తిన్నగా రూంకు వెళ్ళారు.

అశోక్ గంట చూశాడు. రాత్రి రెండయింది.

"మిస్టర్ అశోక్!" పిలిచాడు బాస్.

అశోక్ ఆయనకేసి చూశాడు.

"నిన్ను చాలా ఇబ్బంది పెట్టినట్టున్నాను. ఇంక నువ్వు వెళ్ళవచ్చు. అమ్మాయి రేపు ఆఫీసుకు వస్తుంది. ఇక్కడ మన బిజినెస్ లో వున్న లావాదేవీలు, సమస్యలు అన్నీ ఆమెకు చెప్పు" అన్నాడు.

"అలాగే!" అన్నాడు అశోక్.

బేబీ దగ్గ "మీకు అభ్యంతరం లేకుంటే పదింటికి ఇక్కడకు రండి. కలిసి వెళ్దాం!" అంది.

"ష్యూర్! అలాగే వస్తాను మేడమ్" అన్నాడు అశోక్.

"ఇంక మీరు వెళ్ళండి! ఇంట్లో మీ వాళ్ళు ఎదురు చూస్తూ వుండవచ్చు."

"నాకెవ్వరూ లేరండీ ఎదురు చూసేందుకు."

"అయితే మీరుకూడా ఇక్కడే వుండిపోవచ్చుగా!" సజెస్ట్ చేసింది బేబీ.

"వద్దులెండి నేను తొందరగా ఆఫీసుకు వెళ్ళి కొన్ని

కాగితాలు తయారు చెయ్యాలి. మీరు వచ్చేసరికి అంతా సిద్ధంగా వుంచాలి కదా! వస్తాను,'' అంటూ ఎదురుచూడకుండా అక్కడ్నించి నిష్క్రమించాడు అశోక్.

వెలుపలకొచ్చి కారెక్కాడు.

కోట్లమీద వ్యాపారం చేస్తున్న బాస్ రూపం పదే పదే తలపు కొచ్చింది అశోక్ కు. తన్ను ఎన్నో ప్రశ్న లడుగుతాడనుకున్నాడు కానీ ఆయన ఏమీ అడగలేదు.

బేబీ చూపులు, నవ్వులు, మాటలు గుర్తుకొచ్చాయి. శరీరం కంపించింది. ఆడవాళ్ళతో అశోక్ కు బాగా అనుభవముంది. వాళ్ళ ప్రవర్తనను బట్టి మనసుల్లో ఎలాంటి భావాలు చెలరేగేది కనిపెట్టగలడు తను.

బేబీ తన్నెందుకో మెచ్చుకొంటున్నట్లుగా చూడడం అతన్ని కాస్త కలవర పరిచింది.

ఆమె బాస్ కు ఒక్కతే కూతురు. మనిషిని చూస్తే ముప్ఫయి సంవత్సరాల దాకా వయసున్నట్లుగా తోచింది. ఆడదాని కుండే అణకువ, అసలు కనిపించలేదు. బహుశా డబ్బు దాన్ని అణచివేసిందేమోననుకున్నాడు.

వనజ గుర్తొచ్చింది. టైం చూసుకున్నాడు. వీళ్లు రావడం లేకుంటే ఈ పాటికి వనజతో సరదాగా కాలం గడుపుతూ వుండేవాడు.

వ్యాపార వ్యవహారాలన్నీ గుర్తొచ్చాయి. అన్నీ సవ్యంగానే వున్నాయి. తను చేరిన యీ ఆరుమాసాల్లో అన్ని కంపెనీలు కలిసి దాదాపు యాభై లక్షలదాకా వ్యాపారం చేశాయి. అందులో పదోవంతయినా లాభం వుండి తీరుతుంది.

కారు చిన్న బంగళా ముందాగింది. దిగి లోనికి

వెళ్ళాడు. డ్రస్ మార్చుకుని ఒక గ్లాసు విస్కీ త్రాగాడు.

ఆరు గంటలకు అలారం పెట్టి ప్రక్కమీదికి వాలి పోయాడు.

## 2

ఏడంతస్తుల 'ఎమరాల్డ్ హౌస్' ముందాగింది టాక్సీ. అందులోంచి ఆరడుగుల అజానుబాహు విగ్రహం దిగింది. టాక్సీవాలాకు డబ్బిచ్చి, చిన్న బ్రాండ్ కేస్ ఊగించుకుంటూ అతను బిల్డింగులోనికి నడచాడు. వెళ్ళి లిఫ్ట్ వద్ద ఆగాడు.

బటన్ నొక్కగానే లిఫ్టు పైనుండి స్వరుమంటూ క్రిందికొచ్చింది. తలుపులు తెరచుకుని లోనికి వెళ్ళాడు. మళ్ళీ తలుపులు మూసుకుని 'ఏడు' నెంబరు దగ్గరున్న బటన్ నొక్కాడు.

కన్ను మూసి తెరచేంతలో లిఫ్టు ఏడో అంతస్తు ముందాగింది. వెలుపలకు అడుగుపెట్టాడు. జేబులోంచి ఫిల్టర్ ఫ్లేక్ సిగరెట్ పెట్టి తీసి ఎడంచేతో పట్టుకున్నాడు ముందుకు నడిచాడు.

'ప్రైవేట్' అని వున్న తలుపు వద్ద ఆగి అద్దాల గుండా లోనికి చూశాడు. విశాలమైన హాలులాంటి పెద్ద గది. ఒక మూల అందమైన అమ్మాయి ఏదో లెఖలు చూస్తూ కనుపించింది.

తలుపు తోసుకుని లోనికి వెళ్ళి ఆమె ముందు నిల బడ్డాడు. ఆమె అగంతకుణ్ణి గమనించకుండా తన పనిలో తను నిమగ్నురాలైపోయింది. తన ఉనికిని తెలిపేందు కన్నట్లు పొడిగా దగ్గాడు. ఆమె తల పైకెత్తి చూసింది.

"మిస్టర్ శారానంద్!" అన్నాడు అతను.

"మీ రెవరు?"

"క్రిస్టోఫర్ అని చెప్పండి."

"ఏం పనిమీదొచ్చారు? ఎంతసేపు మాట్లాడాలి?"

"మీ ప్రొప్రయిటరుగారి పనిమీదే వచ్చాను. ఆయన నాతో ఎంతోసేపు మాట్లాడవలసిన అవసరముంది. అయినా నేను అరగంటకన్నా ఎక్కువసేపు మాట్లాడను."

ఆమె నవ్వింది. సొట్టలు పడుతున్న బుగ్గలు, ధగధగ మెరిసిపోతున్న వెడల్పాటి చక్కని బలమైన పళ్లు, రక్తం పైకి చిమ్ముకొంటున్నట్లున్న లావైన రొమ్ములు, నెమలి రంగు కళ్లు, చకచక సర్వే చేశాడు క్రిస్టోఫర్.

ఆమె ముందుకు వంగి టెలిఫోన్ రిసీవరు పైకెత్తింది.

"మీరలా సోఫాలో కూర్చోండి. బాస్‌తో మాట్లాడి అపాయింట్ మెంట్ ఫిక్స్ చేస్తాను" అందామె.

"నో! మిమ్మల్ని చూస్తూ ఇక్కడే నిలుచుంటాను. మీ పని కానివ్వండి" అన్నాడు క్రిస్టోఫర్ ప్లేక్ సిగరెట్ తీసి ముట్టిస్తూ.

ఆ అమ్మాయి ఫోన్లో మాట్లాడుతూనే క్రిస్టోఫర్‌ను తలెత్తి చూడసాగింది. అతని అందం ఆమెను అప్రతిభురాల్ని చేసింది.

"మిమ్మల్ను రమ్మన్నారు!" అందామె.

"థాంక్స్! మీ పేరు చెప్పలేదు!" అడిగాడు నవ్వుతూ క్రిస్టోఫర్.

"మిస్ స్వప్న" మొదటి మాట ఒత్తి పలికింది.

"గుడ్ నేమ్! వస్తాను" అంటూ అతనూ లోనికి దారి తీశాడు.

రెండు నడవలు, మూడు హాలులు దాటాక, నాలుగో గదిలో వున్నాడు తారాచంద్. అతని చుట్టూ రక

రత్నాల నగల ఫొటోలు గోడలకు తగిలించి వున్నాయి. ఎయిర్ కండిషన్ గది కావడంవల్ల చల్లగా వుంది. తెల్లటి పరుపుపై దిండ్లు నానుకుని కూర్చున్నాడు తారాచంద్.

"గుడ్ మార్నింగ్ చంద్ జీ!" కూర్చున్నాడు క్రిస్టోఫర్.

"గుడ్ మార్నింగ్!" అంటూ "ఏం త్రాగుతావ్?" అడిగాడు.

"ఏమిచ్చినా త్రాగుతాను, విషం తప్ప!"

"అది నా దగ్గర లేదులే!" అంటూ బెల్ నొక్కాడు. బాయ్ వచ్చాడు. విస్కీసీసా, ఐస్, సోడాలు, గ్లాసులు, జీడిపప్పు తెమ్మన్నాడు.

"ఊఁ! అసలు విషయం చెప్పు" అన్నాడు క్రిస్టోఫర్.

"ఈ మధ్య నువ్వు నాతో వ్యాపారం పూర్తిగా మానేశావ్. రతన్ చంద్ కు సరుకు ఇస్తున్నావని ఎవరో చెప్పారు. అతనంటే నాకు పడదు. నువ్వు అతని దగ్గరకు వెళ్ళడం కూడా నాకు నచ్చలేదు. ఐదేళ్ళనాడు మనం వ్యాపారం చేశాం. నిన్ను నేను ఎంతబాగా చూశానో గుర్తుందికదా! మరి నువ్విలా ఎందుకు మారిపోయినట్లు?" అడిగాడు తారాచంద్.

క్రిస్టోఫర్ కు అర్థమయింది. తారాచంద్ తో వ్యాపారం చేస్తున్న రోజుల్లోనే పోలీసులకు పట్టుబడ్డాడు. తనవద్ద సరుకు దొరకలేదుగానీ, సాక్ష్యాధారాలతో మూడేళ్లు జైలు శిక్షపడింది. అది పూర్తి చేసుకుని బైటపడ్డాడు. తన అనుచరులు చెల్లాచెదరయ్యారు. బొంబాయిలో కాలక్షేపం చెయ్యసాగాడు. జరుగుబాటుకు రతన్ చంద్ దగ్గర రెండు మూడుసార్లు డబ్బు తీసుకున్నాడు. తానేదో మంచి సరుకు తెస్తానన్న ధైర్యంతో ఇచ్చాడు డబ్బు.

కి. తారాచంద్ పదిరోజుల క్రితం బొంబాయి వచ్చాడు. కాంతాక్రజ్‌లో కలిశాడు. మద్రాసు రమ్మని బ్రతిమిలాడాడు. అందుకే వచ్చాడు క్రిస్టోఫర్.

"అసలీమధ్య నేనేమీ చెయ్యలేదు ఊరకే తిని తిరుగుతున్నాను" చెప్పాడు క్రిస్టోఫర్.

"ఏం మానేశావా?"

"కావాలని మానలేదు. నా అనుచరులు ఏమయినారో తెలీలేదు. వ్యాపారం ప్రారంభించాలంటే మళ్ళీ పెట్టుబడి కావాలి. అంగబలం కావాలి. అందుకే వెనుక ముందు లాడుతున్నాను."

"పెట్టుబడి గురించి కంగారు పడక. నేనిస్తాను. అంగబలం నువ్వు సరుకూర్చుకో. నా పరిస్థితిగూడా అంత బాగాలేదు. ఈ మధ్య వరుసగా ఐదేళ్లు నష్టం వచ్చింది. నువ్వైనా చేస్తేతప్ప నేను బైటపడేట్లు లేదు!" అన్నాడు తారాచంద్.

బాయ్ మందు తెచ్చిపెట్టి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ మెల్లిగా పుచ్చుకోసాగారు.

"నువ్వేదన్నా పథకం ఆలోచించావా?" అడిగాడు క్రిస్టోఫర్.

"ఆఁ! గత రెండేండ్లలో నా దగ్గర ఎక్కువ ఖరీదులో వజ్రాలు కొన్నవాళ్ళ అడ్రసులున్నాయి. అన్నీ కలిపి ఆరో ఏడో వుంటాయి. వాటిని ఊడ్చుకొస్తే చాలు. వాటి అసలు ఖరీదులో మూడోవంతు నీకిస్తాను. ఈ ప్లాను సక్యంగా సాగిపోయేందుకవసరమయిన పెట్టుబడి నేనే పెడతాను. ఏమంటావ్?"

"ఓ. కే. అలాగే చేద్దాం ముందు సాదు పాతిక వేలు కావాలి ఇస్తావా?" అడిగాడు క్రిస్టోఫర్.

వెనుక వేపు నున్న అల్మైరా తెరచి, అందులోంచి మూడు వందరూపాయల నోట్ల కట్టలు వెలుపలికిలాగాడు. తలుపు మూసి డబ్బు క్రిస్టోఫర్‌కు అందించాడు.

"ప్లాను చాలా పకడ్బందీగా వెయ్యాలి. చిక్కామా చిక్కుల్లో పడతాం. దాంతో మన దరిద్రాలు తీరిపోతాయి" అన్నాడు తారాచంద్.

"అలాగే! ఆ అడ్రసులు ఒక కాగితంపైన రాసివ్వు" అన్నాడు గ్లాసులోకి విస్కీ వంచుతూ క్రిస్టోఫర్.

తారాచంద్ టైప్ చేసిన కాగితాన్నొకదాన్ని అందించాడు. ఓమారు చదివి మడిచి కోటుజేబులో పెట్టుకున్నాడు క్రిస్టోఫర్ దాన్ని.

"మనం మళ్ళీ ఎప్పుడు కలుద్దాం!" అడిగాడు క్రిస్టోఫర్.

"అవసరం లేదు. సరుకు చేతికి రాగానే ఫోన్ చెయ్యి. నువ్వు ఎక్కువ సార్లు ఇక్కడకు రావడం అంత మంచిది గాదు."

"బై ది బై నీకు లేడీ సెక్రటరీ వున్నట్లుంది. ఎటువంటి మనిషివి?"

"ఏం? కన్ను పడిందా?"

"అందుకాదు. అనవసరమైన విషయాల్లో జోక్యం కల్పించుకునే రకమాని."

"కాదు! ఉద్యోగమిచ్చే ముందే చెప్పాను. కళ్ళు, చెవులు, పని చెయ్యకూడదని" అన్నాడు తారాచంద్.

"రైటో! నేను వస్తాను" అంటూ లేచాడు క్రిస్టోఫర్. బ్రాండ్ కేస్ తీసుకొని మళ్ళీ గదులన్నీ దాటుకుని తారాచంద్ సెక్రటరీ వున్న రూం దగ్గర కొచ్చాడు.

"థాంక్ యూ! మిస్ స్వప్న!" అన్నాడు.

"నో మెన్షన్! వెళ్ళిపోతున్నారా!" అడిగింది ఆర్ద్రతగా.

"ఆఁ! ఇక్కడ్నుంచి. కానీ హోటల్ పారడైజ్ రూం నెంబరు మూడొందలా మూడులో వుంటాను మరో మూడు రోజులు" అని అక్కడ్నుంచి వెలుపలికి నడిచాడు.

స్వప్న చూస్తూ కూర్చుంది.

# 3

ఫాన్ గిర్రుమని తిరుగుతూంది.

క్రిస్టోఫర్ బుర్ర అంతకన్నా స్పీడుగా తిరుగసాగింది. మూడేళ్ళపాటు కఠినశిక్ష అనుభవిస్తూ కారాగారపు గోడలమధ్య ముక్కిపోయిన మనిషి తను. అంతకుముందు ధైర్యంగా ఎన్నో దొంగతనాలు చేశాడు. తెలివిగా తప్పించుకొన్నాడు. తన మనిషి చేసిన చిన్న పొరపాటుతో చిక్కిపోయాడు.

జైలునుంచి వెలుపలకొచ్చాక మానసిక స్థైర్యం సడలిపోయింది. దొంగతనాలు చెయ్యాడమంటే భయం, రోత, పుట్టుకొచ్చాయి.

ఎన్నో ఊర్లు తిరిగాడు. తన అనుచరులకోసం వెతికాడు. ఎవ్వరూ తగలేదు. అంతా చెల్లాచెదరయి చిల్లర నేరాలుచేస్తూ బ్రతకడమో, చావడమో చేస్తూ వుండొచ్చనుకున్నాడు.

తారాచంద్ ఇచ్చిన కాగితంతీసి చూశాడు.

అందులో మొత్తం ఆరు అడ్రసులు వున్నాయి. ఇద్దరు వ్యాపారస్థులు. ఒక సినిమా నటి, ఒక రాజకీయ నాయకుడు. మరొకతను పెద్ద ఆఫీసరు. ఆరో అడ్రసు డాక్టరుది.

అందరిదగ్గరా కలిపి కనీసం పాతిక లక్షలరూపాయలు

ఖరీదుచేసే సరుకు వుండివుండాలనిపించింది.

డేర్ డెవిల్ లాంటి అనుచరుడ్ని ఒకడ్ని ముందు సంపాదించుకోవాలనుకున్నాడు క్రిస్టోఫర్. అలాగే ఒక అందమైన అమ్మాయినికూడా తోడుంచుకోవాలి. తనకు తారాచంద్ అడ్రస్ లిచ్చిన వాళ్ళను గురించి పూర్తి వివరాలు సేకరించాలి. వాళ్ళ ఇళ్ళల్లో నగలు ఎక్కడ దాచిపెట్టారోకూడా తెలుసుకోవాలి. ఆతర్వాతే వాటిన్ని దోచుకునే దారుల గురించి ఆలోచించాలి.

గ్లాసులో విస్కీ పోసుకున్నాడు.

బజ్జర్ మ్రోగింది.

నవ్వుతూ లేచివెళ్ళి తలుపు తీశాడు క్రిస్టోఫర్.

ఎదురుగా స్వప్న కనుపించింది. ఆమె తప్పుకున లోనికొచ్చి తలుపు మూసింది.

"ఎందుకా కంగారు?" అడిగాడు క్రిస్టోఫర్.

"అందరూ చూడటం ఎందుకని" అంటూ వచ్చి క్రిస్టోఫర్ కు ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

"ఇంత ఆలస్యమయిందేం?"

"నేను కనపడ్డ ప్రతి మగాడివెంట తిరిగే బజారుదాన్ననుకున్నారా?"

"కాదు! నువ్వు పరిశీలించిన పద్ధతి, మాట్లాడిన తీరు చూస్తే, ఎందుకో నన్ను కలుసుకోవాలని ఉబలాట పడుతున్నావనిపించింది."

"కరెక్ట్! మీ ప్లానులేమిటి?" సూటిగా అడిగింది.

"దేన్ని గురించి?"

"వ్యాపారం గురించి!"

"నా వ్యాపారం నీకు తెలుసా?" అడిగాడు ఆశ్చర్యపోతూ క్రిస్టోఫర్.

"ఇంతకుముందు చేసిన వ్యాపారం గురించి తెలుసు. నీ ఫోటో పేపర్లో చూశాను మూడేళ్ళ క్రితం. నిన్ను ఇందాక చూడగానే పేరుమోసిన వజ్రాల దొంగ క్రిస్టోఫర్‌వి నువ్వేనని సులభంగా గుర్తుపట్టాను. తారాచంద్ ఏమన్నాడు?"

ఆమెదగ్గర ఇంక తను వివరాలు దాచి లాభం లేదనిపించింది. అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పి "నీ ఇంటరెస్ట్ ఏమిటి?" అడిగాడు.

"నువ్వొక్కడివీ ఈ దొంగతనాలను అరేంజ్ చెయ్యలేవనుకుంటాను. నీ కిచ్చిన అడ్రసుల కాగితం టైప్ చేసింది నేనే. దాని డూప్లికేట్ నా దగ్గరుంది. ఆ అడ్రసుల్లోవున్న వ్యక్తుల్లో చాలామంది సంవత్సరంలో ఎక్కువ భాగం ఇక్కడుండరు. బంగళాలను తాళాలు వేసి వెడుతుంటారు. అలా చేసేందుకు ఒక్కొక్కరికి ఒక్కొక్క కారణముంది" అంది స్వప్న.

"గుడ్! నా పని చాలా సులభం చేశావ్! ఇంకా నేను వీళ్ళ గురించి వాకబు చేద్దామనుకుంటున్నాను" అన్నాడు క్రిస్టోఫర్.

"అఖ్ఖర్లేదు" అంటూ హాండ్‌బ్యాగ్ తెరచి అందులోంచి ఒక కాగితాల బొత్తి వెలుపలకి లాగింది స్వప్న. క్రిస్టోఫర్‌కు అందించింది. అతను విప్పిచూశాడు.

"నువ్వెలా సేకరించావ్!"

"నా బాయ్ ఫ్రెండ్ సేకరించాడు."

"ఎందుకు?"

"నువ్వు చెయ్యదలచుకున్నట్టే అతనూ చేద్దామనుకుంటున్నాడు."

"మరి నాకెందుకు నువ్వీ వివరాలు చెపుతున్నావ్?"

"అతను అసాధ్యుడే! కాని అనుభవం శూన్యం. డబ్బు సంపాదించాలన్న ఆరాటం వుంది. అదీ నాకోసం. కానీ దొంగతనం చేసి పట్టుబడకుండా వుండే విధంగా ప్లాను వెయ్యాలి. అది నా పని ఎంత తలబ్రద్దలు గొట్టుకున్నా అర్థం కావటంలేదు. ఒక ప్రయత్నం చేసి చిక్కుపడబోయి తప్పించుకున్నాడు అతికష్టంమీద. అందువల్లే అతన్ని ఎంకరేజ్ చెయ్యలేదు" అంది స్వప్న.

"గుడ్! మరి అతన్ని తీసుకు రాలేదేం?"

"ముందు మనం ఒకర్నొకరం అర్థంచేసుకుని వాటాలు నిర్ణయించుకొంటే ఆ తర్వాత కలుసుకోవడం బాగుం టుంది" అంది స్వప్న.

క్రిస్టోఫర్ సిగరెట్ వెలిగించాడు. స్వప్న చలాకీ తనం, అందం, అతన్ని ఆనందపరిచాయి.

"మీకెంత వాటా కావాలి!"

"తారాచంద్ ఎంత వాటా ఇస్తానంటున్నాడు."

"మనం దొంగిలించి ఇచ్చే సొమ్ములో మూడోవంతు ఇస్తానన్నాడు."

"అతనిస్తానన్న వాటాలో మా ఇద్దరికీ రెండు వంతులు ఇవ్వాలి" చెప్పింది స్వప్న.

"అలాగే!" అన్నాడు క్రిస్టోఫర్.

"ఆ కాగితాల్లో అన్ని వివరాలున్నాయి. ఏ ఇల్లు ఎలా దోచుకోవాలో మీ అనుభవంతో ఆలోచించి పథకం తయారు చెయ్యండి. ఆ తర్వాత మనం కూర్చుని చర్చించుకుందాం. ఏమైనా లోపాలుంటే సర్దుకుందాం."

"నీ బాయ్ ఫ్రెండ్ కున్న స్పెషల్ క్వాలిఫికేషన్ను చెప్పలేదు!"

"ఎలాంటి తాళాలైనా సునాయాసంగా తియ్య

గలదు. వెయ్యగలదు. సింహం నోట్లోనైనా వెనకా ముందూ చూడకుండా చెయ్యిపెట్టగలదు'' అంది స్వప్న గర్వంగా.

"అవసరమైతే హత్యలు చెయ్యగలదా?"

"చెయ్యగలదు. కాని నేను ఒప్పుకోను. నాకు నచ్చదు. అలాంటి అవాంతరమేదన్నా వస్తే మీరు చూసుకోవలసిందే" చెప్పింది నిర్మొహమాటంగా.

"రైటో! అలాంటి అవసరం రాదు!"

"అయితే నేను వెళ్తాను. మనం మళ్ళీ ఎప్పుడు కలుసుకునేది తర్వాత నిర్ణయించుకుందాం. ఇక్కడకు మాత్రం ఇంక రాను" అంది స్వప్న.

"నీ ఇష్టం! నువ్వు ఈ ప్రయత్నాలు చేస్తున్నట్లు తారాచంద్‌కు తెలుసా?"

"తెలీదు! అతనితో జాగ్రత్తగా వ్యవహరించాలి. నువ్వే అతన్ని హేండిల్ చెయ్యాలి. ఇచ్చినమాట నిలబెట్టుకోవడం అతనికి అలవాటులేదు. నాకు తెలిసి నలుగుర్ని మోసంచేశాడు. ఇంత కష్టపడి మనం అతనికి సరుకంతా అందిచాక మొండిచెయ్యి చూపిస్తే..."

"వాడి గుండెకాయ కోస్తాను. అతన్నిగురించి నువ్వేం కంగారు పడొద్దు. నాకోమారు నీ బాయ్ ఫ్రెండ్‌ను చూపించు."

"ఇప్పుడు వాటాలన్నీ కుదిరాయిగా! చూపిస్తాను" అంది స్వప్న లేస్తూ.

"అతనికి డబ్బేమన్నా కావాలా?" అడిగాడు క్రిస్టోఫర్.

"నీ దగ్గరుందా?"

"ఎంత కావాలి?"

"ఒక వెయ్యి రూపాయలివ్వు."

కోటు జేబులోంచి కాగితాల కట్టతీసి పదికాగితాలు లెఖపెట్టి లాగాడు. వాట్ని స్వప్నకు అందించాడు. ఆమె తీసుకొని హాండ్ బ్యాగ్ లో పెట్టుకొంది.

"నేను వెళ్తాను!" అంది.

"గుడ్!" అన్నాడు క్రిస్టోఫర్.

స్వప్న వెలుపలకొచ్చింది.

## 4

కారు ఓషియానిక్ గేటు దాటి బీచ్ రోడ్ ఎక్కింది.

పింక్ కలర్ చీరకట్టుకొని అదే రంగు జాకెట్ వేసుకుంది బేబీ. మెళ్ళో పింక్ కలర్ లావుపాటి పూసల దండ తగిలించుకొంది. కళ్ళకు పింక్ కలర్ గ్లాసెస్ పెట్టుకొంది.

"మిస్టర్ అశోక్!" పిలిచింది బేబీ.

"యస్ మేడమ్!" అన్నాడు అశోక్.

"అలా పిలవొద్దు! బేబీ అను! నాకు బాగుంటుంది."

"మీరు నా బాస్. అలా పిలవటం బాగుంటుందా?"

"బాగుంటుందనే చెప్పాను. నాకు చాలా ఆకలిగా వుంది. మంచి హోటల్ కు పోనీ సుష్టుగా తిందాం" అంది బేబీ.

"ఎస్కిమోకు వెళ్దామా!" అడిగాడు.

"ఊఁ!" అంది బేబీ.

కారు ఎస్కిమో ముందాగింది. ఇద్దరూ దిగి లోనికి నడిచారు. ఫ్యామిలీ రూమ్ వైపు దారి తీసింది బేబీ. లోనికి వెళ్ళారు. బాయ్ రాగానే మెనూకార్డు తీసుకుని పెన్సిల్ తో గుర్తులు పెట్టి పంపింది.

డిప్లొమాట్ విస్కీ, సోడాసీసాలు తెచ్చిపెట్టాడు

బాయ్. బేబీ బాటిల్ ఓపెన్ చేసి రెండుగ్లాసుల్లో పోసింది.

ఇద్దరు త్రాగడం మొదలెట్టారు.

"మిస్టర్ అశోక్! మీ వయస్సెంత?" అడిగింది బేబీ.

"ముప్ఫయి మూడేళ్లు."

"ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?"

"ఆరునెలల ముందుదాకా సరయిన ఉద్యోగమే లేదు. ఇప్పుడు నెలకు వెయ్యిరూపాయలొస్తున్నాయి. అయినా ఈ జీతంతో భార్యను సుఖపెట్టగలనన్న నమ్మకం లేదు. అందుకే ఆ విషయం గురించి ఆలోచించడం మానుకున్నాను" అన్నాడు అశోక్.

"ఐ. సీ. ఎంత జీతమొస్తే పెళ్ళాడాలనుకుంటున్నారు?"

"కనీసం నెలకు రెండు వేలన్నా రానిదే పెళ్ళి గురించి ఆలోచించదలచుకోలేదు."

"బాచ్‌లర్‌గా లైఫ్ ఎలా వుంది?"

"బాగానే వుంది."

"ఐమీన్......" అంటూ నవ్వింది.

ఆమె నవ్వు అర్థం చేసుకున్నాడు అశోక్. ఆమెతో తనకు చాలామంది గరల్ ఫ్రెండ్సున్నారని చెప్పడం ఇష్టంలేకపోయింది. అదీగాక అవలక్షణంగా భావించి ఉద్యోగంలోంచి ఊడబీకితే మళ్ళీ వీధిన పడాల్సి వస్తుందన్న భయం కలిగింది.

"నాపైన నాకు కంట్రోలుంది" అన్నాడు నవ్వుతూనే.

బాయ్ రకరకాల కూరలు తెచ్చిపెట్టాడు టేబిల్

పైన. వాడు తెచ్చిన మొత్తం ప్లేట్లు పెట్టేందుకు ఆ టేబిల్ చాలలేదు.

"ఎందుకండీ చాలా ఆర్డరు చేశారు?" అన్నాడు అశోక్.

"మీకు మంచి డిన్నరివ్వాలనిపించింది. తినండి" అంది తనూ ప్రారంభిస్తూ విస్కీ తాగుతూ, భోజనం ప్రారంభించారు.

గంట రెండయింది.

"మనం ఇక్కడికి వొచ్చి మూడుగంటలయింది" అన్నాడు అశోక్.

"మీకేమన్నా అర్జంటు పనులున్నాయా?"

"అబ్బే! లేవండీ" అన్నాడు.

"అయితే ఎందుకలా కంగారుపడతారు" అంటూ ఆఖరిసిప్ తాగింది.

ఆమె తాగుతూనే తినింది. దయ్యపు తిండి ఆమె దనుకున్నాడు అశోక్.

బాయ్ బిల్లు తెచ్చాడు. చూచి గుడ్లప్పగించాడు. మూడొందలా ఇరవై రూపాయలయింది. పర్సు తీసి చూశాడు. అందులో రెండొందలా రెండు రూపాయలున్నాయి. ఆ బిల్లు చెల్లించడమెలాగా అని మీమాంస పడసాగాడు.

బేబీ పర్సు తెరచి వందరూపాయల నోట్లకట్ట వెలుపలికి లాగి అందులోంచి నాలుగు కాగితాలు వేరుచేసి లాగి, ప్లేట్లో పడేసింది.

"నే నిస్తాలెండి!" అన్నాడు అశోక్.

"మీ జీతం నెలకు వెయ్యి రూపాయలే! నాలాంటి వాళ్ళతో రెండుసార్లు హోటల్ కు వస్తే నెలంతా పస్తుం

డాల్సిందే. మీకు డిన్నరివ్వాలని నేను పిల్చుకొచ్చాను"
అంది బేబీ.

అశోక్ అంతటితో నోరు మూసుకున్నాడు. బాయ్ చిల్లర తెచ్చాడు. వాడికి ఇరవై రూపాయలు వదిలేసి మిగిలిన డబ్బు తీసుకుని లేచింది బేబీ.

ఇద్దరూ బెలుపలికొచ్చి కారెక్కారు.

"ఆఫీసుకు వెళ్దామా?" అడిగాడు అశోక్.

"వద్దు!" అంది బేబీ.

"మరి హోటల్ కు పోనిచ్చేదా?"

"వద్దు! తిన్నగా ఇలియట్స్ బీచ్ కు పోనివ్వండి. మీతో కొద్దిగా మాట్లాడాలి" అంది.

"అలాగే!" అంటూ కారును అడయారు వేపు మళ్ళించాడు.

మధ్యాహ్నం వేళ కావటంతో బీచ్ అంతా నిర్మాను ష్యంగా వుంది. కారు దిగి ఇద్దరూ సముద్రం అంచుకు నడచారు.

"బొంబాయికన్నా బీచ్ ఇక్కడ బాగుంటుంది" అంది బేబీ నడుస్తూనే.

"నేను బొంబాయి చూడలేదు!" చెప్పాడు అశోక్.

"ఏమిటి మీరు సరదాగా వుండలేక పోతున్నట్లుంది. నాతో తిరగటం మీకు కష్టంగా వుందా?" అతని కళ్ళ లోకి చూస్తూ అడిగింది బేబీ.

"నో! నో! అలాంటి దేమీ లేదు. మీ కంపెనీ చాలా బాగుంది" అన్నాడు ఆమె బాస్ కూతురన్న విషయం మరచిపోలేక.

"మా ఫాదరని చూశారుగా! ఆయన ఏదీ పట్టించు కోడు. వ్యాపారం గూడా ఎప్పుడో చాలా సంవత్స

రాజు క్రితం హుషారుగా చేశాడు తప్ప, ఇప్పుడు దాని పైన ఇంట్రస్టు లేదు."

"మొదట్లోనే కష్టం. అంతా ఆర్గనైజ్ అయ్యాక చేసేందుకేముంటుంది. కళ్లు మూసుకుని కూర్చున్నా జరిగి పోతుంటుంది."

"వ్యాపారమైతే జరుగుతుంది. మరి నా పెళ్ళి జరుగుతుందా?" అడిగింది రత్న.

"ఎందుకు జరగదు! కోట్లు ఖరీదు చేసే ఆస్తికి ఏకైక వారసురాలయారు. మిమ్మల్ని చేసుకునేందుకు వెనుకాడే వాడెవరన్నా వుంటే వాడు వెధవే!" అన్నాడు ఆమెను పొగడుతున్నట్లు.

"మిమ్మల్ని నేను ఒకందుకు పిల్చుకొచ్చాను. నాకు మీరో చిన్న సాయం చెయ్యాలి. చేస్తానని మాటిస్తే చెప్తాను" అంది బేబీ.

వాళ్ళకు దరిదాపుల్లో ఎవ్వరూ లేరు.

"చెప్పండి! చేస్తాను."

"ఇప్పుడు ఇక్కడే నన్ను మీరు అనుభవించాలి."

"మేడమ్!" ఆశ్చర్యపోతూ అన్నాడు.

"నో! బేబీ!"

"మీరు పెళ్ళికావలసినవారు, పైగా నా బాస్."

"అని భయపడవలసింది నేను. మీరుగాదు. పోనీ నన్ను అనుభవించడం మీకు ఇష్టంలేదని చెప్పండి. నేను ఆడదాన్ని కాదని చెప్పండి వెళ్ళిపోతాను" అంది. ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

అశోక్‌కు పరిస్థితి అర్థమయింది. ఆమె కన్నీళ్లు తుడిచి పొదివి పట్టుకొన్నాడు. ఘట్టిగా గుండెలకు హత్తుకున్నాడు. ఆమె ఆడతనం తన గుండెలపైన రాచుకో

లేదు. క్షణకాలం నిరుత్సాహం తొంగిచూసింది. వెంటనే తన్ను తనే తమాయించుకున్నాడు.

అరగంట తర్వాత బేబీ లేచి బట్టలు కట్టుకుంది. అశోక్‌ను తన వొడిలో పడుకోబెట్టుకుంది.

"హౌడూయూ ఫీల్!" అడిగింది.

"వండర్‌ఫుల్" అన్నాడు.

"నువ్వింతకు ముందు ఎవరినన్నా అనుభవించావా?"

"ఆఁ!"

"నాతోటి అనుభవం ఎలావుంది దాంతో పోలిస్తే!"

"బాగుంది. ఐ లైక్ ఇట్!"

ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఎందుకలా బాధపడుతున్నారు"అడిగాడు అశోక్.

"నేనొకతన్ని ప్రేమించాను, పిచ్చిగా వెంటబడ్డాను. అతను నన్ను నిరాకరించాడు. ఎందుకో తెలుసా! నాలో ఆడతనంకన్నా మగతనం ఎక్కువగా వుందట. అది నిజమా!" అడిగింది బేబీ ఏడుస్తూ.

"కాదు! మీరు చాలా ఎమోషనల్ మనిషి అంతే!" అన్నాడు అశోక్.

"థాంక్స్! పదండి వెళ్దాం" అంది బేబీ.

ఇద్దరూ వచ్చి కారెక్కారు. కారు హోటల్ ఓషియానిక్‌కు వెళ్ళింది. బాస్ తన్నేమీ అడగలేదు. వాళ్ళ దగ్గర శెలవు తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

# 5

"మనకెక్కువలసిన ఆరుగురిలో ఇద్దరు ఇళ్ళకు తాళాలు వేసి ఊటీ వెళ్ళినట్లు తెలిసింగి. ముందుగా మన పనికి ప్రారంభోత్సవం అక్కడే జరగాలి!"

చెప్పాడు క్రిస్టోఫర్ సిగరెట్ బట్ చేస్తూ.

"ఎవరా ఇద్దరు?" అడిగాడు జాన్.

"ఒకరు డాక్టరు జార్జి. మరొకరు శమంతకమణి. జార్జి ఇల్లు జార్జిటౌన్‌లో వుంది. ఆరంతస్తుల భవనంలో, మూడో అంతస్తు మొత్తం అతనిదే. కాపలా వాళ్ళెవరూ లేరు. శమంతకమణి బంగళాలో మాత్రం ఔట్ హౌస్‌లో పని వాళ్ళున్నారు. రోజూ ఇల్లు తాళంతీసి శుభ్రంచేసి, మళ్ళీ తాళం పెడుతున్నారు. ఆమె ఇల్లు హాబిబుల్లా రోడ్‌లో వుంది" చెప్పింది స్వప్న.

క్రిస్టోఫర్ రెండు డ్రాయింగులుతీసి టేబుల్ పైన పరచాడు.

అవి ఆ ఇళ్ళ ప్లాన్లు. వాటిల్లో ఏ గదిలో ఐరన్ సేఫ్ లున్నదీ, ఎన్ని ద్వారాలు దాటవలసిందీ మార్క్ చేసి వుంచాడు. వాట్ని జాన్ ముందుకు నెట్టాడు.

జాన్ పరిశీలనగా చూశాడు.

"లోపలికి వెళ్ళడం, రావడం పెద్ద సమస్యగాదు! ఆ ఐరన్ సేఫ్‌లు తెరవటం కష్టం. అవి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన లైన్ కంపెనీవి. ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా, పొరపాటు చేసినా పోలీసుల చేతుల్లో పడతాం!" అన్నాడు జాన్.

"ఎందుకని?"

"వాటికి ఎలక్ట్రానిక్ కంట్రోల్సున్నాయి. అవి తెరవటం తాళాలతో గాదు! రెండు స్విచ్‌లు అమర్చివుంటాయి. వాట్నికూడా ఎక్కడో అమరుస్తారు. ఒకదాని బదులు మరొకటి నొక్కితే, తిన్నగా పోలీస్ కంట్రోలు రూంలో ఏర్పాటు చెయ్యబడ్డ బర్గిలరీ బజర్ మ్రోగుతుంది. వెంటనే వాళ్ళు వచ్చేస్తారు" అన్నాడు జాన్.

"నీకెలా తెలుసు ఈ విషయం."

"ఎనిమిది సంవత్సరాల క్రితం నేను బొంబాయిలోని

లైన్ కంపెని హెడ్ ఆఫీసులో పనిచేశాను. నా చేతి మీదుగా చాలామంది ఇళ్ళల్లో వాట్ని అమర్చాను. ఆ కంట్రోల్సు వివరాలు ఆ ఇంటి యజమానికీ, కంపెనీకి తప్ప మరెవ్వరికీ తెలిసే అవకాశంలేదు. అందువల్లే ఆ కంపెనీ ఆ సేఫ్‌లు చాలా ఎక్కువ ఖరీదుకు అమ్ముతుంది'' అన్నాడు జాన్.

''వాటి విషయం నీకు పూర్తిగా తెలిశాక భయమే ముంది.''

''తెలిసేందుకేమీ లేదు. ఒక్కొక్క సేఫ్ కంట్రోల్సు విడివిడిగా వుంటాయి. అవి ఎక్కడ అమర్చబడివున్నాయో తెలుసుకోవాలి. అది తెలుసుకోకుండా దొంగతనానికి పోవడం, మనకు మనమే పోలీసుల వలలోకి నడచి వెళ్ళడ మవుతుంది'' అన్నాడు జాన్.

''అయితే ఏంచేద్దాం!'' అడిగింది స్వప్న.

''వీటికి కరెంటు కనెక్షనుంటుంది. దాని ద్వారానే అలారం పనిచేస్తుంది. మనం ముందు కరెంటులేకుండా చేస్తే, అరగంట తంటాలుపడి సేఫ్ తెరవచ్చు. కానీ యియ్యడం సాధ్యంగాదు'' అన్నాడు జాన్.

''అదంత మంచి పథకంకాదు. అరగంటసేపు ఆ ఇంట్లో వుండటం ప్రమాదాలకు దారితీయొచ్చు. వాటి కంట్రోలు స్విచ్‌లు ఎక్కడుందేది కనుక్కోవడమే మంచిదనిపిస్తుంది!'' క్రిస్టోఫర్ తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

''నాకూ అదే మంచిదనిపిస్తూంది!'' అంది స్వప్న.

''ఇక్కడ కంపెనీ ఆఫీసులో మనం ఎవరినైనా లోబరుచుకో గలిగితే వాటి రహస్యాలు సంపాదించవచ్చు. ప్రతి కష్టమరుకు అమర్చిన సేఫ్ తాలూకు ప్లాను ఆఫీసులో వుంటుంది. వాట్ని చేజిక్కించుకుంటే వ్యవహారం

ఫైసలవుతుంది" జాన్ అన్నాడు.

"ఆ విషయం నాకు వదిలెయ్యండి! నేనెలాగో తంటాలు పడతాను. ఎల్లుండి రాత్రికి మొదటి దొంగ తనం చేద్దాం! ఈలోగా నేను నీకు కావలసిన వివరాలు పట్టుకొస్తాను. మన మీటింగ్ ప్లేస్ ఇదే! ఎల్లుండికూడా ఇక్కడికే రండి" అన్నాడు క్రిస్టోఫర్.

"అలాగే" అన్నారు స్వప్న, జాన్‌లు.

క్రిస్టోఫర్ అక్కడ్నుంచి బయలుదేరి వెలుపలికొచ్చాడు. టాక్సీ ఎక్కి తిన్నగా "లైన్ సేఫ్ కంపెనీకి" పోనిమ్మన్నాడు.

టాక్సీ మౌంట్ రోడ్ కేసి దౌడు తీసింది.

లైన్ సేఫ్ కంపెనీ ముందాగింది టాక్సీ. క్రిస్టోఫర్ టాక్సీని వెయిటింగ్‌లోనే వుంచి లోనికి వెళ్ళాడు.

మేనేజర్ అని వున్న రూం తలుపు తోసుకుని వెళ్ళాడు. క్రిస్టోఫర్‌ను చూడగానే మేనేజర్ లేచి కూర్చోమని సంజ్ఞ చేశాడు. ఇద్దరూ కూర్చున్నారు.

"నా బంగళాలో మీ కంపెనీ సేఫ్ ఫిక్స్ చేయించా లనుకుంటున్నాను" అన్నాడు క్రిస్టోఫర్ సిగరెట్ అంటిస్తూ.

"ష్యూర్! అలాగే. మీ యింటి అడ్రసు రాసివ్వండి. మా ప్లానింగ్ వింగ్ వాళ్ళు వచ్చి చూసి ప్లాన్ తయారు చేస్తారు. ఆ తర్వాత మీకు చూపిస్తారు. మీరు సరే నంటే పని ప్రారంభం చేస్తారు" అన్నాడు మేనేజర్.

"అదంతా లాంగ్ ప్రోసెస్. నాకు రేపుసాయంత్రం కల్లా కావాలి. నేను చాలా ఖరీదైన నగలు కొన్నాను. రేపు డెలివరీ చేస్తారు. వాట్ని భద్రం చేసుకోవాలి" అన్నాడు క్రిస్టోఫర్.

"ఐ. సీ. మామూలుగా మాకు నెలరోజులు పడు తుంది."

"అయితే లాభం లేదు."

"పోనీ మా పని అయ్యేదాకా మీ నగలు బ్యాంక్‌లో పెట్టండి."

"అది నాకిష్టం లేదు. బ్లాక్ మనీతో కొంటున్నా నీ నగలు. బ్యాంక్‌లో పెడితే ఎవరన్నా ఆరా తీయొచ్చు-ఇన్‌కంటాక్స్, వెల్త్‌టాక్స్ వాళ్ళు రైడ్ చెయ్యొచ్చు. అది చాలా ప్రమాదం."

"ఐ అండర్‌స్టాండ్! అయితే ఎలా చేద్దాం!"

"ఈ వూళ్ళో ఇంతకు ముందెవ్వరికీ మీరు సేఫ్‌లు అమ్మలేదా?"

"ఎందుకు లేదు! దాదాపు వందమందికి పైగానే కొన్నారు."

"మీదగ్గిర వాళ్ళ తాలూకు ప్లాన్సు వుంటే చూపించండి. ఏదో ఒకటి సెలెక్ట్ చేసుకుంటాను. దాని ప్రకారం ఫిక్స్ చేద్దురుగాని!" అన్నాడు క్రిస్టోఫర్.

"సారీ! అలా చూపడం మా కంపెనీ పద్ధతికి వ్యతిరేకం. ఒకరి ప్లాన్ మరొకరికి తెలియకుండా వుంచడంలోనే మా బిజినెస్ గొప్పతనం వుంది."

"మీ ప్రిన్సిపల్ నా కర్థమవుతూంది. నా డిఫికల్టీ కూడా మీరు ఆలోచించండి.

"మీ కంపెనీ వెతుక్కుంటూ వచ్చిన కష్టమర్‌ని. ఏదో విధంగా తృప్తి పరచడంకూడా మీ ధర్మమే! నాకెలాగైనా మీరు సాయం చేయాలి" అన్నాడు క్రిస్టోఫర్.

"పర్సనల్‌గా మీకు సాయం చెయ్యాలని వుంది. కానీ..రూల్స్ నతిక్రమించడం నాకంత మంచిదిగాదు;

రేపేదైనా జరిగితే మొత్తం నామీద చుట్టుకుంటుంది."

"నేనేం దొంగను కాను. ఆలోచించండి."

మేనేజర్ ఆలోచనలో పడ్డాడు.

టేబుల్ పైనున్న ఇంటర్ కమ్ మ్రోగింది. అతను రెండు నిముషాలు మాట్లాడి—

"మా జనరల్ మేనేజరుగారు పిలుస్తున్నారు, వెళ్ళి ఇప్పుడే వస్తాను. ఆయనతో కూడా సంప్రదిస్తాను" అన్నాడు మేనేజర్.

"వద్దు! ఈ విషయం మనిద్దరి మధ్య వుంచండి. మీ సాయం వృధాపోదు" అంటూ వెయ్యిరూపాయలు తీసి టేబుల్ పైన పెట్టాడు.

మేనేజర్ వాటికేసి చూసి, తక్కున లాక్కుని జేబులో పెట్టుకొని వెళ్ళిపోయాడు.

క్రిస్టోఫర్ ఆనందంగా ఈలవేశాడు. అతను ప్లాను చూపించగానే తనకావలసినవాళ్ళ ప్లానుల్లో స్విచ్ లు ఎక్కడున్నదీ గుర్తుపెట్టుకోవాలి. తను ఏకసంథగ్రాహి. అదేం పెద్ద కష్టమైన విషయం గాదు.

మేనేజర్ తిరిగివచ్చాడు గదిలోకి. లావుపాటి రికార్డు బుక్ తెచ్చి అందించాడు క్రిస్టోఫర్ కు.

"త్వరగా చూడండి!" అన్నాడు.

క్రిస్టోఫర్ తన పనిలో నిమగ్నమయినాడు. మేనేజర్ ఏదో పెద్ద స్టేట్ మెంట్ ముందు పెట్టుకుని చూడసాగాడు.

మళ్ళీ ఇంటర్ కమ్ మ్రోగింది. లేచి వెళ్ళాడు.

క్రిస్టోఫర్ తక్కున రెండు ప్లాన్లు చింపి, మడతచుట్టి కోటుజేబులో పెట్టుకున్నాడు.

మేనేజర్ తిరిగొచ్చాడు.

"సెలక్ట్ చేశారా?" అడిగాడు.

"ఆఁ!" అంటూ పుస్తకం ముందుకు పెట్టి "ఆ ఏడో నెంబరు ప్లానులా ఫిక్స్ చేయించండి" అన్నాడు.

"మా ఫిట్టర్‌ను రేపు పంపేదా?"

"పంపండి. అడ్వాన్సు ఇస్తాను. అడ్రసుకూడా రాసి స్తాను" అంటూ కాగితంపైన అడ్రసు రాసి వెయ్యి రూపాయలు అడ్వాన్సు ఇచ్చి, మేనేజర్ దగ్గర శెలవు తీసుకుని వెలుపలికొచ్చి వెయిటింగ్‌లో నున్న టాక్సీ ఎక్కి తిన్నగా ఎవరెస్ట్ హౌస్‌కి పోనివ్వమన్నాడు.

టాక్సీ బయలుదేరింది.

క్రిస్టోఫర్‌కు నవ్వొచ్చింది. రేపు ఆ అడ్రసుకు వెళ్ళిన ఫిట్టర్ బిక్క మొహం వేస్తాడు. అది రాజేశ్వరీ కల్యాణ మండపం అడ్రసు. మేనేజర్‌కు తన్నెవరో మోసం చేశారన్నది తెలుస్తుంది. కానీ లంచం తీసుకున్నాడు కాబట్టి నోరుమూసుకుని కూచుంటాడు తప్ప, వేరే గొడవ చెయ్యడన్న ధైర్యం కలిగింది.

టాక్సీ ఎవరెస్ట్ హౌస్ ముందాగింది. డబ్బిచ్చి లోనికి నడిచాడు క్రిస్టోఫర్.

# 6

"మిస్టర్ అశోక్! నేను జీవితమంతా కష్టపడి సంపాదించిన ఆస్తి విలువ ఎంతో తెలుసా?" అడిగాడు బాస్.

"తెలీదు సార్!" అన్నాడు అశోక్.

"ఆరు కోట్లు. ఆ డబ్బు నా తదనంతరం బేబీకి వస్తుంది. బేబీని పెళ్ళాడేవాడెవరైనా క్షణంలో కోటీశ్వరుడవుతాడు."

"అవును సార్!"

"బేబీని పెళ్ళిచేసుకోమని ఎన్నోసార్లు చెప్పాను. ఎన్నో సంబంధాలు తెచ్చాను. ఆమెకి ఎవ్వరూ నచ్చ

లేదు. ఇంతదాకా పెళ్ళిచేసుకోలేదు. నేను చచ్చే లోపల ఆమెకు పెళ్ళి కాదేమోనన్న భయం నన్ను పట్టుకుని పీడిస్తూనే వుండింది. ఈ ట్రిప్‌లో అదికాస్తా పోయింది."

"ఇక్కడేదైనా సంబంధం చూశారా?"

"లేదు! తనే చూసుకుంది."

"ఎవరుసార్ పిల్లాడు. అతని కెన్నికోట్లుకుంది ఆస్తి!"

"తొడుక్కోను కోటులేదు. నెలకు వెయ్యిరూపాయల జీతం వస్తుందట."

"ఎవరుసార్ అతను?"

"నీకింకా అర్థంకాలేదా? నువ్వే అతను."

"నేనా! వేళాకోళ మాడుతున్నారు. మీ దగ్గర ఉద్యోగం చేసుకుని బ్రతికే వాణ్ణి" అన్నాడు అశోక్.

"నువ్వెవరివైనా నా కనవసరం. అమ్మాయి ఇష్టపడ్డాక వాడు దారినపోయే దానయ్యయినాసరే ఇచ్చి కట్టబెడతాను. నీకు చేసుకోవడం ఇష్టంలేదా? ఆరుకోట్ల రూపాయలకు అధికారిణి మా బేబీ. నిన్ను ప్రేమించింది. పెళ్ళాడతా నంటోంది. కాళ్ళదగ్గర కొచ్చిన లక్ష్మిని కాలదన్నుకోకు" చెప్పాడు బాస్.

అశోక్ ఆలోచనలో పడ్డాడు. ఆస్తి, అంతస్తు తనకేం చేదుగాదు. కానీ బేబీని తలచుకుంటే భయం పుట్టింది. ఆమె కామపిశాచి. ఆమె డబ్బు మీద ఆశ వున్నా, ఆమెతో జీవితం నరకప్రాయమన్న నిర్ణయానికొచ్చాడు.

"క్షమించండి! నాకు ఇలాగే బ్రతకటం ఇష్టం. బేబీకి మంచిసంబంధం చూడండి. నన్ను వదిలెయ్యండి" అన్నాడు అశోక్.

అప్పుడే గదిలో కొచ్చింది బేబీ.

"ఆయన ఏమంటున్నారు డాడీ!" అడిగింది.

అశోక్ చెప్పింది చెప్పాడు బాస్. వినింది బేబీ.

"అయితే నిన్న నువ్వు చెప్పింది అబద్ధం కదూ! నీ బాస్ కూతుర్నని నన్ను ఆశాలాని కత్తేశావు. అంతేనా!"

"కాదు!" అన్నాడు అశోక్.

"కాకుంటే ఎందుకు పెళ్ళాడడానికి భయపడుతున్నావు. నేను నీకు నిజాయితీ గల భార్యగా వుండగలను. నా ఆస్తి అంతస్తు గురించి ఆలోచించకు" అంది బేబీ.

"నన్ను ఆలోచించుకో నివ్వండి" అన్నాడు అశోక్.

"అలాగే! నువ్వు నా డబ్బుతో బ్రతకవలసిన అవసరం లేదు. నువ్వు జనరల్ మానేజర్‌గానే వుండు. నీ జీతం పెంచుతాను. నెలకు పదివేలు జీతం ఇస్తాను. ఆ డబ్బు నీ ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టుకో! సరేనా!" అన్నాడు బాస్.

అశోక్ కాసేపు మధనపడ్డాడు.

"అలాగే!" అన్నాడు అశోక్.

"గుడ్ బాయ్!" అన్నాడు బాస్.

బేబీ గర్వంగా నవ్వింది.

"అమ్మాయిని తీసుకొని పో! మీకు కావలసిన బట్టలు, నగలు అన్నీ కొనుక్కోండి. పెళ్ళికి ఏర్పాట్లు చేస్తాను. ఎవ్వరూ, ఎన్నడూ చేయని విధంగా చేస్తాను ఈ పెళ్ళి!" అన్నాడు ఆవేశంగా బాస్.

"ఆ ఆడంబరాలు నాకు పనికిరావు. సింపుల్‌గా జరగడం బాగుంటుంది. ఇక్కడే రిజిస్ట్రాఫీసులో కానిచ్చేద్దాం. ఫ్రెండ్స్‌ను పిలిచి పార్టీ ఇద్దాం. అంతే!" అన్నాడు అశోక్.

"అలాగే కానీండి నాన్నా!" అంది బేబీ.

ఆ తర్వాత ఇద్దరూ కారెక్కారు.

"అశోక్! నాపైని ఇష్టంలేదా నీకు!" అడిగింది.

"ఇష్టంలేక కాదు. నేను తగిన భర్తను కానేమోనని అనుమానమేసింది. అదీగాక నేను ఇంతకుముందు చాలా మంది ఆడవాళ్ళతో సంబంధం పెట్టుకున్నాను. నిన్ను మోసం చెయ్యడం ఇష్టంలేక అలా అన్నాను" అన్నాడు అశోక్.

"పెళ్ళికిముందు జరిగిన వాటిన్నిగురించి, నువ్వూ, నేనూ మరచిపోదాం! ఇకపైన ఒకరికొకరం నీతిగా నిజాయితీగా వుందాం. అంతవరకు చాలు!" అంది బేబీ.

"అలాగే!" అన్నాడు అశోక్.

కారు చెల్లారామ్స్‌షాపు ముందాపి లోనికెళ్ళారు. రెండుగంటలసేపు బట్టలు ఏరికోరి కొన్నారు. బిల్లు పది వేలయింది. బేబీ చెక్ రాసిచ్చింది. పాకెట్లు తెచ్చి డిక్కీలో పెట్టాడు బాయ్.

ఇద్దరూ అక్కడ్నుంచి ఎమరాల్డ్ హౌస్‌కి వెళ్ళారు.

ఖరీదైన రత్నాల నెక్లెస్ కావాలంది బేబీ. మానేజర్ ఆరో అంతస్తులో వున్న తారాచంద్ దగ్గరకు తీసుకెళ్ళాడు. తారాచంద్ ఇద్దర్నీ కూర్చోబెట్టి తనదగ్గరున్న నెక్లెసులు చూపించాడు. బేబీకి నచ్చలేదు. పైగా వాటి ఖరీదుకూడా అంత ఎక్కువగాలేదు.

"సంవత్సరం క్రితం పేపర్లో చదివాను. విలువైన రత్నాలతో పొదిగిన నెక్లెస్ ఒకటి సినిమాతార శమంతకమణి కొన్నట్లు. మీదగ్గరేనా?" అడిగింది బేబీ.

"అవునండీ!"

"దాని ఖరీదెంత?"

"అప్పట్లో ఐదులక్షలకు అమ్మాను. ఇప్పుడైతే ఏడు లక్షలదాకా అవుతుంది," చెప్పాడు తారాచంద్.

"నా కలాంటి రత్నాల నెక్లెస్ కావాలి! మీ దగ్గర ఆ

రకం రవ్వలున్నాయా?" అడిగింది బేబీ.

"ప్రస్తుతం లేవు. మీకు కావాలంటే ఢిల్లీనుండి తెప్పిస్తాను. ఎల్లుండి సాయంత్రానికల్లా ఇవ్వగలుగుతాను" అన్నాడు తారాచంద్.

నెక్లెసుల డిజైన్ల బుక్ తీసి పరిశీలనగా చూసి, ఒక మోడల్ సెలెక్టు చేసి, "ఈ రకం మోడల్ నెక్లెసు తయారుచేసి ఇవ్వండి," అంది బేబీ. అశోక్ కూడా దాన్నే లైక్ చేశాడు.

"అలాగే!" అన్నాడు తారాచంద్.

"అడ్వాన్సుగా లక్షరూపాయలకు చెక్కిస్తాను" అంటూ పర్సులోంచి చెక్ బుక్ తీసి గబగబ రాసి సంతకం చేసి, చించి ఇచ్చింది.

తారాచంద్ బెల్ కొట్టాడు.

మిస్ స్వప్న లోనికొచ్చింది.

"అమ్మగారికి రశీదు టైప్ చేసి పట్టుకురా!" అన్నాడు తారాచంద్.

"మిస్టర్ అశోక్!" అంది స్వప్న.

"నువ్వా! ఇక్కడేనా పనిచేసేది" అడిగాడు అశోక్. అతడికి మిస్ స్వప్నతో అదివరకే పరిచయముంది.

"రశీదు త్వరగా పట్టుకురండి!" అంది బేబీ, అశోక్ ఆమెతో మాట్లాడటం ఇష్టంలేక.

"ఇప్పుడే తెస్తాను" అంటూ లోనికి పరిగెత్తింది స్వప్న.

బేబీ తండ్రి గురించి తెలుసుకొని తారాచంద్ నోరు వెళ్ళబెట్టాడు. వాళ్ళు కాతా తనకు చిక్కినందుకు లోలోపలే సంతోషపడ్డాడు. అతనికి ఆతృతగా వుంది. వాళ్ళు వెళ్ళగానే తను క్రిస్టోఫర్ను కలుసుకోవాలి. అతన్నా

పని పూర్తి చెయ్యమని చెప్పాలి. అతను తెస్తే తప్ప బేబీ కిచ్చిన మాట నిలబెట్టుకోవడం సాధ్యంకాదు.

డబ్బు తీసుకొని వెళ్ళాక క్రిస్టోఫర్ తనదగ్గరకు రానే లేదు. అతనికోసం రోజూ ఎదురు చూస్తూనే వున్నాడు.

స్వప్న రశీదు తెచ్చింది. తారాచంద్ సంతకంచేసి ఇచ్చాడు. బేబీ లేచింది.

"ఎల్లుండి వస్తాం!" అన్నాడు అశోక్.

"వచ్చేముందు ఫోన్ చెయ్యండి. ఏదైనా ఆలస్య ముంటే మీకు చెపుతాను" అన్నాడు తారాచంద్.

"ఆలస్యం కావడానికిలేదు. ఆ రోజ్ మా మారేజ్ జరుగుతుంది. రాత్రికి పార్టీ వుంది. పార్టీకి నేనా నెక్లెను పెట్టుకోవాలి" అంది బేబీ.

"ఆలస్యమంటే రోజులు కాదు. గంటలు. మీకు పార్టీకి దాన్ని అందించే పూచీ నాది" అన్నాడు తారా చంద్.

"థాంక్స్! వస్తాను!" అన్నాడు అశోక్.

బేబీగూడా వెంట నడిచింది. హాల్లో కూర్చుని టైప్ చేస్తున్న స్వప్న అశోక్ కేసి చూడటం బేబీ గమనించింది. అతన్నటు చూడనీకుండా ఏదో కల్పించుకొని మాట్లా డుతూ చెయ్యిపట్టుకని క్రిందకు మెట్లమీదుగా నడిపించుకు పోయింది.

వాళ్ళు వెళ్ళిపోగానే సేఠ్ తారాచంద్ హోటల్ పారడైజ్ కు ఫోన్ చేసి, క్రిస్టోఫర్ ను వెంటనే వచ్చి కలుసుకోమన్నాడు.

# 7

రిజస్ట్రాఫీసులో పెళ్ళి తతంగం ముగించుకొన్నారు.

అశోక్, బేబీ, బాస్ ముగ్గురూ కార్లో హోటల్ కు బయలుదేరారు.

ముందు సీట్లో కూర్చున్న బేబీ నవ్వింది.

"ఏమిటి నవ్వుతున్నావు?" అడిగాడు అశోక్.

"ఏంలేదు! ఆ ఆఫీసుదగ్గర జరిగే పెళ్ళిళ్ళకు సాక్షి సంతకాలు చేసేందుకు వచ్చిన వాళ్ళను తలచుకుంటే తమాషా గా వుంది" అంది బేబీ.

"అది వాళ్ళ జీవనం" అన్నాడు అశోక్.

"ఇంత డబ్బుండి దిక్కు లేనట్లు ఎవరో కొధకల్ని సాక్షులు గా డబ్బిచ్చి తెచ్చుకోవడం నాకు నచ్చలేదు!" అన్నాడు బాస్.

అశోక్ జవాబు చెప్పకుండా కూర్చున్నాడు.

కారు ఎమరాల్డ్ హౌస్ ముందాగింది.

"నాన్నా! పదినిముషాల్లో వచ్చేస్తాం! మీరు కూర్చొనుండండి" చెప్పింది బేబీ కారుదిగుతూ.

అశోక్ కూడా కారు దిగాడు. ఇద్దరూ వెళ్ళి తారా చంద్ ను కలుసుకుని అంతకుముందు తాము ఆర్డర్ చేసిన నెక్లెను డెలివరీ తీసుకున్నారు.

అట్టపెట్టె విప్పిచూసి ఆనందంతో ఎగిరి గంతేసింది బేబీ. మిగిలిన డబ్బుకు చెక్ రాసి ఇచ్చింది. తారాచంద్ అందుకున్నాడు దాన్ని. గుమ్మందాకా సాగనంపాడు ఇద్దర్నీ.

స్వప్న, అశోక్ ను చూసి నవ్వింది. అశోక్ కూడా నవ్వాడు. ఇద్దరూవచ్చి కారెక్కారు.

ఆ రాత్రి ఓషియానిక్ హోటల్ అంతా రంగురంగుల దీపాలతో వెలిగిపోయింది.

ఎనిమిదిగంటలనుండి ఆహ్వానితులు రావటం మొదలెట్టారు. గ్రే కలర్ సూట్ వేసుకున్నాడు అశోక్. గులాబీ రంగు చీర, జాకెట్ ధరించింది బేబీ. తారాచంద్ దగ్గరకొన్న నెక్లెను పెట్టుకుంది.

పదిగంటల ప్రాంతంలో ప్రఖ్యాత సినీనటి శమంతక మణి వచ్చింది.

ఆమె బేబీకి స్నేహితురాలు. బొంబాయికి వచ్చినప్పుడల్లా బేబీతోనే వుంటూ వుంటుంది. ఊటీకి ట్రంకాల్ చేసి తన పెళ్ళిగురించి చెప్పి ఎలాగైనా పార్టీకి రమ్మని కోరింది. శమంతకమణి కాదనకుండా వచ్చింది.

"ఏమిటి ఇంత ఆలస్యంగా వచ్చావ్?" అడిగింది బేబీ.

"ఇంట్లో దొంగలుపడ్డారు. నగలన్నీ ఊడ్చుకు పోయారు. కంప్లయింట్ ఇచ్చాను. వాళ్లు వచ్చి గంట సేపు పరిశోధిస్తూ కూర్చున్నారు. వాళ్ళు వెళ్ళాక బయలుదేరి వచ్చాను."

"దొంగలా! నగలన్నీ పోయాయా?" అడిగాడు అశోక్ ఆమె అందాన్ని తేరిపార చూస్తూ.

"మొత్తం పోయాయి. దాదాపు పదిలక్షల ఖరీదు వుంటాయి" అంది శమంతకమణి.

"అంత అజాగ్రత్తగా ఎందుకున్నావ్?" అడిగింది బేబీ.

"అజాగ్రత్త ఏమీ లేదు. అంతా పకడ్బందీగానే వుంది. ఎప్పుడూ ఇలా జరగలేదు. ఇంట్లో పనివాళ్లుకూడా ఏమీ తెలీదంటున్నారు. తాళాలన్నీ తీశారు. వేశారు. మీ కంపెనీలో తయారయిన లైన్ సేఫ్ అమర్చారు మా ఇంట్లో. అది దొంగలకు అలవికాదు. దాన్ని ఓపెన్ చెయ్యడంకూడా కష్టం. కానీ వీళ్లు దాన్నికూడా ఓపెన్ చేశారు" చెప్పింది శమంతకమణి. ఆమెను చూస్తేనే విచార సముద్రంలో మనిషి మునిగిపోయినట్లుగా తెలుస్తూంది.

లైన్ సేఫ్ కంపెనీ బేబీ వాళ్ళదే. అశోక్ ఆ కంపె

నీకే జనరల్ మేనేజర్‌గా వుంటున్నాడు. దాంతోపాటు మరో ఆరు బిజినెస్‌లుకూడా వున్నాయి. బేబీకి లైన్ సేఫ్‌ల గురించి తెలుసు. దాంట్లోవున్న వస్తువుల్ని దొంగిలించడమంటే వాళ్ళెవరో అసాధ్యులయి వుండాలను కొంది.

"పోలీసు లేమన్నారు?" అడిగాడు అశోక్.

"ఈ సేఫ్‌ల విషయం తెలిసిన వాళ్ళెవరో ఆ పని చేసి వుండాలన్నారు. అందుకని దొంగను పట్టుకోవడం ఆలస్యమవుతుందేగానీ, ఖచ్చితంగా పట్టుకోగల మన్నారు" అంది శమంతకమణి.

"దొంగతనం ఎప్పుడు జరిగింది?"

"తెలీదు! నేనివాళే వచ్చాను. పార్టీకి వచ్చేందుకు అలంకరించుకోను నగలు తీసుకుందామని సేఫ్ తెరిచాను. అందులో ఏంలేదు. మొత్తం ఖాళీ. వెంటనే పోలీసులకు ఫోన్ చేశాను."

"సారీ! శమంతా. పార్టీ అయ్యాక వెళ్ళిపోకు. ఏం చెయ్యాలో ఆలోచిద్దాం!" అంది బేబీ.

అశోక్ ఆలోచనలో పడ్డాడు. ఆ దొంగతనం ఎవరు చేసి వుంటారాని ఊహించసాగాడు.

అంతలో పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది. అందులోనుండి ఇద్దరు ఇన్స్పెక్టర్లు దిగారు.

వాళ్ళను చూడగానే అశోక్ కాస్త కంగారు పడ్డాడు.

బుర్రమీసాలతో లావుగావున్న ఇన్‌స్పెక్టర్ అశోక్ దగ్గరకొచ్చి "నా పేరు రాయుడు! మీరేదో ఫంక్షనులో వున్నట్లున్నారు. ఐదు నిముషాలు మీతో మాట్లాడాలి! ఇలా వస్తారా?" అడిగాడు అశోక్‌ను.

బేబీ కలవరపడింది.

"అలాగే!" అంటూ అక్కడ్నుంచి తిన్నగా రాయుడి వెంట ఓ ప్రక్కకు వెళ్ళాడు అశోక్.

"లైన్ సేఫ్ కంపెనీకి మీరు జనరల్ మానేజర్‌గా పనిచేస్తున్నారు కదూ!" అడిగాడు రాయుడు బుర్ర మీసాలు త్రిప్పుకుంటూ.

"అవును!" అన్నాడు అశోక్.

"మీ కంపెనీ సేఫ్ అమర్చిన శమంతకమణి అనే పెద్ద సినీతార ఇంట్లో దొంగతనం జరిగింది. వెళ్ళి వాకబు చేశాం. మాకు తెలిసిందాన్ని బట్టి సేఫ్ తెరవడం అసాధ్యం. బర్గలరీ కంట్రోల్ కూడా వుంది. ఓపెనింగ్ స్విచ్‌లు బాత్‌రూంలో వున్నాయి. దాన్ని ప్లాన్ చేసింది మీ కంపెనీయే. దొంగ మీ కంపెనీవాడన్నా కావాలి. లేదా మీ కంపెనీలో పనిచేసే వాళ్ళెవరన్నా రహస్యాలు చెప్పివుండాలి!"

"మీ అనుమానం కరెక్ట్!" అన్నాడు అశోక్.

"మీకెవరిపైనన్నా అనుమానం వుందా?"

అశోక్ తన కంపెనీ గురించి వివరంగా చెప్పాడు. ఆ సేఫ్‌లను అమర్చినప్లాన్లు, ఓపెనింగ్ స్విచ్‌లు ఎక్కడ వుంచిందీ మొదలైన వివరాలు నమోదు చేసిన రికార్డుబుక్ తన కస్టడీలోనే వుంటుందని ఒప్పుకున్నాడు. తనకు తెలీకుండా తియ్యగలిగింది ఒక్క మానేజర్ మాధవ రావు మాత్రమేనని చెప్పాడు.

"మీ మేనేజర్ మాధవరావును ఎవరో రివాల్వరుతో కాల్చి చంపారు?"

"మైగాడ్! ఎప్పుడు? ఎక్కడ?"

"ఇంట్లోనే. సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో చనిపోయి వుంటాడని మా డాక్టరు అనుమానిస్తున్నాడు.

అతన్ని సోదా చేశాం. అతని దగ్గర మొత్తం వెయ్యి రూపాయలున్నాయి” అన్నాడు రాయుడు.

“అతని జీతం నాలుగువందలే!” అన్నాడు అశోక్.

“అంటే అతనే ఎవరికో సమాచారం ఇచ్చివుంటాడు. అందుకు ప్రతిఫలంగా వెయ్యి రూపాయలు తీసుకొని వుంటాడు. దొంగతనం గురించి శమంతకమణి తెలుసుకో గానే పోలీసులకు ఫోన్ చేస్తుందనీ, మేము మాధవ రావును అనుమానిస్తామనీ వాళ్లు ఊహించి వుంటారు. తమ ఆచూకీ అతనిస్తాడేమోనన్న అనుమానంతో వెంటనే అతన్ని హత్యచేసి వుండాలి” అన్నాడు రాయుడు.

అశోక్ ఏమీ మాట్లాడలేదు.

“ఓమారు మీరు ఆఫీసుదాకా వస్తారా? ఆ రికార్డు బుక్ చూద్దాం! అలాగే మాధవరావు ఎక్కడన్నా ఏమన్నా రాసిపెట్టాడేమో చూద్దాం!” అన్నాడు రాయుడు.

“పార్టీ జరుగుతూంది. చాలామంది వచ్చారు. పైగా ఇది మారేజ్ పార్టీ. ఒక గంటలో అయిపోతుంది. ఆ తర్వాత నేను మీ వెంట ఎక్కడికి రమ్మంటే అక్కడి కొస్తాను” అన్నాడు అశోక్.

రాయుడు ప్రక్కనున్న ఇన్‌స్పెక్టర్ కేసి చూశాడు.

“శమంతకమణిని ఇంకోమారు కలుసుకోవాలి! ఈలోగా అక్కడికెళ్ళి వద్దాం!” అన్నాడు ఇన్‌స్పెక్టర్.

“ఆమెకూడా ఇక్కడే వుంది!” చెప్పాడు అశోక్.

“అయితే మేముకూడా పార్టీలో వుంటాం. అంతా అయ్యాక వెళ్ళొచ్చు” అన్నాడు రాయుడు.

“చాలా సంతోషం! రండి. డిన్నర్ సర్వ్ చేస్తు న్నారు,” అన్నాడు అశోక్.

ఇన్‌స్పెక్టర్స్ ఇద్దరూ జనంలోకి వెళ్ళారు. అశోక్

వచ్చి బేబీ ప్రక్క నిలబడ్డాడు.

"ఏమంటున్నారు?" అడిగింది.

టూకీగా జరిగిందంతా చెప్పి "మన మాధవరావును హత్యచేశారట దొంగలు. రివాల్వర్‌తో దారుణంగా కాల్చి చంపారని చెప్పాడు ఇన్‌స్పెక్టర్. పూర్ ఫెలో. చాలా కష్టపడి పనిచేసేవాడు" అన్నాడు అశోక్.

"ఆ కంపెనీ రేపే అమ్మేద్దాం!" అంది బేబీ దృఢ నిశ్చయంతో.

"ఏం? ఎందుకని?"

"ఈ పోలీసు గొడవలు నాకు నచ్చవు. ఎవరింట్లోనో దొంగతనం పోవటం, దానికి మనల్ని వేళా పాళా లేకుండా వచ్చి అల్లరిచెయ్యడం, ఈ నాన్సెన్సంతా నేను భరించలేను," అంది బేబీ.

ఇంక ఆమెతో మాట్లాడి లాభంలేదని నోరు మూసుకుని డిన్నర్ టేబుల్స్ వేపు ఆమెను నడిపించుకుపోయాడు.

# 8

లైన్ సేఫ్ కంపెనీ ముందాగింది పోలీస్ జీప్. అందు లోంచి రాయుడు, అతని సహచరుడూ, అశోక్ క్రిందికి దిగారు.

ఆఫీసు తాళాలు తెరచి లోనికి వెళ్ళారు ముగ్గురూ.

అశోక్ తన గది తలుపులు తెరచి అందులో అమర్చిన లైన్ సేఫ్ తెరచి లావుపాటి రికార్డుబుక్ వెలుపలికిలాగి, రాయుడికి అందించాడు.

ఇదేమిటన్నట్లు చూశాడు అశోక్ కేసి రాయుడు.

"మేము మద్రాసు సర్కిల్‌లో ఫిటప్ చేసిన సేఫ్ తాలూకు ప్లాన్లు మొత్తం సీరియల్ నెంబరు ప్రకారం అందులో వున్నాయి" అన్నాడు అశోక్.

రాయుడు మెల్లగా ఒక్కొక్కటి తిరగవేయ సాగాడు. పేర్లు చదువుతూ పేజీలు తిరగేస్తూపోయాడు. మొత్తం పూర్తయ్యేసరికి అందులో రెండు ప్లాన్లు లేవని అర్థమయింది. ఆ రెండు బలంగా చింపినట్లు గుర్తించాడు. ఫైలింగ్ క్లిప్పు తగులుకొని చినిగిన కాగితం ముక్కలు కనుపించాయి.

"నలభై ఎనిమిదో నెంబరు ప్లాను, తొంభై రెండో నెంబరు ప్లాను లేవండీ ఇందులో" అన్నాడు రాయుడు.

"నిజంగా!" అన్నాడు అశోక్ ఆతృతగా రికార్డ్ బుక్ అందుకొని.

"నిజంగానే లేవు!" అన్నాడు రాయుడు.

అశోక్ వడివడిగా వరుస నెంబర్లు చెక్ చేశాడు. శమంతకమణిది నలభై ఎనిమిదో నెంబరు ప్లాను. తొంభై ఎనిమిదో నెంబరు డాక్టరు బార్జిది. రెండూ బుక్ లోంచి చింపేశారు.

"ఎవరు చింపారు వాట్ని?" అడిగాడు రాయుడు.

"ఏమోనండీ! మొన్న రాత్రినుండి నేను ఆఫీసుకు రాలేదు. మా బాస్ బొంబాయినుండి వచ్చాడు. వాళ్ళ వెంట తిరగడం, వాళ్ళకు సౌకర్యాలు సమకూర్చడం సరిపోయింది. ఇప్పుడు మీ వెంటే మళ్ళీ ఆఫీసుకొచ్చాను" అన్నాడు అశోక్.

"లోనికొచ్చేందుకు తాళాలు మీ దగ్గరకెలా వచ్చాయి?"

"ఆఫీసుకొక జత, నాకు వేరే జత వున్నాయి."

"ఆఫీసు తాళాలు ఎవరిదగ్గర వుంటాయి."

"మాధవరావు దగ్గర."

"అంటే మీరుగానీ, మాధవరావుగానీ, ఏ టయిమ్‌లో కావాలన్నా రావచ్చనన్న మాట."

"రావచ్చండీ!"

"మాధవరావెలాంటివాడు?" అడిగాడు ప్రక్కనున్న ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలిసినంతవరకు చాలా మంచివాడే! డబ్బు కోసం కంపెనీ రహస్యాల్ని అమ్ముకొనేంత నీచుడు కాడు" అన్నాడు అశోక్.

"నిన్న మీరు ఆఫీసుకు రాలేదన్నారు. మాధవరావు ఏవైనా ఆర్డరు బుక్ చేశాడేమో చూడండి. రిసెప్షన్ రిజిస్టరులో నిన్న ఎవరెవరు లోనికొచ్చింది రాసి వుంటుందిగా. అదికూడా కాస్త చూపించండి" అన్నాడు రాయుడు.

అశోక్ పది నిముషాలు తంటాలుపడి ఆర్డర్ బుక్, విజిటర్స్ బుక్ వెతికి తీసుకొచ్చాడు.

"ఆర్డర్ బుక్ ప్రకారం నిన్న మాధవరావు బుక్ చేసింది ఒకటే ఆర్డరు. అతని పేరు, అడ్రసు ఈ డూప్లికేట్ పైన వుంది. వెయ్యి రూపాయలు అడ్వాన్సు ఇచ్చాడు" అన్నాడు అశోక్.

రాయుడు అతని పేరు అడ్రసు రాసుకొన్నాడు. విజిటర్సు బుక్‌లోంచి కొన్ని అడ్రసులుకూడా నోట్ చేసుకున్నాడు. ఆ తర్వాత ముగ్గురూ వెలుపలికొచ్చి జీప్ ఎక్కారు. జీపు బయలుదేరింది.

అశోక్‌ను ఓషియానిక్ హోటల్‌లో దించి, రాయుడు జీప్‌ని తిన్నగా ఎడ్వర్డ్ ఇలియట్స్ రోడ్‌కు పోనిచ్చాడు. తనకు కావలసిన నెంబరుకోసం వెతుక్కుంటూ పోసాగాడు మెల్లగా జీప్‌లో.

ఆరో నెంబరు వేసివున్న కాంపౌండ్ ముందాగాడు. దానిపైనున్న పెద్ద సైన్‌బోర్డుకేసి చూశాడు. "రాజేశ్వరి కల్యాణ మండపం" అని వుంది. నవ్వుకొన్నాడు.

రామ్మూర్తి అన్న పేరుతో ఆర్డరు బుక్ చేసిన ఆగంతకుడే; లైన్ సేఫ్ కంపెనీలోంచి ప్లాన్లు రెండూ దొంగిలించి వుండాలని తీర్మానించుకున్నాడు. అందుకే అతను దొంగ పేరూ, అడ్రసూ, ఇచ్చి వుంటాడనిపించింది.

అతన్నెలా పట్టుకోవాలాని ఆలోచించసాగాడు. మెరుపులా ఆలోచన వచ్చింది. అతను రెండు ప్లాన్లు దొంగిలించాడు. శమంతకమణి యింట్లో దొంగతనం చేశాడు. పోతే మిగిలింది డాక్టర్ జార్జి ఇల్లు. ఆ ఇంటికి ఘట్టి కాపలా ఏర్పాటుచేస్తే, పిట్టలు వల్లో చిక్కొచ్చని పించింది.

# 9

"మాధవరావును నువ్వు చంపకుండా వుండవల్సింది" క్రిస్టోఫర్‌తో అన్నాడు జాన్.

"ఏం? ఎందుకని?" అడిగాడు క్రిస్టోఫర్.

"అనవసరంగా పోలీసులు రంగంలోకి దిగారు. వాళ్ళకు లైన్ సేఫ్ కంపెనీలో ప్లాన్లు పోయినట్లు తెలుస్తుంది. దాంతో మనం ఇంకెక్కడా దొంగతనం చేసేందుకు వీలేకుండా పోతుంది" అన్నాడు జాన్.

"శమంతక మణి తిరిగొచ్చిందాకా అసలు దొంగతనం జరిగిందన్న విషయం తెలీదు. నేను మారువేషంలో వెళ్ళాను. మాధవరావు మంచి నిద్రలో వున్నాడు. సైలెన్సర్ అమర్చిన రివాల్వరుతో అతన్ని కాల్చి చంపాను. నన్నెవ్వరూ చూడలేదు. నా ఆమాకీ తెలుసుకోవడం కష్టం. అంతకైతే డాక్టర్ జార్జ ఇంటిపై యీ రాత్రికే దాడిచేసి, దొరికిన సొమ్ముతో ఎటైనా వెళ్ళిపోదాం!"

అప్పుడే లోనికొచ్చింది స్వప్న, అతని మాటలు సగం వినింది.

"శమంతకమణి వచ్చేసింది" చెప్పింది స్వప్న కూర్చుంటూ.

"ఎప్పుడు?"

"ఈ రాత్రి."

"ఎందుకొచ్చింది."

"ఒక పెళ్ళిపార్టీ అటెండయేందుకు. మరో విషయం పోలీసులు అశోక్‌ను అనుమానిస్తున్నట్లుగా వుంది" అంది స్వప్న.

"థాంక్ గాడ్! ఇంకా నీకు ఏవైనా వివరాలు తెలిశాయా?"

"లేదు. అశోక్‌ను ఇక్కడకు రమ్మని ఇప్పుడే ఫోన్ చేశాను. బహుశా, అతను పది నిముషాల్లో వస్తాడను కుంటాను."

"అతనెందుకు? అయితే మేము వెళ్ళిపోతాం. అతను మమ్మల్ని చూడడం మంచిదిగాదు!" అన్నాడు క్రిస్టోఫర్.

"మీరు వేరే రూంలో వుండండి" అంది స్వప్న.

క్రిస్టోఫర్, జాన్ లేచి వెళ్ళారు.

స్వప్న బీర్ తెప్పించుకుంది. గ్లాసులో పోసుకొని కొద్ది కొద్దిగా చప్పరిస్తూ అశోక్ రాకకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

తలుపులు తెరుచుకున్నాయి. తలెత్తి చూసింది స్వప్న. అశోక్ లోనికొచ్చాడు.

"ఎందుకంత అర్జంటుగా రమ్మని ఫోన్ చేశావ్?" అడిగాడు అశోక్ కూర్చుంటూ.

"మనిద్దరం ప్రేమించుకున్నాక, ఆరోజుల్లో తమాషాగా నీతో డబ్బు సంపాదించేందుకు సులభమైన మార్గాలు కొన్ని చెప్పాను. అవునా?" అడిగింది స్వప్న.

"అయితే!"

"డబ్బుకు అమ్ముడుపోయే నీచుడివి. నువ్వెంత ఘోరమైనా చేస్తావ్. మా బాస్ కూతురిలో ఏముందని పెళ్ళాడావ్. డబ్బు తప్ప" అడిగింది స్వప్న.

"దానికీ, నువ్వు చెప్పేదానికీ ఏ సంబంధం లేదు."

"నాపైన పోలీసులు అనవసరంగా అనుమాన పడుతున్నారు. నన్ను రహస్యంగా వెంటాడుతున్నారు. నన్నేమైనా వాళ్ళు ఇబ్బంది పెట్టే పక్షంలో నేను నిన్ను పతికదాకా ఇరికిస్తాను. జాగ్రత్త!" అంది స్వప్న.

"నిన్ను పెళ్ళాడలేదన్న కోపంతో నాపైన ఈ విధంగా పగ తీర్చుకోవడం అన్యాయం. నన్ను అనవసరంగా ఈ గొడవల్లోకి లాగొద్దు. నీకెక్కువాలంటే డబ్బిస్తాను" అన్నాడు అశోక్.

"ఎంతిస్తావ్?" అడిగింది స్వప్న.

"ఎంత కావాలి?"

"నీ భార్య నిన్న పార్టీలో అలంకరించుకొన్న నెక్లెస్ ఇస్తావా?"

"ఆమెకు తెలుస్తుంది. లేనిపోని గొడవ అవుతుంది."

"అవన్నీ నాకవసరం లేదు. నా కా నెక్లెను కావాలి. అది తెచ్చిస్తానంటే నిన్ని గొడవలోకి లాగకుండా వదిలేస్తాను. లేకుంటే ఆ ప్లాన్లు నువ్వే నాకిచ్చావని చెప్తాను" అంది స్వప్న.

"సరే! అలాగే తెచ్చిస్తాను" అన్నాడు అశోక్.

"ఈ రాత్రికే నాకు తెచ్చివ్వాలి" అంది స్వప్న.

"అలాగే" అంటూ అశోక్ బయటికి పోయాడు. కారెక్కి తిన్నగా హోటల్ కు దారితీశాడు.

# 10

అర్ధరాత్రి—

క్రిస్టోఫర్, జార్జి యింటికి ముందు నిలబడ్డాడు. జాన్

లోనికి వెళ్ళాడు. స్వప్నకూడా అతని వెంట లోనికి వెళ్ళింది. ఇద్దరూ మెల్లెక్క జార్జిఫ్లాట్ ముందు నిలబడ్డారు.

జాన్ స్క్రూడ్రైవరుతో పని ప్రారంభించాడు తాళంకప్ప తెరిచేందుకు.

స్వప్న ప్రక్కనే నిలబడి చూడసాగింది. రెండు నిము షాల్లో తలుపు తెరుచుకుంది. ఇద్దరూ లోనికి వెళ్ళారు. లోపల్నుంచి తలుపుమూసి గడియపెట్టుకున్నారు.

జాన్ ప్లాన్ పరిశీలించిచూచి బాత్ రూంలోకి వెళ్ళాడు. లైటు వేశాడు. వెలిగి ఆరిపోయింది.

"స్వప్నా! లైటారిపోయింది. కరెంటు పోయిం దేమో?" అన్నాడు జాన్.

"టార్చిలైటు వెలిగించి స్విచ్ చూడు."

"లాభంలేదు, కరెంటుతోనే స్విచ్ పనిచేస్తుంది. అది పనిచేస్తేనే సేఫ్ తెరుచుకుంటుంది" చెప్పాడు జాన్.

"ఉన్నట్టుండి కరెంటు ఎలా పోయింది?"

"ఏమో?"

"ఎవరన్నా మెన్ ఆపేశారేమో?"

"అంటే పోలీసులొచ్చి వుంటారనా నీ అనుమానం" అడిగాడు జాన్.

"ఎందుకయినా మంచిది, ఎలక్ట్రిసిటీ ఆఫీసుకు ఫోన్ చేసి చూద్దామా" తనకు తోచిన సలహా ఇచ్చింది.

"వద్దు! కిటికీతీసి ప్రక్కింటికేసి చూడు. కరెంటు న్నదీ, లేనిదీ తెలుస్తుంది" అన్నాడు జాన్.

స్వప్న అలాగే చూసింది. ప్రక్కనున్న ఇంట్లోంచి ఫాన్ జాంయ్‌మని తిరుగుతున్న శబ్దమైంది.

"కరెంటుంది!" తిరిగొచ్చి చెప్పింది భయపడుతూ.

"అయితే ఎవరో కరెంటు కావాలనే తీసివేశారు. క్రిస్టోఫర్ ఏమయినట్లు. ఎవరన్నా ఇటువేపు వస్తే మనల్ని హెచ్చరించమని చెప్పాముగా" అన్నాడు జాన్.

"అతన్ని పట్టుకొన్నారేమో? మన గతేమిటి?"

"మెల్లగా తలుపు తెరుచుకొని వెళ్ళిపోదాం! వాళ్ళు అతన్ని పట్టుకొని వెళ్ళిపోయారేమో? ఏ పరిస్థితుల్లోనూ మన ఆచూకీ అతను ఇవ్వడు."

జాన్ తలుపువేపు నడుస్తూ అన్నాడు. స్వప్న కూడా వెంట వెళ్ళింది. చెవులు రిక్కించి విన్నారు. ఏవిధమైన శబ్దం వినిపించలేదు.

జాన్ తలుపు తెరిచిచూశాడు. చీకటిగా వుంది. మనిషెవ్వరూ అక్కడ నిలబడ్డజాడ కనుపించలేదు. స్వప్నను రమ్మని మెట్లు దిగసాగాడు. రెండో అంతస్తు దిగుతుండగా, ఎదురుగా రివాల్వర్లు పట్టుకొని వరుసగా నిలుచున్న పోలీసుల రూపాలు చీకట్లో చూచాయగా కనుపించాయి.

"చిక్కిపోయాం!" అన్నాడు జాన్.

స్వప్న కప్పలా కూలిపోయింది.

లైట్లు వెలిగాయి. రాయుడు ఇద్దరికీ బేడీలు తగిలిస్తూ "మీరింత త్వరగా వస్తారనుకోలేదు. కానీ ఇవాళే చిక్కిపోయారు!" అన్నాడు.

ఇద్దరూ మాట్లాడకుండా వెంట నడిచారు.

కార్లో క్రిస్టోఫర్ కూడా కలిశాడు. అతనికి అంతకు ముందే అరదండాలు తగిలించారు.

ముగ్గుర్నీ కారెక్కించారు. ముందొక జీపు, వెనుకొక జీపుతో బయలుదేరింది దొంగల్ని కూర్చోబెట్టిన వేను.

వైర్‌లెస్ మ్రోగింది.

ఫోను తీసుకున్నాడు రాయుడు.

"హాల్లో! రాయుడు స్పీకింగ్! ప్రఖ్యాత బిజినెస్ మాన్ రామ్మూర్తి అల్లుడూ, లైన్ సేఫ్ కంపెనీలో జనరల్ మేనేజర్ అయిన అశోక్ భార్యవు మత్తుమందిచ్చి ఆమె మెళ్ళోవున్న ఏడులక్షల రూపాయల ఖరీదుచేసే నెక్లెసుతో పరారయినట్లు కంప్లెయింట్ వచ్చింది. వెంటనే ఎంక్వయిరీ ప్రారంభించండి" అన్నాడు పోలీస్ కంట్రోల్ రూంలోవున్న అనౌన్సరు.

రాయుడు స్వప్న అడ్రసు చెప్పి, ఆచుట్టుప్రక్కల గానీ, ఆ యింట్లోగానీ అశోక్ దొరుకుతాడని, అతన్ని పట్టుకొని తీసుకురమ్మని ముందున్న జీపువు పురమాయించాడు.

రాయుడు చేరిన ఇరవై నిముషాలకు పోలీస్ జీవ్ అశోక్‌ను తీసుకొచ్చింది. మరికాస్సేపట్లో సేఠ్ తారా చంద్‌నుకూడా అరెస్ట్ చేసి తీసుకొచ్చారు'

అందరూ ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు.

"అశోక్‌ను అనుమానించాను. అతను నిరపరాధి. అలా అనుమానించడంవల్లే అసలు గాంగు చిక్కింది" అన్నాడు ఇన్స్పెక్టర్ రాయుడు.

"మీరెలా అనుమానించారు అతన్ని" అడిగాడు క్రిస్టోఫర్.

"స్వప్నకూ, అతనికీ పాత పరిచయం వుంది. లైన్ సేఫ్ కంపెనీకి అతను జనరల్ మేనేజర్ కావడంవల్ల, అతనిపైన ఎక్కువ అనుమానపడ్డాను" అన్నాడు రాయుడు.

"అలా భయంపెట్టే స్వప్న నాచేత నా భార్య నెక్లెసు దొంగలించేందుకు నన్ను తయారుచేసింది. ఆమె నన్నేమనుకొందో!" అన్నాడు అశోక్ విచారంగా.

"నువ్వేం కంగారు పడకు! నీ భార్యకు నేను చెప్తాను అసలు సంగతి" అన్నాడు రాయుడు.

"నాకేం చెప్పనవసరంలేదు. ఆయన పాలల్లో మత్తు మందు కలపడం గమనించాను. తెలివిగా వాటిని తాగకుండానే మత్తుగా వుందంటూ పడుకున్నాను. కంట సేపు అటూ ఇటూ తిరిగి ఆ తర్వాత నా నెక్లెసు తీసుకొని వెళ్ళిపోయారు. నాకు భయం వేసింది. ఆయన దొంగతనం చెయ్యడం నాకు బాధ కలిగించింది. ఆయన అంత నీచానికి పాలుపడే మనిషి కాదు. అంటే ఏదో పెద్ద గొడవలో పడ్డారన్నమాట. అందుకే వెంటనే పోలీసులకు ఫోన్ చేశాను. చాలా థాంక్స్. ఆయనకే అపకారం జరగక ముందేపట్టుకున్నారు" అంది బేబీ.

"నన్ను క్షమించు బేబీ!" అన్నాడు అశోక్.

బేబీ నవ్వుతూ "మీ బాధ నాకుచెప్తే ఇంతగొడవ జరగకపోయేది," అంది. ఆమె మంచి మనసుకు అశోక్ హృదయం ఆనందంతో పొంగిపోయింది.

—:ఐ పో యిం ది:—

# న్యాయం మరణించదు!

రమణశ్రీ

స్ప్రింగ్ డోర్ తెరచుకొన్న శబ్దమయింది.

టేబుల్ మీద ఎక్సరే రిపోర్ట్‌ను వ్రాసుకుంటున్న డాక్టర్ రామ్ చిన్నగా తలపైకెత్తి చూశాడు.

ఓ నలభైయేళ్ళ వ్యక్తి, వెనుకనే ఆయిదేళ్ళ పాపను ఎత్తుకొని మరో స్త్రీ లోపలకు వచ్చారు.

"గుడ్ మార్నింగ్ డాక్టరుగారూ!" విష్ చేశాడా వ్యక్తి.

"హల్లో, గుడ్ మార్నింగ్. ప్లీజ్ సిడౌన్!" ఎదురుగా వున్న కుర్చీలు చూపించాడు డాక్టరు రామ్.

ఇద్దరూ కుర్చీలలో కూర్చున్నారు. పాప తల్లి చేతులలో నుండి క్రిందకు దిగింది.

"హాల్లో డాక్టర్, హౌ డు యు డు?" డాక్టర్ దగ్గరకు వచ్చి అడిగిందా పిల్ల.

"వెరీఫైన్!" బిత్తరపోయి చూస్తూ అన్నాడు డాక్టర్ రామ్.

"మంజూ! గట్టిగా అరిచాడా వ్యక్తి.

విసురుగా చూసింది అతనివైపు. "మంజు ఎవరు? మీ కెన్నిసార్లు చెప్పాలి. నా పేరు మాల. అలాగే నన్ను పిలవండి."

కూతురువైపు లాలనగా చూసిందామె.

"చూడమ్మా, అలా డాక్టర్ గారి దగ్గరకు వెళ్ళి గొడవ చేయకూడదు. ఇలా ప్రక్కకు వచ్చి కూర్చో. చక్కగా బుద్ధిమంతురాలి వనిపించుకోవాలి."

"నువ్వెవరు, నన్నాజ్ఞాపించడానికి. నాకు తెలుసు, ఎవరిదగ్గర ఎలా మసులుకోవాలో! అయామ్ ఆల్సో ఎ డాక్టర్. యు నో డాక్టర్?" అడిగింది డాక్టర్ వైపు తిరిగి.

ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతున్న ఆ అయిదేళ్ళ పాపను ఆశ్చర్యంగా చూశాడు డాక్టర్ రామ్.

"ఎస్. యు ఆర్ డాక్టర్ మాల, ఐ నో యు. ప్లీజ్ సిడౌన్ హియర్" నవ్వుతూ అన్నాడు డాక్టర్.

"దట్స్ గుడ్. థాంక్స్ డాక్టర్!" హుందాగా వెళ్ళి కుర్చీలో కూర్చొంది.

"రైట్. ఇక చెప్పండి" అతనివైపు చూశాడు డాక్టర్.

"డాక్టర్ రామ్, మీరేకదా!" అడిగాడా వ్యక్తి.

"అవును."

"నా పేరు భాస్కరరావు. భాస్కర్ ఫైనాన్స్ మేనేజింగ్ పార్ట్నర్ని. ఈవిడ నా మిసెస్, సుభద్ర.

ఈ పాప మాకు లేక లేక పుట్టిన అమ్మాయి, పేరు మంజు" చెప్పాడు.

"డాక్టర్!" గట్టిగా అరిచిందా పాప.

"డాక్టర్, వాళ్ళు చెప్పేమాటలు నమ్మకండి. అంతా పచ్చి మోసగాళ్ళు."

"నాకు తెలుసు డాక్టర్ మాలా! ఏదో పూరికే వాళ్లు చెప్పేది వింటున్నాను. అంతే, నమ్మడం లేదు" చిన్నగా నవ్వాడు డాక్టర్ రామ్.

"గుడ్ డాక్టర్, యీ పరిసర ప్రాంతంలో క్లినిక్ ఓపెన్ చేస్తే బావుంటుందా?"

"వెల్. ఇక్కడ క్లినిక్ పెడితే మీరు చాలా త్వరలో అభివృద్ధిలోకి వస్తారు."

"రైట్ డాక్టర్. ఈ పరిసర ప్రాంతాలలో నాకో రూమ్ చూడండి డాక్టర్. క్లినిక్ ఓపెన్ చేస్తాను. ఈ సహాయం చేస్తే యీ జన్మలో మర్చిపోను."

"అలాగే డాక్టర్ మాలా! మీ శ్రేయోభిలాషిగా మీకు నేను తప్పకుండా సహాయం చేస్తాను."

"మెనీ మెనీ థాంక్స్ డాక్టర్!" మెరుస్తున్న కళ్ళతో అంది.

"డాక్టర్ మాలా, మీరో చిన్న హెల్ప్ చేయాలి. నేనో పదినిముషాలు లాబ్‌లోకి వెళ్ళి రావాలి. ఈలోగా మీరు యీ ఎక్స్‌రే రిపోర్ట్‌ను కొంచెం పరిశీలించండి."

"విత్ ప్లెజర్ డాక్టర్" ఎక్స్‌రే రిపోర్ట్ అందుకుంటూ అంది మంజు.

డాక్టర్ రామ్, భాస్కరరావుకు సైగ చేస్తూ, ప్రక్కనే వున్న పర్సనల్ రూంలోకి నడిచాడు.

డాక్టర్ సైగనందుకొని, ఆయనను అనుసరించారు భాస్కరరావు దంపతులు.

"అలా కూర్చోండి" సీలింగ్ ఫాన్ ఆన్ చేస్తూ, సోఫావైపు చూపించాడు డాక్టర్ రామ్.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

డాక్టర్ రామ్ ఇక చెప్పమన్నట్లుగా భాస్కరరావు వైపు చూశాడు.

"డాక్టర్, మీరు గొప్ప సైకాలజిస్టు అని, అనేక మానసిక వ్యాధులకు అతినైపుణ్యంతో చికిత్స చేశారని విన్నాం. ఇప్పుడు మీమీద ఎంతో ఆశపెట్టుకొని యిక్కడకు వచ్చాం."

"థాంక్స్."

"మా ఫామిలీ డాక్టర్ గంగారాంకూడా, మా అమ్మాయిని మీ దగ్గరికే తీసుకు వెళ్ళమని చెప్పారు. మీకు రికమండ్ చేస్తూ ఓ లెటర్ గూడా వ్రాసిచ్చారు"

జేబులోనుండి ఓ కవర్ తీసిచ్చాడు భాస్కరరావు.

కవరు అందుకొని లోపలినుండి లెటర్ తీసి చదువు కున్నాడు డాక్టర్ రామ్.

"ఆల్ రైట్ మిస్టర్ భాస్కరరావ్! అసలు విషయం విపులంగా చెప్పండి."

"డాక్టర్ గారూ, ఆ అమ్మాయి మా అమ్మాయి. పేరు మంజు. పాప వయస్సు ఏమాత్రం వుంటుందంటారు?"

"నాలుగు లేక అయిదు సంవత్సరాలు వుండవచ్చు."

"ఎక్జాక్ట్లీ! పాపకు నాలుగున్నర సంవత్సరాలు. కిండర్ గార్డెన్‌లో ఎబిసిడిలు నేర్పుతున్నారు. ఇంగ్లీషు ఎలా మాట్లాడుతుందో గమనించారా?"

ఆశ్చర్యపోయాడు డాక్టర్ రామ్.

"ఈజిట్? నేనింకా పాపను మూడో సంవత్సరం లోనే కాన్వెంట్‌లో జాయిన్ చేసారనుకొంటున్నాను.

మరి ఇంగ్లీష్ అలా అనర్గళంగా ఎలా మాట్లాడగల్గు తోంది?"

"అదే అర్థంకావడం లేదు డాక్టర్. మంజు మనస్సు బాగా చెలించిపోయి వుంటుంది. ఆమె హృదయానికి ఏదో పెద్దదెబ్బ తగిలి వుంటుంది. ఓ అయిదు రోజుల నుండి మంజు ప్రవర్తన అంతా మారిపోయింది. చాలా విచిత్రంగా ప్రవర్తిస్తోంది. ఆమె ప్రవర్తన చాలా అసహ్యంగా వుంది" ఓ క్షణం ఆగాడు భాస్కరరావు.

"మరికొంచెం విపులంగా వివరించండి" స్క్రిబ్లింగ్ పాడ్ అందుకుంటూ అడిగాడు డాక్టర్ రామ్.

చిన్నగా గొంతు సవరించుకొని చెప్పసాగాడు భాస్కరరావు:

"మా పాప పుట్టుకనుండి మంచి తెలివిగలది. ఇటీవలే కిండర్ గార్డెన్‌లో చేర్పించాము. ఓ అయిదు రోజుల క్రితం హడావిడిగా యింటికి వచ్చింది మంజు. అన్నట్టు మరిచాను. మంజు సరాసరి యింటికి రాలేదు.

ఎక్కడికో హడావుడిగా వెళుతూండగా మా మిత్రుడొకడు చూసి పలకరించాడట. సమాధానం చెప్పకుండా వెళ్ళిపోతోంటే, ఇల్లు మర్చిపోయి వెతుక్కుంటుందేమోనని, జాగ్రత్తగా తీసుకువచ్చి ఇంటిదగ్గర దిగబెట్టి వెళ్ళాడు.

పాప రోజూకన్న త్వరగా రావడం గమనించిన సుభద్ర "స్కూలు వదిలిపెట్టేశారా మంజూ," అంటూ అడిగింది.

మంజు తోక త్రొక్కిన త్రాచులా ఎగిరిపడింది.

"మంజు ఎవరు? నా పేరు మాల!" అంది.

"సరేలే, అఘోరించావు కానీ, రా భోజనంచేసి

ట్యూషన్‌కు వెళ్ళు" అంది సుభద్ర నవ్వుతూ.

పాప నవ్వుతూ వేళాకోళానికి అంటున్నదని భావించింది సుభద్ర.

"నో. నేను ట్యూషన్‌కు వెళ్ళడమేమిటి? నేను డాక్టర్‌ను. త్వరలో క్లినిక్ ఓపెన్ చేద్దామనుకుంటున్నాను. త్వరగా వెళ్ళి క్లినిక్‌కు ప్లేస్ చూడాలి," అంది మంజు.

"నీకేదో పిచ్చిపట్టినట్లుంది" గొణిగింది సుభద్ర.

మృదువుగా నవ్వింది మంజు. "అంతే పిచ్చివాళ్ళందరూ, డాక్టర్‌కు పిచ్చిపట్టిందనుకుంటారు. ఇప్పుడు నువ్వు అలాగే అనుకుంటున్నావు. నేను క్లినిక్ ఓపెన్ చేయగానే అందులో చేరు. పిచ్చి నయం చేసి పంపిస్తాను."

"సరేలే. అన్నం తిను" తన కూతురు ముందు ముందు డాక్టర్ అవుతుందేమోనని సంతోషంగా అంది సుభద్ర.

"ఇప్పుడు కాదు. ముందు క్లినిక్‌కు ప్లేస్ చూడాలి. వీలుంటే మళ్ళీ ఓసారి కలుస్తానులే" అంటూ బయటకు నడవబోయింది.

సుభద్రకు అప్పుడే అనుమానం వచ్చింది, మంజుకు మతి చలించిందని. వెంటనే మంజును బయటకు వెళ్ళకుండా గట్టిగా పట్టుకొని లోపల గదిలో పెట్టి తలుపు వేసి గొళ్ళెంపెట్టి, నాకు ఫోన్ చేసింది.

నేను హుటాహుటిన ఇంటికి వచ్చాను.

సుభద్ర నాకు అంతా చెప్పి బావురుమని ఏడ్చింది.

బయట తలుపులు భద్రంగా వేసి, మంజును బంధించి వున్న తలుపులు తీశాను.

మంజు కోపంగా మనోవైపు చూస్తూ కూర్చొనివుంది.

"మంజు" అంటూ ప్రేమగా పిలిచాను.

నిశ్చలంగా అలాగే కూర్చొని వుంది. కనీసం నా వైపు చూడనుగూడా చూడలేదు.

"మంజూ" అంటూ పాపను పట్టుకొని గట్టిగా కుదిపాను.

ఒక్కసారిగా గిరుక్కున నా వైపు తిరిగింది.

"మంజూ ఎవరో నాకు తెలియదు. నా పేరు మాల. నేను డాక్టర్ని. నేను త్వరలో హాస్పిటల్ ఓపెన్ చేయాలి. నా చదువును సద్వినియోగం చేయాలి. లేక పోతే, ఎందరివో ప్రాణాలు రోగాలకు బలయి పోతాయి" అంటూ గొడవ చేయసాగింది.

నాకు ఏమీ చేయడానికి తోచక మా ఫ్యామిలీ డాక్టర్ గంగారాంకు ఫోన్ చేశాను.

డాక్టర్ వచ్చాడు. అమ్మాయిని అన్నివిధాల పరీక్ష చేశాడు. ఆరేదో పైత్యం చేసిందంటూ ఏవేవో మందులు వాడాడు. కానీ ప్రయోజనం కన్పించలేదు. చివరికు ఇది మానసిక వ్యాధి అని, పాపకు మెంటల్‌గా ఏదో షాకు తగిలిందని తేల్చాడు.

ఆ తరువాత మీ పేరు చెప్పి, మీరు గొప్ప మానసిక వైద్యులని, మీరు తప్పక యీ వ్యాధి నయం చేయగల రని చెప్పి, రికమండేషన్ లెటర్ వ్రాసిచ్చాడు.

ఇప్పుడు మా పాపను మీ చేతులలో పెడుతున్నాం. మా మంజూను మాకు దక్కించండి" చెప్పడం ముగిం చాడు.

భాస్కరరావు చెప్పినదంతా విని ఆలోచనలో పడి పోయాడు డాక్టర్ రామ్.

అయిదు నిమిషాలు గడిచాయి.

చిన్నగా నవ్వుతూ అన్నాడు దృఢంగా.

"ఆల్ రైట్! ఈ కేసు టేకప్ చేస్తున్నాను. ఈ

కేసులో చాలా చాలా క్రొత్త విషయాలు బయట పడ వచ్చు. ముందు పాపను పరీక్ష చేయాలి."

"థాంక్స్ డాక్టర్" తృప్తిగా పల్కారు దంపతు లిద్దరూ.

"పదండి ఆ పిచ్చిపిల్ల ఆ గదిలో ఏం చేస్తుందో, ఏమో?" అంది సుభద్ర.

"మరేమీ ఫర్వాలేదు. మంజు అల్లరిచేసే పిల్లకాదు. నాకు తెలుసు ఆ విషయం. అన్నట్లు, మిష్టర్ భాస్కర రావ్, మీతో చిన్న కిటుకు చెప్పనా?" అన్నాడు డాక్టర్ రామ్.

"చెప్పండి."

"ఇలాంటి సైకాలజీ పేషంట్ల దగ్గర మనం చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి. అంతా వాళ్ళ యిష్ట ప్రకారం జరగనివ్వాలి. మనం ఏ విషయంలోనూ, వాళ్ళకు వ్యతిరేకంగా ప్రవర్తించకుండానే, వాళ్ళను మన వైపుకు తిప్పుకోవాలి."

"ఎలా?"

"వెరీ సింపుల్. మీరు ఆ అమ్మాయిని 'మంజూ' అని సంబోధించకండి. 'డాక్టర్ మాల' అని పిలవండి. ఆ పాపచెప్పే మాటలు శ్రద్ధగా విని, నిజమే నన్నట్లు నటించాలి."

"అలాగే" అన్నాడు భాస్కరరావు.

సుభద్రకూడా తల వూపింది.

అంతాకలిసి కన్సల్టింగ్ రూంలోకి నడిచారు.

## 2

"మిస్ మాలా!" పిలిచాడు డాక్టర్ రామ్.

"ఏమిటి, డాక్టర్?" శ్రద్ధగా చేతులు కట్టుకొని నిల బడింది మంజూ.

"రిపోర్టు పరిశీలించటం అయిపోయిందా?" అడిగాడు.

"ఎస్ డాక్టర్. మోహనరావు అనే వ్యక్తిదికదా, యీ ఎక్స్‌రే రిపోర్టు. మెనింజైటిస్‌లోని స్వల్పమైన మార్పులను బట్టి, అతనికి మతి కొంచంగా చలించింది డాక్టర్. అఫ్‌కోర్స్ అది అంత తీవ్రమైనదికాదు. బహుశా ఓ నెలరోజులు ట్రీట్‌మెంట్ ఇవ్వాల్సి వుంటుంది," చెప్పింది మంజు.

ఆశ్చర్యపోయాడు డాక్టర్ రామ్.

ఏదో శక్తి స్వరూపిణిని చూస్తున్నట్లు, ఆ పాపవైపు చూడసాగాడు.

అతని ఆలోచనలు పరిపరి విధాల పోసాగాయి.

ఇది సంభవమా? అయిదేళ్ళ పాప, ఎక్స్‌రే అంటే ఏమిటో తెలియని వయసులో, ఎక్స్‌రే రిపోర్టును పరిశీలించి, ఓ అనుభవజ్ఞుడయిన వైద్యునిలా స్టేట్‌మెంట్ ఇచ్చింది. ఇదెలా జరిగింది? ఆ ఎక్స్‌రే రిపోర్టును అంతకు ముందే తను పరిశీలించాడు. ఇప్పుడు ఆ పాప చెప్పింది కూడా యదార్థమే!

తెల్లబోయి చూస్తున్నారు భాస్కరరావు దంపతులు.

చిన్నగా నవ్వాడు డాక్టర్ రామ్.

"వెల్ డాక్టర్ మాలా, యు ఆర్ ఎ జీనియస్."

"థాంక్స్ డాక్టర్."

"మిస్ మాలా, నువ్వు వేరే ఎక్కడో క్లినిక్ ఓపెన్ చేయడం దేనికి? నాకు అసిస్టెంట్‌గా వుండరాదూ! నెలకు ఆరువందలు యిస్తాను."

"విత్ ప్లెజర్ డాక్టర్! ఈ రోజే డ్యూటీలో జాయిన్ అవుతాను," సంతోషంగా అంది మంజు.

"చూడండి, డాక్టర్ మాలా! అదేమిటి, మీరు అంత బలహీనంగా వున్నారు. నో. ఒక డాక్టర్ అంత బల

హీనంగా ఎప్పుడూ వుండకూడదు."

"నిజం డాక్టర్ నాకు అలాగే అన్పిస్తోంది" నవ్వింది.

"గుడ్ ఒక డాక్టర్‌గా నిన్ను కొన్ని పరీక్షలు చేస్తాను. ఆ తరువాత ట్రీట్‌మెంట్ యిద్దాం," అన్నాడు రామ్.

"అలాగే కానివ్వండి," అంది.

రామ్ ముఖం విప్పారింది.

"గుడ్. అలా ఆ టేబుల్‌పై పడుకోండి" చెప్పాడు.

ఆ తరువాత ఓ అరగంటసేపు పనులన్నీ త్వర త్వరగా జరిగిపోయాయి.

బ్లడ్ టెస్ట్‌కు పంపించారు. బి. పి. పరీక్ష చేశారు. మెదడు భాగాలను ఎక్స్‌రే తీశారు.

నిమిషాలమీద రిజల్ట్స్ వచ్చాయి. ఎక్స్‌రే రిపోర్టు, తదితర రిపోర్టులను పరిశీలించిన డాక్టర్ రామ్ ఆశ్చర్య పోయాడు. ఆతను వూహించిన దానికి భిన్నంగా వున్నాయి రిపోర్టులు.

బహుశా డాక్టర్ రామ్ పదహారేళ్ళ సర్వీసులో ఆతని వూహ పేషంట్ విషయంలో తప్పడం ఇదే ప్రథమం కావచ్చు.

భాస్కరరావు వైపు చూశాడు అయోమయంగా.

"వాట్ డాక్టర్?" అడిగాడు భాస్కరరావు.

"మిస్టర్ భాస్కరరావు, ఈ కేసు చాలా అగమ్య గోచరంగా వుంది."

"అంటే?"

"షీయీజ్ ఆల్‌రైట్ మిస్టర్ భాస్కరరావ్. ఆ పాపలో మానసికంగా ఏం లోపం లేదు. ఇక నేను ఏం చికిత్స చేయను?"

"డాక్టర్!" కంగారుగా పిల్చాడు.

"చూడండి డాక్టర్, మరింత పరీక్షగా చూడండి. ఆ అమ్మాయిని మీరు గమనిస్తూనే వున్నారు కదా! మంజు మనస్సు చలించకపోతే, ఆ విధంగా ప్రవర్తిస్తుందా? ఆ ప్రవర్తనకు అర్థమేమిటి డాక్టర్?"

ఓ క్షణం ఏం మాట్లాడలేదు రామ్.

"ఆల్ రైట్ డాక్టర్, పాప మానసిక వ్యాధిని మీరు నయం చేయలేరు. అసలు మీకా వ్యాధి స్వరూపమే అర్థం కాలేదు. అంతేకదా! సరే, మీ కన్న పెద్ద డాక్టర్ ఎవరన్నా వుంటే చెప్పండి. పాపను అక్కడకు తీసుకువెళతాను."

చిన్నగా నవ్వాడు డాక్టర్ రామ్.

"మిస్టర్ భాస్కరరావ్, ఆ పాపలో మానసికంగా ఏలోపం లేదు. ఆమె మనస్సు నిర్మలంగా వుంది. నేనే కాదు, మీకు ఏ డాక్టర్ చెప్పినా, ఆ విషయమే చెప్పితీరాలి. ఇకపోతే, మీకూ, నాకూగూడా అర్థం కానిది ఆ పాప ప్రవర్తన! ఆ విషయం గురించే తీవ్రంగా ఆలోచిస్తున్నాను," చెప్పాడు.

భాస్కరరావు ఏమీ మాట్లాడలేదు.

రెండు నిమిషాలాగి మళ్ళీ అన్నాడు రామ్.

"చూడండి మిస్టర్ భాస్కరరావ్, నేను యీ విషయంలో ఓ సైకాలజీ ప్రొఫెసర్‌ని సంప్రదించాలి. అందుకు కొంత టైంకావాలి. కాబట్టి మంజూను మాక్లినిక్‌లోనే చేర్పించండి."

"పోనీ, మరో డాక్టర్ని సంప్రదిస్తాను డాక్టర్" చిన్నగా అన్నాడు భాస్కరరావు.

"ఆల్ రైట్, అది మీయిష్టం. కానీ ఒకటి మాత్రం నిజం. మీరంతా అనుకొంటున్నట్లు ఆ పాపకి మానసికంగా ఏమాత్రం లోపంలేదు."

"అంతేనంటారా డాక్టర్? ఎంత డబ్బు ఖర్చయినా ఫర్వాలేదు. బాగా ఆలోచించండి."

"తప్పకుండా ప్రయత్నిస్తాను. అదీగాక, యీ కేసు టేకప్ చేస్తున్నానని ముందే చెప్పాను కదా!"

"ఆల్ రైట్ డాక్టర్, మంజును అడ్మిట్ చేసుకోండి" అతికష్టం మీద ఒప్పుకున్నారు.

మంజును స్పెషల్ వార్డులో చేర్చి యింటికి వెళ్ళి పోయారు భాస్కరరావు దంపతులు.

డాక్టర్ రామ్ కుర్చీలో కూర్చొని మంజు కేసు విషయమై ఆలోచించసాగాడు. అతనికంతా అగమ్యగోచరంగా వుంది. ఏం చేయాలో అర్థం కావడంలేదు.

కేసునోసారి సమీక్షించుకున్నాడు.

పేషెంటు పేరు మంజు. కానీ తాను డాక్టర్ మాల అంటోంది. కన్న తల్లిదండ్రులను తిరస్కరించి, వాళ్ళెవరో తెలియనట్లు ప్రవర్తిస్తోంది. డాక్టర్‌కు వుండవలసిన లక్షణాలన్నీ ఆ అయిదేళ్ళ పాపలో వున్నాయి. కిండర్ గార్డెన్‌లో ఎబిసిడిలు నేర్చుకుంటున్న పాప, ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతోంది. తాను డాక్టర్‌గా క్లినిక్ తెరవడానికి తొందర పడుతోంది!

డాక్టర్ రామ్ మనసులో తళుక్కున ఓ మెరుపు మెరిసింది.

గబగబ ఫోన్ దగ్గరకు లాక్కుని డయల్ చేయ సాగాడు.

# 3

గదిలో ఎయిర్‌కూలర్ చల్లని గాలిని వెదజల్లుతోంది.

గాడ్రెజ్ టేబుల్‌కు యిరువైపులా కూర్చొని వున్నారు డాక్టర్ రామ్, ప్రొఫెసర్ నిరేన్ డే.

ప్రొఫెసర్ నిరేన్‌డీ ఢిల్లీలోని ఇండియన్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లోని సైకాలజీవిభాగంలో ప్రొఫెసర్‌గా వుంటున్నాడు.

నిరేన్‌డీకు పూర్వజన్మలకు సంబంధించిన విషయాల మీద మంచి ఇంట్రస్ట్. దాదాపు అయిదేళ్ళగా ఆ విషయాలపై అతను పరిశోధన సాగిస్తున్నాడు.

ఆలిండియా మెడికల్ వీక్ సందర్భంగా విజయవాడలోని ప్రముఖుల ఆహ్వానంమీద ఓ సమావేశంలో పాల్గొనడానికి విజయవాడ వచ్చాడు. ఆ తరువాత మరో రెండు సమావేశాలకు ఆహ్వానం వచ్చింది.

ఒక మెడికల్ కాన్ఫరెన్స్‌లో ప్రొఫెసర్‌తో పరిచయం అయింది డాక్టర్ రామ్‌కు.

అందుకే డాక్టర్ రామ్ ఫోన్‌కాల్ వినగానే హుటాహుటిన వచ్చాడు ప్రొఫెసర్.

రామ్ డ్రింక్స్ తెప్పించాడు.

డ్రింక్ సిప్ చేస్తూ అడిగాడు ప్రొఫెసర్.

"వాట్ మిస్టర్ రామ్, అర్జంటుగా నన్ను ఫోన్ చేశారు. ఏమిటి విశేషం?"

చిన్నగా నవ్వాడు రామ్.

"ప్రొఫెసర్‌జీ, మొన్న జరిగిన మెడికల్ కాన్ఫరెన్సులో మీరు పునర్జన్మలు, పూర్వజన్మ స్మృతులపై పరిశోధన చేస్తున్నట్లు చెప్పారు. గుర్తుందా?"

"ఎస్. ఏం జరిగింది యిప్పుడు?" వుత్సాహంగా అడిగాడు ప్రొఫెసర్ నిరేన్‌డీ.

"ఇప్పుడు నాదగ్గరకు ఓ కేసు వచ్చింది. ఒక అయిదేళ్ళ పాపకు మతి చలించిందంటూ నా దగ్గరకు తీసుకు వచ్చారు. పాపను పరీక్ష చేశాను. కానీ ఆపాప మానసికంగా పరిపూర్ణమైన ఆరోగ్యంగా వుంది. కానీ

చేష్టలు, మాటలుచూస్తే నాకే ఆశ్చర్యంగా వుంది. ఒకపట్టాన నాకు అర్థంకాలేదు. ఆలోచించగా యీ అనుమానం వచ్చింది. చటుక్కున మీరు గుర్తుకు వచ్చారు. వెంటనే ఫోన్ చేశాను."

"ఈ జిట్?"

"ఎస్ ప్రొఫెసర్. కానీ, ఓ చిన్న అనుమానం. ఈ ఇరవయ్యో శతాబ్దంలోగూడా పునర్జన్మ సంభవమే నంటారా?"

బిగ్గరగా నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

"ఎందుకు సంభవంకాదు డాక్టర్? సృష్టి ప్రారంభ మైనప్పటి నుండి, నేటివరకు శిశువు జనన విధానంలో ఏమైనా మార్పు వున్నదా? లేదు. ఇదీ అంతే! ప్రతి ప్రాణికీ పునర్జన్మ అనేది తప్పనిసరిగా వుంటుంది. అఫ్ కోర్స్ యింకా అది సైంటిఫికల్ గా నిరూపణ కాలేదనుకోండి. కానీ అది నిరూపించడానికి చాలామంది ప్రయత్నిస్తున్నారు. అందులో నేనొకడిని. ఇంతవరకు విజ్ఞాన శాస్త్రవేత్తలు దయ్యాలు లేవని వాదించేవారు. కానీ యిప్పుడు ఒక రకంగా అంగీకరిస్తున్నారు."

"ఎలా?" వుత్సాహంగా అడిగాడు రామ్.

"మనం పేర్కొనే దయ్యం వేరు. ఇప్పటివరకు శాస్త్రవేత్తలు నిరూపించే దయ్యం వేరు. మన దయ్యాలకు కొన్ని అలవాట్లు, అంటే ఎవరినయినా పీడించడం, లేదా సుఖపెట్టడం లాంటివి వుంటాయి. కానీ శాస్త్రవేత్తలు నిరూపించే దయ్యాలు కేవలం ఆకారాలుగానే వుంటాయి. వాటికి అలవాట్లు ఏమీ వుండవు. మొత్తం మీద దయ్యాలు వున్నాయని ఒప్పుకుంటున్నారు. వారి నిరూపణ చెబుతాను వినండి.

'ప్రతి మనిషి శరీరంలో కొంత మోతాదులో ఫాస్ఫ

రస్ వుంటుంది. మనిషి మరణించిన పిదప ఆ శవాన్ని దహనం చేస్తారు. ఆ దహనక్రియ జరుగుతున్నప్పుడు, శవంలోని ఫాస్ఫరస్ ఆవిరిగామారి పైకి పోతుంది. ఆ ఆవిరంతా ఒక ఆకారంగా ఏర్పడి, అది వాతావరణ ప్రభావానికి లోబడి నశించిపోయేవరకు సంచరిస్తుంది. ఆ ఆకారమే దయ్యమని అంటారు' అని శాస్త్రవేత్తలు చెబుతున్నారు."

"అయితే ప్రొఫెసర్‌జీ" అడిగాడు రామ్.

"శవాన్ని దహనం చేయకుండా ఖననంచేస్తే, అప్పుడు ప్రేతంగా మారే అవకాశం లేదుకదా?"

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"ఎస్ మంచి తెలివైన ప్రశ్న వేశావు. ఆ విషయాన్ని నిరూపించిన కొందరు శాస్త్రజ్ఞుల్ని ప్రస్తుతం యీ ప్రశ్న కలవరపెడుతోంది. దీని విషయంమీదే తీవ్రంగా పరిశోధనలు చేస్తున్నారు.

ఇకపోతే పునర్జన్మలకు సంబంధించిన విషయాలలోకి వద్దాం. పునర్జన్మలపై గత అయిదేళ్ళలో నేను చేసిన పరిశోధనా సారాంశాలనుబట్టి, పునర్జన్మ వుంటుందని నేను గట్టిగా విశ్వసిస్తున్నాను. అంతే కాదు పూర్వ జన్మస్మృతులు వెలికి వస్తాంటాయనికూడా ప్రగాఢంగా నమ్ముతున్నాను.

అందుకు తార్కాణం, యీ అయిదేళ్ళలో ఒక్క భారత దేశంలోనే అయిదు కేసులను పరిశీలించాను. వివిధ దేశాలనుండి పునర్జన్మలపై సంవత్సరానికి కనీసం పది కేసుల వరకు సమాచారాన్ని సేకరించాను. వీటి నన్నింటిని సమీక్షించే నేను ఆపై నిర్ణయానికి వచ్చాను. అయితే నాకు ఆశ్చర్యం కలిగించే విషయం ఒక్కటే! అనేక కోట్లమంది ప్రజలలో కేవలం కొందరికే పూర్వ

జన్మ జ్ఞానం కలుగుతుందేమని? ప్రస్తుతం ఆ విషయం మీద నే పరిశోధన సాగిస్తున్నాను.''

''గుడ్ వర్క్ ప్రొఫెసర్ జీ'' అన్నాడు డాక్టర్ రామ్. ''ఇప్పుడు యీ మాల, వురఫ్ మంజు కేసును కూడా టేకప్ చేసి పరిశీలన జరపండి.''

''ఓ, యస్. ఆ పాప గురించి వివరంగా చెప్పండి'' పైప్ ముట్టించి కుర్చీలో వెనక్కి వాలుతూ అడిగాడు నిరేన్ డీ.

భాస్కరరావు తనకు చెప్పిన విషయాలన్నీ పూస గుచ్చినట్లు వివరించి చెప్పాడు డాక్టర్ రామ్.

అంతా విని వుత్సాహంగా అన్నాడు ప్రొఫెసర్.

''డాక్టర్ రామ్, ఇది నూటికి నూరు పాళ్ళ పునర్జన్మకు సంబంధించిన కేసే! నాకు అమూల్యమైన కేసు అప్పగించినందులకు మీకు మెనీ మెనీ థాంక్స్. పదండి. ఆ పాప దగ్గరకు వెడదాం.''

''ప్రొఫెసర్ జీ'' చిన్నగా అడిగాడు.

''ఆ పాపకు మళ్ళీ యీ జన్మ జ్ఞానం వచ్చే విధానం లేదా? వుంటే ప్రయత్నించండి. ఆ పాప తల్లిదండ్రులు తమ ప్రాణాలన్నీ యీ పాప భవిష్యత్ పైనే వుంచి జీవిస్తున్నారు.''

నవ్వుతూ అన్నాడు ప్రొఫెసర్ నిరేన్ డీ.

''డాక్టర్ రామ్, పూర్వజన్మ జ్ఞానం కలిగినంత మాత్రాన, యీ జన్మలోని స్మృతులు కోల్పోవాలని లేదు. ఈ జన్మకు సంబంధించిన జ్ఞానం అలాగే వుంటుంది. కాకపోతే తాత్కాలికంగా తమలో తామే కన్ఫ్యూజ్ అవుతారు. ఆ తికమకలో వాళ్ళు పరిసరాలనే మర్చిపోయి ప్రవర్తిస్తారు. మనం పేషంట్ ను ట్రీట్ చేసే విధానంలో వుంటుంది.''

"అయితే మంజూ యీ జన్మతాలూకు జ్ఞానం కలిగే వుందంటారా? మరి కన్న తల్లిదండ్రులను సహితం ఎందుకు గుర్తుపట్టలేదు?"

"అది అంతే డాక్టర్. గత జన్మ స్మృతుల బరువడిలో ఆ పాప చలించిపోతోంది. ఈ జన్మతాలూకు విషయాలు ఆమెకు గుర్తుకు రావడం లేదు. మనమే చాకచక్యంగా గుర్తు చేయడానికి ప్రయత్నించాలి."

"ఆల్ రైట్ ఎలాగైనా సరే, ఆ అమ్మాయిని బాగు చేయండి."

"అలాగే. ఎందుకో, యీ కేసు విషయంలో నా పరిశోధనకు తుదిపరిష్కారం కలుగుతుందని ఆశగా వుంది. పదండి. పేషంట్ దగ్గరకు వెళదాం" లేచాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ నిరీన్ డీ అనుసరించగా, డాక్టర్ రామ్ స్పెషల్ వార్డులోకి నడిచారు.

# 4

స్పెషల్ వార్డులోని రూంలో బెడ్ మీద, కాలుమీద కాలువేసుకొని కూర్చొని 'హెల్త్' మెడికల్ జర్నల్‌ను పఠిస్తోంది మంజు, దీక్షగా.

"డాక్టర్ మాలా!" పిలిచాడు రామ్.

"ఎస్ కమిన్ డాక్టర్" లేచి నిలబడింది మంజు.

లోపలకు వచ్చాడు రామ్. అతని వెనుకనే ప్రొఫెసర్ గూడా లోపలకు వచ్చాడు.

"మిస్ మాలా, మీట్ మిస్టర్ నిరీన్ డీ, సైకాలజీ ప్రొఫెసర్" నిరీన్ డీను పరిచయం చేస్తూ అన్నాడు రామ్.

"గ్లాడ్ టు మీట్ యు" షేక్ హాండిచ్చింది మంజు.

"హాపీ టు సీయూ" చేతిని చిన్నగా నిమురుతూ అన్నాడు నిరీన్ డీ.

"కూర్చోండి సర్" ఎదురుగా వున్న పేం కుర్చీల వైపు చూపించింది.

థాంక్స్ చెబుతూ కూర్చున్నారిద్దరూ.

"మిస్ మాలా, ప్రొఫెసర్ పూర్వ జన్మలు - పునర్జన్మలు అనే విషయంపై పరిశోధన చేస్తున్నారు. వారికి కొన్ని విషయములు కావలసివచ్చి నా దగ్గరకు వచ్చారు. నువ్వుకూడా ఏమైనా చెబుతావేమోనని నీ దగ్గరకు తీసుకువచ్చాను" చెప్పాడు రామ్.

"విత్ ప్లెజర్. నాకూ ఇలాంటి విషయాలంటే చాలా వుత్సాహం. అడగండి ప్రొఫెసర్ సాబ్!" అంది మంజూ చిన్నగా నవ్వుతూ.

గంభీరంగా నవ్వాడు ప్రొఫెసర్.

"థాంక్స్ మిస్ మంజూ" అన్నాడు.

"ప్రొఫెసర్ జీ" చిన్నగా నవ్వుతూ అంది-

"మీరు కూడా అందరిలాగానే మంజూ అంటున్నారు. నేను కాదు. నా పేరు మాల. మీరు పొరబాటు పడుతున్నారు. అయినా మీరు డాక్టర్ గారి సంబోధన వినలేదా?"

మళ్ళీ నవ్వాడు ప్రొఫెసర్.

"అయామ్‌సారీ మిస్ మాలా!" క్షమాపణ చెప్పుకున్నాడు.

"నెవర్ మైండ్ ప్రొఫెసర్ జీ! మనిషన్న తరువాత పొరబాటు వస్తుంది సరిదిద్దుకోవాలి. అంతే!"

"మిస్ మాలా, ఇంత చిన్న వయస్సులోనే మీరు డాక్టర్ కావడం చాలా గొప్పవిషయం. ఇప్పుడు మీకు వయస్సు ఎంత?"

"చిన్న వయస్సు ఏమిటి ప్రొఫెసర్ జీ. నాకు పాతిక సంవత్సరాలు. రీసెంట్ గానే హౌస్ సర్జన్ పూర్తి చేశాను. ప్రస్తుతం ఒక క్లినిక్ ఓపెన్ చేద్దామని చూస్తున్నాను."

"ఈజిట్, మీకు పాతిక సంవత్సరాలా?"

"ఎస్!"

"అసంభవం!"

"అదేమిటి ప్రొఫెసర్ జీ, అలా వింతగా మాట్లాడుతారు?"

"నాకు వింతగానే వుంది మిస్ మాలా. కమాన్ మీకూ ఆ వింత చూపిస్తాను రండి."

డాక్టర్ ప్రైవేట్ రూమ్‌లో వున్న ఓ నిలువుటద్దం ముందుకు తీసుకు వెళ్ళాడు ప్రొఫెసర్.

"చూడండి మాలా, నిజంగా మీకు పాతిక సంవత్సరాలంటే ఎవరన్నా నమ్ముతారా? మీరు చాలా చిన్నగా కనబడుతున్నారు. మీలో ఫిజికల్ గా చాలా మార్పు వుంది" చెప్పాడు ప్రొఫెసర్.

అద్దంలోకి చూస్తున్న మాల ఆ మాటకు వులిక్కిపడింది. మెదడులో నరాలు విపరీతంగా చలించాయి.

"ప్రొఫెసర్!" అరిచింది.

"ఇదేమిటి ప్రొఫెసర్ జీ, నేనిలా వున్నానేమిటి? మరీ ఇంత చిన్నగా, అయిదేళ్ళ పాపలా వున్నానేమిటి? నాకేం జరిగింది!"

మృదువుగా నవ్వాడు ప్రొఫెసర్ నిరీన్ డీ.

"ఆందోళన చెందకండి మాలా! మీలో ఒక్కటియీ మార్పే కాదు. ఇంకా చాలా మార్పులు వచ్చాయి. కమాన్ చెబుతాను రండి."

మౌనంగా అనుసరించింది మాల.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

"మాలా, మీతల్లిదండ్రుల పేరు ఏమిటి?" అడిగాడు.

"అతుల్యా ఘోష్, కాంతిమతి" చెప్పింది.

"ఐ. సీ!"

"ఎందుకలా అడిగారు ప్రొఫెసర్ జీ? వారు మీకు తెలుసా?"

"లేదు మిస్ మాలా. నువ్వు భాస్కరరావు, సుభద్రల పేరులు ఎక్కడన్నా విన్నావా? వారి గురించి నీకేమైనా తెలుసా?" అడిగాడు ప్రొఫెసర్.

ఒక నిమిషం ఆలోచించింది మాల.

"ఆఁ–గుర్తుకు వస్తోంది ప్రొఫెసర్. ఆ భాస్కరరావు, సుభద్ర అనేవాళ్ళు, నాకేదో మతి భ్రమించిందని భ్రమించి నన్ను యీ హాస్పటల్‌కు తీసుకువచ్చి జాయిన్ చేశారు."

"అంతకన్న వాళ్ళ గురించి నీకేమీ తెలియదా మాలా?"

"లేదు ప్రొఫెసర్ జీ. అసలు వాళ్ళకు, నాకు ఏమిటి సంబంధం? మా నాన్నగారు కానీ, అమ్మకానీ కన్పించరేం?"

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"మిస్ మాలా, మీది ఏవూరు? మెడిసన్ ఎక్కడ చదివారు?"

"ప్రొఫెసర్, మీకు కొంచెం మతి చలిస్తున్నట్టు వుంది. ఈ వూరులో పుట్టి పెరిగిన దానిని పట్టుకొని మీది ఏవూరు అని అడుగుతారేమిటి? ఇది కలకత్తా అని మీకు తెలియదా? లేకపోతే యిది కలకత్తా కాదా? నేను టాటానగర్‌లోని స్టీల్ ప్రాజెక్టు కాలనీలో వుంటున్నాను. మా నాన్నగారు ప్రాజెక్టులో రా మెటీరియల్స

సెక్షన్‌లో మేనేజర్‌గా పనిచేస్తున్నారు.”

“అయితే మీరు ఏ కాలేజీలో చదివారు?”

“టాగోర్ మెడికల్ కాలేజీలో చదివాను. జనరల్ హాస్పిటల్‌లో రీసెంట్‌గా హౌస్ సర్జన్ పూర్తి చేశాను.”

“ఐ. సీ. కానీ మిస్ మాలా, యిదేవూరో తెలుసా?”

“కలకత్తా!”

“పొరపాటు కాదు. చూడండి” డాక్టర్‌గారి ప్రిస్క్రిప్షన్ పాడ్ ఆమె ముందుకు తోశాడు.

ఆతృతగా చూసింది మాల.

“డాక్టర్ రామ్-సైకాలజిస్టు - విజయవాడ-” అని వుంది.

మాల తల తిరిగిపోయింది. మళ్ళీ నరాలలో సంచలనం మొదలయింది.

“వాట్ ప్రొఫెసర్‌జీ, యిది విజయవాడా? నో ఇటీజ్ ఇంపాజిబుల్. నేను విజయవాడలో ఎలా వున్నాను? అసలు విజయవాడ ఎక్కడ? కలకత్తా ఎక్కడ?

అసలు యీ మార్పులేమీ నాకర్థం కావడంలేదు. శారీరకంగా వూహించలేనంతటి మార్పు వచ్చింది. నివసించే ప్రదేశంలో మార్పు వచ్చింది. ఏమిటీమాయ ప్రొఫెసర్‌జీ” అడగసాగింది మాల.

రెండు నిమిషాలాగి మెల్లగా వారించాడు ప్రొఫెసర్.

“మాలా మీరు ఆందోళన చెందకండి, ప్లీజ్. నిరంగా వుండండి. మీలో మీరు కన్‌ఫ్యూజ్ అవుతున్నారు. మనసును కొంచెం కేంద్రీకరించండి. స్థిమితంగా వుండండి.”

ఆందోళనగా చూసింది మాల.

"ప్రొఫెసర్ జీ, నాకేమీ అర్థంకావడంలేదు. నాకు నిజంగా మతి భ్రమించేటట్లు వుంది. అయామ్ ఆల్ రైట్. నన్ను డిశ్చార్జి చేయండి. నేను వెళ్ళిపోతాను. ఇంటిదగ్గర మా అమ్మ ఎదురుచూస్తూ వుంటుంది."

"ఏ అమ్మకి?"

"ఏ అమ్మ ఏమిటి ప్రొఫెసర్? ఎవరికన్నా యిద్దరు అమ్మలు వుంటారా? మా అమ్మే, శాంతిమతి."

"ఆల్ రైట్, అలాగే వెళ్ళిపోదురుగాని. మిమ్మలను పంపించమని డాక్టర్ రామ్‌కు నేను చెబుతాను."

"థాంక్స్ ప్రొఫెసర్ జీ."

"నో మెన్షన్. బైదిబై మిస్ మాలా, మీరు ఏ సంవత్సరంలో మెడిసన్ పూర్తిచేశారు?"

"మీరు ప్రత్యేకించి నా వివరాలన్నీ ఎందుకు అడుగుతున్నారో అర్థంకావడంలేదు" అంది అనుమానంగా.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ జీ.

"ఇందులో మీరు ఆపార్థం చేసుకోవలసిన అవసరం లేదు. మీ తెలివితేటలు గమనించి, కుతూహలంకొద్దీ, మీ వివరాలు అడుగుతున్నాను. అభ్యంతరం లేకపోతేనే చెప్పండి."

ప్రొఫెసర్ వైపు చూసి నవ్వింది.

"అభ్యంతరమేమీ లేదు. కానీ మీ ప్రశ్నలన్నీ నన్ను తికమక పెట్టేస్తున్నాయి."

"లేదులెండి. ఈ ఒక్క ప్రశ్నకే సమాధానం చెప్పండి చాలు."

"టాగోర్ కాలేజీలోనే 1967లో మెడిసన్ పూర్తి చేశాను. రెండునెలల క్రితంవరకు గవర్నమెంట్ హాస్పిటల్‌లో హౌస్ సర్జన్ చేశాను. రెండేళ్ళు పూర్తవ్వగానే, స్వంత ప్రాక్టీసుకోసం ప్రయత్నిస్తున్నాను."

"వెల్. కానీ ఓ చిన్న అనుమానం. మీరు 1967లో మెడిసన్ కోర్స్ పూర్తిచేశారని విన్నాను. తరువాత హౌస్ సర్జన్ రెండు సంవత్సరాలుకూడా పూర్తి అయిపోయి రెండు నెలలు అవుతూంది అని చెప్పారు. దానిని బట్టి యిది 1969వ సంవత్సరం కావాలి. అంతేనా?"

"అవును. ఇది 1969వ సంవత్సరం కాక, మరేమిటి?"

"సారీ, మిస్ మాలా, మీరు చాలా పొరబాటుపడుతున్నారు. ఆ క్యాలండర్ వైపు చూడండి."

క్యాలండర్ వైపు చూసిన మాల వులిక్కిపడింది.

క్యాలండర్ 1971వ సంవత్సరం మే నెలను చూపిస్తోంది.

మాల తల గిర్రున తిరిగిపోతున్నట్లనిపించింది. ఆమెలో నరాల సంచలనం తీవ్రమయింది. హఠాత్తుగా మంచం మీదనే ఓ ప్రక్కకు వాలిపోయింది.

కంగారుగా లేచాడు డాక్టర్ రామ్.

"మిష్టర్ రామ్, మీరేమీ కంగారు పడకండి. పాపకు ప్రమాదమేమీ లేదు. ఆమెలో ఇప్పుడే సంఘర్షణ ప్రారంభమయింది. ఈ షాక్‌తో ఆమెకు ఈ జన్మజ్ఞానం కలగవచ్చు" చెప్పాడు ప్రొఫెసర్.

అయిదు నిముషాలు గడిచాయి.

మెల్లగా కళ్ళు తెరిచింది మాల. ఎదురుగా ప్రొఫెసర్ నిరేన్ డీ నవ్వుతూ కనబడ్డాడు.

ఓసారి చుట్టూ చూసింది. డాక్టర్ రామ్‌వైపు ఓ క్షణం దృష్టి నిలిపింది.

"ప్రొఫెసర్ జీ" పిలిచింది నెమ్మదిగా.

"ఏమిటి మిస్ మాలా?" అడిగాడు.

"నేను నిజంగా మాలనేనా ప్రొఫెసర్. మీరు మొదట్లో మంజు అని సంబోధించారు. అంతా నన్ను

ముందు అలానే పిలిచారు. మళ్ళీ యిప్పుడు మాల అని పిలుస్తున్నారు. కాలంలోనూ, ప్రదేశంలోనూ, శరీర పరిమాణంలోనూ యిన్ని మార్పులు ఎలా సంభవించాయి ప్రొఫెసర్? అసలు ఏం జరిగింది? దయచేసి నాకు వివరంగా చెప్పండి."

గంభీరంగా నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

"మిస్ మాలా, నేను చెప్పేది జాగ్రత్తగా విని అర్థం చేసుకో. ప్రస్తుతానికి గతాన్ని విస్మరించి వర్తమానాన్ని తలచుకో. నేను చెప్పే విషయాలపై మనసును కేంద్రీకరించు. అనవసరంగా వుద్రేక పడకు.

మాలా, నువ్వొక అపురూపమైన వ్యక్తివి. ప్రపంచంలో నీలాంటి వ్యక్తులు చాలా అరుదుగా వుంటారు. నీకు భగవంతుడు ఓ గొప్ప వరాన్ని ప్రసాదించాడు. నేను చెప్పే విషయాలు యదార్థమయినవి. జాగ్రత్తగా విను."

చెవులు రిక్కించింది మాల.

"మిస్ మాలా, నువ్వు మాలవు కావు. నీ పేరు మంజు. నీ వయస్సు అయిదు సంవత్సరాలు. నువ్వు పుట్టినది, పెరుగుతున్నది విజయవాడ పట్టణంలో. నీ తండ్రి పేరు భాస్కరరావు, సుభద్ర నీకు జన్మనిచ్చిన తల్లి."

"వాట్?" అదిరిపడింది మాల.

"ప్రొఫెసర్, యూ మీన్..." ఆశ్చర్యంతో అంది.

"ఎస్ బేబీ. నువ్వు పునర్జన్మ ఎత్తావు. నీకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. ప్రస్తుతం నువ్వు మంజు అనబడే అయిదేళ్ళ బాలికవు. మాల నీ పూర్వ జన్మలో పేరు కావచ్చు. అలాగే పూర్వ జన్మలో నీ తండ్రి పేరు అతుల్య ఘోష్, తల్లి పేరు కాంతిమతి అయివుండవచ్చు. కానీ యీ జన్మలో నీ తల్లిదండ్రులు భాస్కరరావు,

సుభద్రలు. నువ్వు కిండర్ గార్డెన్‌లో చదువుతున్నావు. బాగా గుర్తుకు తెచ్చుకో."

నెమ్మదిగా కళ్ళుమూసుకొని ఆలోచించసాగింది మాల. ఆమెలో గత వర్తమానాలు కలగాపులగమై చిందు లేస్తున్నాయి.

"ప్రొఫెసర్‌జీ!" అరిచింది గట్టిగా.

"ఎస్ మాలా."

"మీరు చెప్పింది నిజమే ప్రొఫెసర్. నేను ప్రస్తుతం మాలనుకాను. మంజునే. మాల చచ్చిపోయింది, ఎప్పుడో అయిదేళ్ళ క్రితం. 1969వ సంవత్సరంలోనే చచ్చిపోయింది. కాదు, మాల చచ్చిపోలేదు. ఎవరో చంపారు. ఆఁ గుర్తుకు వస్తోంది. జోగేందర్! బ్లడీ రాస్కెల్! వాడిని..." అరవసాగింది.

ప్రొఫెసర్ గబగబ వెళ్ళి మాలను గట్టిగా పట్టుకున్నాడు.

"మైడియర్ మాలా, ప్లీజ్ శాంతించు. నువ్వు ఇప్పుడు మాలవుకావు. మంజువు" అనునయంగా చెప్పాడు.

"మ్. ప్రొఫెసర్!" గట్టిగా నిట్టూర్చింది.

"అవును ప్రొఫెసర్‌జీ! నేను మంజునే. కానీ నా గత జీవితమంతా కళ్ళకు కట్టినట్లు కనబడుతోంది."

"దటీజ్ కరెక్ట్ మంజూ! నీ జీవితం చాలా విచిత్రమయినది. నీ కేసు విషయం డాక్టర్ చెప్పగానే, ఇది పునర్జన్మగా భావించాను. కానీ, ప్రస్తుత జన్మ- పూర్వ జన్మస్మృతుల మధ్య కన్‌ఫ్యూజ్ అవుతున్న నీకు మన శ్శాంతి కలిగించి, నీకు యీ జన్మస్మృతులను కలిగించడానికే యింత శ్రమపడ్డాను. థాంక్ గాడ్! ఇప్పుడు అంతా చక్కబడింది. యూ ఆర్ ఆల్ రైట్" అన్నాడు నవ్వుతూ ప్రొఫెసర్ నిరేన్ డే.

"ప్రొఫెసర్ జీ, నాకు పునర్జన్మ ఎందుకు కలిగింది? పోనీ అంతటితో ఆగక భయంకరమైన గత జన్మస్మృతులు నాలో ఎందుకు పెల్లుబుకుతున్నాయి?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను మిస్ మాలా. గత అయిదేళ్ళుగా పునర్జన్మలపై నేను పరిశోధన చేస్తున్నాను. పునర్జన్మ అనేది నీకేకాదు, అందరికీ కలుగుతుంది. కానీ పూర్వ జన్మస్మృతులు నీకే ఎందుకు గుర్తుకు వచ్చాయో పరిశోధించాలి. బహుశా నా పరిశోధనకు నీ కేసుతో ముగింపు కలగవచ్చు."

"వాట్ ప్రొఫెసర్, మీరు మాట్లాడేది నా కర్థం కావడంలేదు" అన్నాడు డాక్టర్ రామ్.

"అది అంతే డాక్టర్. ప్రస్తుతం నాకూ ఏం అర్థం కావడంలేదు. త్వరలో ముగింపు మీరూ చూస్తారు కదా!"

"ప్రొఫెసర్ జీ!" పిలిచింది మాల.

"నాకు ఇక్కడ ఎందువలనో వుండాలని లేదు. త్వరగా కలకత్తా వెళ్ళి, మా వాళ్ళను కలుసుకోవాలి. ప్లీజ్, నాకు కలకత్తా వెళ్ళడానికి సహాయం చేయరూ?"

"తప్పకుండా ఈ రాత్రికే, బయలుదేరేటట్లు ప్రయత్నిస్తాను."

"థాంక్స్."

"నో మెన్షన్. బైదిబై నిన్ను 'మంజు' అని సంబోధించనా? లేక 'మాల' అని పిలవనా?"

"మీ యిష్టం ప్రొఫెసర్!"

"ఆల్ రైట్. ప్రస్తుతానికి మాల అని పిలుస్తాను. నీ గురించి యింకా నేను స్టడీ చేయాలి. నీతో కూడా నేనూ వస్తాను. నీకు అభ్యంతరమేమీ వుండదు కదా?"

"నో ప్రొఫెసర్. మీరువస్తే మరీ మంచిది. అసలు మీరు లేకుంటే అంతా నన్ను పిచ్చిదాని క్రింద జమకడ

తారు. తప్పకుండా రావాలి మీరు.''

''అలాగే. మాలా, మీతల్లిదండ్రులను కలుసుకోవా?''

''ఎంతమాట ప్రొఫెసర్ జీ! నాకు జన్మనిచ్చిన తల్లి దండ్రులను కలుసుకోకుండా వుంటానా? తప్పకుండా కలుసుకుంటాను. అయితే ఓ చిన్న అభ్యర్థన. ప్రస్తుతం నేను అక్కడకు వెళ్ళలేను. వాళ్ళను ఒకసారి ఇక్కడకే రమ్మని ఫోన్ చేయించండి.''

''గుడ్. అలాగే మిస్ మాలా!'' తృప్తిగా అన్నాడు ప్రొఫెసర్.

# 5

''మంజూ!'' లాలనగా పిలిచాడు భాస్కరరావు.

''అమ్మా మంజూ!'' సంతోషంగా పిలిచింది సుభద్ర.

ఒక్క పరుగున వెళ్ళి యిద్దరినీ పెనవేసుకుపోయింది మాల.

''నాన్నా, నన్ను క్షమించండి నాన్నా. అమ్మా నన్ను మన్నించు. కన్న తల్లిదండ్రులను గుర్తించలేక అమానుషంగా ప్రవర్తించాను.''

''లేదు మంజూ అంతా దైవలీల. జరిగినదానికి విచారించి ప్రయోజనం లేదు తల్లీ. మళ్ళీ మాకు దక్కావు. అంతే చాలు'' తల నిమురుతూ ప్రేమగా అంది సుభద్ర.

''ప్రొఫెసర్ జీ, మీకెలా కృతజ్ఞతలు తెలియ చేయాలో అర్థంకావడం లేదు. మళ్ళీ మా అమ్మాయిని మాకు దక్కించారు.''

''మిస్టర్ భాస్కరరావ్, మీరు నాకుకాదు కృతజ్ఞతలు తెలియచేయ వలసినది–డాక్టర్ రామ్‌కు. నా పరిశోధన ముందుకు సాగడానికి వీలు కల్పించి ఎంతో తోడ్పడ్డారు డాక్టర్ రామ్. అందుకు నేనుకూడా

ఆయనకు కృతజ్ఞతలు తెలియచేసుకోవాలి" నవ్వుతూ అన్నాడు ప్రొఫెసర్.

చిన్నగా నవ్వాడు డాక్టర్ రామ్.

"ప్రొఫెసర్‌జీ, అది నా డ్యూటీ. నా కర్తవ్యం నేను నిర్వర్తించాను. అంతకన్నా నేను చేసిందేమీ లేదు. మొదట పేషంట్‌ను చూడగానే మామూలుగానే మానసిక చాపల్యమని భావించాను. కానీ పేషంట్‌ను పరీక్షించిన తరువాత నా మతి చలించిందేమోనని అనుమానం కలిగింది. భాస్కరరావుగారు నన్ను సవాలు చేశారు. అప్పుడే మీరు గుర్తుకు వచ్చారు. వెంటనే మిమ్మలను పిలిపించాను. మీరు అంతా సరిదిద్దారు. సో, మీకు చెప్పాలి నేను మెనీ థాంక్స్."

భాస్కరరావు సిగ్గుపడుతూ డాక్టర్ రామ్ వైపు చూశాడు.

"క్షమించండి డాక్టర్! మిమ్ములను అపార్థం చేసుకున్నాను. మీ శక్తిని కించ పరిచాను. కేవలం మంజుకు మతిచలించిందన్న అనుమానంతో నే అలా ప్రవర్తించాను. మరోలా భావించకండి."

చిన్నగా నవ్వాడు డాక్టర్ రామ్.

"నెవర్ మైండ్ మిస్టర్ భాస్కరరావ్. ఒక డాక్టర్‌గా నేను ఎప్పుడూ అలా భావించను. ఎందుకంటే, నాకు ఫాక్ట్ తెలుసు. ఇకపోతే మీరు కన్న తండ్రిగా ఆ ఆవేదనలో అలా అన్నారు. అది సహజం."

"థాంక్స్ డాక్టర్!" తృప్తిగా అన్నాడు భాస్కరరావు.

"మిస్టర్ భాస్కరరావ్!" పిలిచాడు ప్రొఫెసర్.

ప్రొఫెసర్ వైపు చూశాడు భాస్కరరావు.

"మంజూ కలకత్తా వెళ్ళి తనను మాలగా పరిచయం

చేసుకోవాలని వుబలాట పడుతోంది. తన పూర్వజన్మ లోని తల్లిదండ్రులను చూడాలని ఆతృత చెందుతోంది. ఆమెకు ఆ అవకాశం యిస్తారా?''

''ప్రొఫెసర్ గారూ, మంజు కలకత్తా వెళితే మళ్ళీ మమ్మల్ని మరిచిపోతుందేమో?'' అనుమానంగా అంది సుభద్ర.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

''లేదు అలా ఎప్పటికీ జరగదు. మంజు పూర్వపు చిన్న పిల్ల కాదు. ఆమె ఎంతో తెలివిగల మాలగూడా. అలా జరగకుండా మాలను మళ్ళీ మీకు అప్పగించే బాధ్యత నాది'' చెప్పాడు.

''అలాగే ప్రొఫెసర్ జీ. మాలను మీ చేతులలో పెడుతున్నాం. మీ యిష్టం వచ్చినట్లు చేయండి. కానీ మాకు బాధ కలగకుండా చూడండి'' చెప్పాడు భాస్కరరావు.

''ఆల్ రైట్, మిస్టర్ భాస్కరరావ్. మరోమాట, మాలను కలకత్తా నేనే తీసుకు వెళుతున్నాను. మీలో ఎవరికన్నా ఇంట్రెస్టు వుంటే మాతో రావచ్చు.''

భాస్కరరావు, సుభద్ర కళ్ళతోనే ఓ నిముషం మాట్లాడుకున్నారు.

''ప్రొఫెసర్ జీ, మీతోబాటు నేనూ కలకత్తా వస్తాను'' చెప్పాడు భాస్కరరావు.

''అయామ్ సారీ ప్రొఫెసర్ పేషంట్ల వత్తిడివలన నాకు రావడానికి వీలుబడదు'' అన్నాడు డాక్టర్ రామ్.

''ఆల్ రైట్ డాక్టర్, ఇప్పటివరకు మీరు చేసిన సహాయం చాలు. మిస్టర్ భాస్కరరావ్ మీరు కలకత్తా మెయిల్ కు టికెట్లు బుక్ చేయించండి'' చెప్పాడు ప్రొఫెసర్.

"ఓ. కె. ప్రొఫెసర్" అంటూ ఫోన్ వైపు నడిచాడు భాస్కరరావు.

# 6

కలకత్తా మెయిల్ వేగంగా ప్రయాణిస్తోంది.

బయటనుండి చల్లగాలి రివ్వున లోపలకు కొడుతోంది.

ఫస్టుక్లాస్ కంపార్టుమెంటులో ముగ్గురే వ్యక్తులున్నారు.

ప్రొఫెసర్ నిరేన్ డీ పైప్ పీలుస్తూ కిటికీలో నుండి చీకటిలోకి చూస్తున్నాడు.

మాల కళ్ళుమూసుకుని ఆలోచిస్తూంది. అంత చల్ల గాలిలోనూ, ఆమె నుదురును స్వేద బిందువులు ఆక్ర మించాయి.

భాస్కరరావు బెర్తుమీద పడుకొని సీలింగ్ ఫాన్ వైపు తదేకంగా చూస్తున్నాడు.

మాలవైపు తిరిగాడు ప్రొఫెసర్.

"మాలా!" పిలిచాడు.

"ఊఁ" కళ్ళు తెరవకుండానే అంది.

"కలకత్తాలో మీ యిల్లు ఎక్కడుందో బాగా గుర్తుందా?" అడిగాడు.

"ఓ యస్. మీకా భయం అక్కరలేదు. కలకత్తాలో మనం దిగిన మరుక్షణం మీ బాధ్యత నాది" చిన్నగా నవ్వుతూ అంది.

"మాలా, ఒక విషయం అడుగుతాను, బాధపడవు కదా?" చిన్నగా అడిగాడు ప్రొఫెసర్.

"అడగండి."

"అంత చిన్న వయస్సులోనే నీవు మరణం ఎలా సంభవించింది?"

ఉలిక్కి పడింది మాల. ఆమెలో సంచలనం మళ్ళీ తీవ్రమయింది.

"ప్రొఫెసర్!" గట్టిగా అరిచింది. ఆమెలో గతజన్మ తాలూకు స్మృతులు కదం త్రొక్కాయి.

ఉలిక్కి పడ్డాడు ప్రొఫెసర్. బెర్త్ మీద పడుకొని వున్న భాస్కరరావు కూడా ఉలిక్కిపడి లేచాడు.

"ఆ విషయం నాకు గుర్తుచేయకండి ప్రొఫెసర్. అది చాలా దారుణమైన సంఘటన. ఆ సంఘటనను నా నోటితో నేను చెప్పలేను" గట్టిగా ఏడ్వసాగింది.

ప్రొఫెసర్ ఆమెని సముదాయించాడు.

"మిస్ మాల, మీరు పూరికే ఎక్సైట్ అవకండి. మిమ్మల్ని మీరు కంట్రోలు చేసుకోండి."

"ఎలా కంట్రోల్ అవమంటారు ప్రొఫెసర్. నా పచ్చని జీవితాన్ని బండలపాలు చేసిన ఆ దారుణ సంఘటన తలంపుకు వచ్చినప్పుడుకూడా చలించకుండా ఎలా వుండమంటారు ప్రొఫెసర్?"

"నిజమే. కాని మీరు ప్రస్తుతం 'మాల' కాదు— 'మంజు' అని గుర్తించుకోండి."

"ఏ ప్రొఫెసర్, అయితే నన్నేం చేయమంటారు?" గట్టిగా నిట్టూర్చింది మాల.

"చూడు మిస్ మాలా, నీకు సంభవించిన మరణం ఘోరమైనది కావచ్చు. దానికి ఇప్పుడు చింతించి ప్రయోజనంలేదు. కానీ మాలా, అది ఎంత ఘోరసంఘటన అయినా, ఒక పరిశోధకుడిగా అది నాకు వుపయోగిస్తుంది. కాబట్టి మీరు చెప్పాలి" స్థిరంగా అడిగాడు ప్రొఫెసర్ నిరేన్ డీ.

రెండు నిముషాలు గడిచాయి.

"ఆల్ రైట్ ప్రొఫెసర్, చెబుతాను వినండి. ఆ

దారుణ సంఘటన యింకా నా కళ్ళకు కట్టినట్లు కనబడు తోంది'' చెప్పసాగింది మాల.

శ్రద్ధగా వినసాగారు ప్రొఫెసర్, భాస్కరరావులు.

"అది 1969వ సంవత్సరం జూలై 10వ తారీకు. నేను అశోక్‌నగర్ బస్‌స్టాప్‌లో సిటీ బస్ కోసం వెయిట్ చేస్తున్నాను.

సాయంత్రం ఏడుగంటలు దాటింది.

జనరల్ హాస్పిటల్‌లో హౌస్ సర్జన్ పూర్తయిన తరువాత, ప్రయివేట్‌గా క్లినిక్ ఓపెన్ చేయాలని ప్రయత్నంచేస్తూ, డాక్టర్ పరమేశ్వరన్ దగ్గర అప్రెంటిస్‌గా పనిచేస్తున్నాను.

సిటీ బస్‌లు నాలుగువచ్చి వెళ్ళిపోయాయి. ఒక్క దానిలోనూ సీటు దొరకలేదు. మరో అరగంట గడిచింది.

అదేసమయంలో నా ప్రక్కగా ఓ చిన్న కారువచ్చి ఆగింది.

"మాడమ్'' పిలుపు వినబడింది కారులోనుండి.

కారులోకి చూశాను. జోగేందర్! చిరునవ్వు నవ్వుతూ 'కమిన్ మేడమ్' అన్నాడు డోర్ తెరచి పట్టుకొని.

జోగేందర్ మెడికల్ కాలేజీమేట్. మంచి క్లవర్ ఫెలో! ఇద్దరంకలిసే హౌస్ సర్జన్ పూర్తిచేశాం. అతను మంచి గాయకుడు కూడాను. మే మిద్దరంకలిసి కాలేజీ వార్షికోత్సవాలలో అనేక ప్రథమ బహుమతులను సంపాదించాము.

"కమిన్ మేడం. మీ ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను'' అన్నాడు మృదువుగా.

ఓసారు చుట్టూ చూశాను. మరో రెండు బస్సులకు సరిపడ జనం బస్‌స్టాప్‌లో వున్నారు. పైన మేఘాలు దట్టంగా కమ్ముకుంటున్నాయి. ఏ క్షణంలోనైనా వర్షం

పరియవచ్చనిపించింది.

ఇక ఆలోచించకుండా చటుక్కున కారు ఎక్కాను.

తన అభ్యర్థనను మన్నించినందుకు మృదువుగా థాంక్స్ చెబుతూ కారు స్టార్ట్ చేశాడు జోగిందర్.

కారు మెల్లగా పోసాగింది.

మా ఇల్లు చేరుకోవాలంటే కనీసం ఇరవై నిముషాలు పడుతుంది.

కానీ పది నిముషాలలోనే పెద్దపెద్ద మెరుపులు, ఉరుములతో కుండపోతగా వర్షం ప్రారంభమయింది.

"చూశారా, యీ రోజు ఎంత సుదినమో! నేను సమయానికి రాకుంటే, వర్షంలో మీరు తడిసి ముద్దయి పోయేవారు" అన్నాడు చిన్నగా నవ్వుతూ జోగేందర్.

"నిజం సుమా!" అన్నాను నవ్వుతూ.

"క్లినిక్ ఎప్పుడు ఓపెన్ చేస్తారు?" అడిగాడు.

"అదే చూస్తున్నాను మిస్టర్ జోగేందర్. బహుశా మరో నెలరోజులలో సెటిల్ అవవచ్చు" అన్నాను.

"పోనీ ఓ పని చేద్దామా?" అడిగాడు.

"ఏమిటది?" చూశాను అతనివైపు.

"నేనుకూడా ఓ క్లినిక్ ఓపెన్ చేద్దామని చూస్తున్నాను. ఇద్దరంకలిసి ఓ పెద్ద హాస్పిటల్ ప్రారంభిద్దాం. ఏమంటారు?".

నేనేమీ మాట్లాడలేదు.

"వాట్ మిస్ మాలా, ఆలోచిస్తున్నారు? మీకు ఇష్టం లేదా?"

"లేదు మిస్టర్ జోగేందర్. మా నాన్నగారితో ఆలోచించి చెబుతాను" అన్నాను.

అంతలోనే కారు విశాలమైన ఓ బంగళా తాలూకు పోర్టికోలోకెళ్ళి ఆగింది.

"ఇటు తీసుకవచ్చా రేమిటి?" అన్నాను.

"ఇదే మా యిల్లు. కాఫీ తీసుకు వెనుదురు గాని రండి. ఈలోపు వర్షంకూడా తగ్గుతుంది" అన్నాడు.

టైం చూశాను. 8-45 గంటలయింది.

"సారీ మిష్టర్ జోగేందర్. టైమ్ చాలా అయింది. ఇంటిదగ్గర నాకోసం ఎదురుచూస్తూ వుంటారు. నేను వెళ్లాలి" అన్నాను.

"జస్ట్ పదినిమిషాలు మాత్రమే! మిమ్మలను యింటి దగ్గర కారులో డ్రాప్ చేసే పూచీనాది. ప్లీజ్ దిగండి" డోర్ తెరచి పట్టుకొని అర్థించాడు.

కాదనలేకపోయాను. కారు దిగాను.

పోర్టికోలోనుండి బంగళాలోకి వెళ్ళేటప్పటికి వర్షపు జల్లు నా చీరను పల్చగా తడిపేసింది.

"కమాన్, రండి" లోపలకు దారితీశాడు.

మౌనంగా అతన్ని అనుసరించాను.

ఇద్దరం డ్రాయింగ్ రూంలో కూర్చున్నాం. ఇంట్లో అలికిడిలేదు. ఎవరూ లేనట్లు అనిపించింది.

ఫ్లాస్కు అందుకొని రెండు కప్పులలో కాఫీపోసి, నాకో కప్పుయిచ్చి, తనోకప్పు తీసుకున్నాడు జోగిందర్.

కాఫీ సిప్ చేస్తూ అతనే చెప్పాడు. ఇంట్లో ఎవరూ లేరని, ఎవరిదో మ్యారేజ్ కి వెళ్ళారని చెప్పాడు.

మామధ్య మౌనంగా అయిదునిమిషాలు గడిచాయి.

పైన హైస్పీడ్ లో తిరుగుతున్న సీలింగ్ ఫాన్ గాలికి నా చీర శుభ్రంగా ఆరిపోయింది.

"థాంక్స్ మిస్టర్ జోగిందర్. ఇక నేను వెళ్తాను" అంటూ సోఫాలోంచి లేచాను.

"అప్పుడే వెళతావా మాలా?" అదోలా చూశాడు జోగిందర్.

జోగిందర్ చూపులో వచ్చిన మార్పును కనిపెట్టాను.

సరిగా రెండేళ్ళ క్రితం, కాలేజీ ఎండింగ్ పీరియడ్ లో ఓసారి అదే చూపు చూశాడు ప్లేగ్రౌండ్ లో.

అప్పుడతనికి ఎడంకాలు స్లిప్పర్ తో బాగా బుద్ధి చెప్పి పంపించాను.

ఆ తరువాత క్షమార్పణలు చెప్పుకొని మళ్ళీ బుద్ధిగా వుండటం మొదలు పెట్టాడు.

సరిగ్గా మళ్ళీ యీరోజే చూశాను, అతని కళ్ళలోని ఆచూపు.

"మాలా" పిలిచాడు.

"ఎస్, మిస్టర్ జోగిందర్! నాకు చాలా ఆలస్యమై పోతోంది. ఇక నేను వెళ్తాను" బయటకు బయలుదేరుతూ అన్నాను.

"మాలా, నీ అందం నన్ను పరవశింప చేస్తోంది. ఐ లవ్ యూ మాలా, ఐ లవ్ యూ" చటుక్కున వచ్చి నా భుజాలు పట్టుకున్నాడు.

అతని కళ్ళు కామంతో జ్వలిస్తున్నాయి.

"యూ బ్రూట్ ..." మళ్ళీ స్లిప్పర్ తీయబోయాను.

అయితే నా కా అవకాశం యివ్వలేదు జోగిందర్.

చిన్నగా నవ్వాడు. "ఇది ప్లేగ్రౌండ్ కాదు మాలా, నా స్వంత బంగళా. నిన్ను యింత కష్టపడి తీసుకు వచ్చింది, వూరికే వెళ్ళిపోవడానికి కాదు. ఇంగుడు" గట్టిగా నన్ను కౌగలించుకున్నాడు.

"యూ డెవిల్, వదులు...వదులు..." గట్టిగా అరిచాను.

కానీ ఆ మూరుఖుడు తన పట్టు సడలనీయలేదు. నా పెదాలపై పెదాలుంచి అన్నాడు. "డియర్ మాలా, యీ క్షణం కోసమే, మూడు సంవత్సరాలనుండి ఎదురు

చూస్తున్నాను. నీతో దెబ్బతిన్నా నా ధ్యేయం మారలేదు. సరికదా మరింత దృఢపడింది. ఈ మహత్తర అవకాశాన్ని వదులుకోలేను. నాకు నువ్వు కావాలి'' మరింత గట్టిగా కౌగలించుకున్నాడు.

అనేక విధాల ప్రాధేయ పడ్డాను. అరిచాను, రక్కాను, బెదిరించాను, బ్రతిమాలాను. కానీ ఆ కాముకుడు తనపట్టు వదలలేదు. నన్ను బలవంతంగా బెడ్ రూంలోకి ఎత్తుకు వెళ్ళాడు.

ఆ వేళ రాత్రి నా మానాన్ని మంటగలిపాడా దుర్మార్గుడు. నా స్త్రీత్వాన్ని వేటాడాడు. నన్ను బలవంతంగా చెరిచాడు.

ఆ రెండు గంటలలో అతని పశుత్వం క్రింద నాలుగు సార్లు నలిగిపోయాను.

నేను చాలా బలహీనంగా వుండేదాన్ని. అదీగాక నాలో మెడికల్ గా కొన్ని లోపాలు వున్నాయి. నేను పరిపూర్ణమైన స్త్రీగా ఎదగలేదు. దానికొరకై ట్రీట్ మెంట్ గూడా పొందుతున్నాను.

అలాంటి సమయంలో అతని పశుబలానికి తట్టుకోలేక పోయాను. నాలో ఓవర్ బ్లడ్ బ్లీడింగ్ (అధిక రక్త స్రావం) ప్రారంభమయింది.

నాలుగోసారికి చొప్పకట్టలా వాలిపోయాను. శరీర మంతా పచ్చి పుండులా తయారయింది. ఒళ్ళంతా విపరీతమైన నొప్పులు. విపరీతమైన రక్తస్రావం వలన అతి నీరసం కలిగింది.

నా పరిస్థితి చూడగానే జోగీందర్ కు కలవరం పుట్టింది. వానికి అప్పటికి స్పృహ కలిగింది. గబగబ మెడికల్ ఎక్విప్ మెంట్ కోసం మరో గదిలోకి పరిగెత్తబోయాడు.

అంతలో బయట కారాగిన శబ్దం లీలగా విన్పించింది.

జోగిందర్ వణికిపోసాగాడు. "మైగాడ్ డాడీ వచ్చినట్లున్నారు" అన్నాడు అప్రయత్నంగా.

అంతే చకచక కదిలాడు జోగిందర్. ఒక గదిలోంచి పెద్ద రేకుపెట్టె తీసుకు వచ్చాడు. రక్తం స్రవిస్తున్న నన్ను లేపి ఆ పెట్టెలో పడుకోబెట్టాడు. పెట్టె మూత వేసేసి, ఆ పెట్టెను ఓమూలగా లాగి పైన ఏవో పడేశాడు.

ఓ రెండు నిమిషాలు గడిచాయి. అతినీరసం నన్ను వహించింది. ఒళ్ళంతా తేలిపోతున్నట్లనిపించింది. క్రమేపీ శ్వాస తీసుకోవడంగూడా కష్టమైపోయింది. అంతే, ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. అంటే, అప్పటికి నా ప్రాణం అనంతవాయువులలో కలిసిపోయి వుంటుంది."

చెప్పడం ముగించింది మాల. ఆమె కళ్ళు రెండూ ఏడ్చి ఏడ్చి ఎర్రగా వుబ్బాయి.

అప్పటివరకు ఆశ్చర్యంగా వింటున్న ప్రొఫెసర్, భాస్కరరావులు చిన్నగా నిట్టూర్చారు.

"నీది ఎంతటి ఘోరమరణం మంజూ! ఆ జోగిందర్ని చిత్రవధ చేయాలి. అప్పుడే నీ ఆత్మకు శాంతి కలుగుతుంది" బాధగా అన్నాడు భాస్కరరావు.

"మిస్ మాలా, నిజంగా నీది ఎంతో విషాదకరమైన చరిత్ర. ఇప్పుడు నీ పునర్జన్మ [illegible], నీకు పూర్వజన్మస్మృతులు కలగడానికి కారణం నేను వూహించగలుగుతున్నాను. నా పరిశోధనా గ్రంథంలో చరమాంకానికి పుటలు నిండబోతున్నాయి" అన్నాడు ప్రొఫెసర్.

"ఏమిటి ప్రొఫెసర్ మీరనేది?" అడిగాడు భాస్కరరావు.

"చెబుతాను మిస్టర్ భాస్కరరావ్. త్వరలోనే మీకు అంతా తెలుస్తుంది" చిన్నగా నవ్వుతూ మళ్ళీ అడిగాడు ప్రొఫెసర్.

"మిస్ మాలా, అయితే నువ్వు చచ్చిపోయినట్లు, మీ తల్లిదండ్రులకు తెలుసా? ఆ జోగిందర్‌ను పోలీసులు పట్టుకున్నారో, లేదో?"

"ఏమో, ప్రొఫెసర్ జీ, ఆ తరువాత జరిగిన విషయాలు నాకేమీ తెలియవు. ప్రొఫెసర్ జీ, నాకో భయంవేస్తోంది. నా గురించి నా తల్లిదండ్రులు ఎలా భావించుకొంటున్నారో, ఏమిటో? అసలు వాళ్ళు క్షేమంగా వున్నదీ, లేనిదీగూడా నాకు తెలియదు."

"ఆ విషయాల గురించి నువ్వు పెద్దగా ఆలోచించకు మాలా. జరగనున్నది జరగకమానదు. మనం అక్కడకు వెళ్ళేవరకు, ఏ విషయం గురించి వూహించగూడదు."

"ప్రొఫెసర్, మాల తల్లిదండ్రులు మనం చెప్పే మాటలు నమ్మకపోతే?" అనుమానంగా అడిగాడు భాస్కరరాంవు.

"నో. అలా జరగదు. వాళ్ళను నమ్మించే బాధ్యత నాది" అంది మాల.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"ఆల్‌రైట్ మాలా! నువ్వు కాసేపు విశ్రాంతి తీసుకో. కలకత్తా రాగానే లేపుతాను. అప్పుడు భవిష్యత్ కార్యం నిర్ణయించుకోవచ్చు" చెప్పాడు ప్రొఫెసర్.

"అలాగే ప్రొఫెసర్ జీ" బెర్త్‌పైన నడుం వాల్చింది మాల.

అప్పటివరకు జరిగిన విషయాలను వ్రాసుకోవడానికై తన డైరీ తెరిచాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

# 7

మెయిల్ కలకత్తా చేరుకొనేసరికి వుదయం ఎనిమిది గంటలయింది.

ముగ్గురూ వుడిపి హోటల్‌లో బ్రేక్‌ఫాస్ట్ ముగించారు.

మాల పరిసరాలను గమనిస్తూ గత అయిదేళ్ళలో జరిగిన మార్పులను ఏకరువు పెడుతోంది.

అక్కడ వెలసిన కొత్తకొత్త షాపులగురించి, తీసేసిన ఓ పెద్ద హోటల్ గురించి చెప్పుకుపోతోంది.

"మిస్ మాలా, మీ ఇల్లు ఇక్కడికి ఎంతదూరం? ఇలా నడిచి వెళ్ళిపోవచ్చా?" అడిగాడు ప్రొఫెసర్ జీ.

"ఓ. అయామ్‌సారీ ప్రొఫెసర్ జీ. అయిదేళ్ళ తరువాత కలకత్తా చూడటంలో, ఇంటి సంగతే మర్చిపోయాను. ఇక్కడకు చాలాదూరం ప్రొఫెసర్. టాక్సీ పిలవండి. టాటానగర్‌లోని స్టీల్ ప్రాజెక్టు కాలనీలోని హౌస్ నెం 111-4/5 అని చెప్పండి. బహుశా ఫేర్ ఓ పది రూపాయలవుతుంది."

భాస్కరరావు టాక్సీ పిలిచాడు.

అడ్రస్ చెప్పి అంతా టాక్సీ ఎక్కారు.

పదిహేను నిమిషాలలో టాక్సీ కాలనీ చేరుకుంది.

ప్రొఫెసర్ మీటర్ చూసి ఇరవై రూపాయలు ఫేర్ చెల్లించాడు.

"అదేమిటి ప్రొఫెసర్ జీ, పదిరూపాయలు ఎక్కువ ఇచ్చారు?" ఆశ్చర్యంగా అడిగింది మాల.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్. "లేదు మాలా ప్రస్తుతం పెట్రోలు చాలా కొరతగావుంది. అందువలన రేటు బాగా పెరిగిపోయింది. దాంతో టాక్సీ రేట్లు కూడా బాగా పెరిగిపోయాయి."

"వి. సీ. ఈ అయిదేళ్ళలో చాలా మార్పులు జరిగాయి" అంది.

ఓ చోట చటుక్కున ఆగిపోయింది మాల.

"అదిగో ప్రొఫెసర్ జీ, అదే మా క్వార్టర్స్. పదండి, లోపలకు వెడదాం" వేడిలా గొంతబోయింది.

"మాలా!" వారించాడు ప్రొఫెసర్. "నువ్వు తొందర పడకు. ఈ పరిస్థితులలో నిన్ను మీ తల్లిదండ్రులు గుర్తు పట్టడం చాలా కష్టం. తొందరపడితే వ్యవహారం చెడిపోతుంది. ముందు అన్నీ వివరంగా నేను చెబుతాను. సమయం వచ్చినప్పుడు నువ్వు ముందుకురా."

"అలాగే ప్రొఫెసర్ జీ" తలూపుకొంది మాల.

"గుడ్ గర్ల్!" అన్నాడు ప్రొఫెసర్.

ముగ్గురూ ఆ యింటిదగ్గరకు నడిచారు.

"మిష్టర్ అతుల్య ఘోష్!" తలుపుతడుతూ పిలిచాడు ప్రొఫెసర్.

ఓ రెండు నిముషాలు గడిచాయి.

"ఎవరూ?" అంటూ తలుపుతీశాడు ఓ యాభై అయిదేళ్ళ వ్యక్తి.

సన్నగా, బలహీనంగా ఉన్నాడా వ్యక్తి. లోపలి గుమ్మంలోంచి ఓ స్త్రీ కుతూహలంగా తొంగిచూస్తోంది.

"ఎవరు కావాలి మీకు? మీరు ఎవరు?" అడిగాడా వ్యక్తి.

"అతుల్యఘోష్ గారు మీరేనా?"

"అవును."

"థాంక్స్. మీకు 'మాల' అనే ఓ సెడిసన్ చదివే అమ్మాయి వుండేదా?"

ఓ క్షణం ఆయన ముఖం తెల్లబడింది.

"అవును" అన్నాడు మెల్లగా.

"ఇప్పుడు ఆ అమ్మాయి ఎక్కడ వుంటున్నది?"

ప్రొఫెసర్ వైపు పరీక్షగా చూశాడు ఘోష్.

"ఇంతకూ మీరెవరు? ఈ వివరాలన్నీ మీకెందుకు?"

"నా పేరు నిరేన్ డీ. నేను సైకాలజీ ప్రొఫెసర్ను. మీ అమ్మాయి గురించి కొన్ని వివరాలు సేకరించాం," అన్నాను.

అప్పటివరకు లోపలనుంచి తొంగిచూస్తున్న ఆ స్త్రీ గబగబ బయటకు వచ్చింది.

"ఎక్కడున్నది బాబూ? మా అమ్మాయి ఎక్కడ వుంది? జులాసాగా వుందా?" అడిగింది ఆదుర్దాగా.

ఆ స్త్రీ వైపు నిరసనగా చూశాడు ఘోష్.

"ఎందుకు శాంతీ, ఇంకా నీ కా పిచ్చి భ్రమలు. అది మనల్ని వదిలి ఎవడితోనో కుచ్ఛితుడితో లేచిపోయిన నాడే, నా కూతురు చచ్చిపోయిందనుకున్నాను. ఏదో మనసు చావక పోలీస్ రిపోర్ట్ కూడా ఇచ్చాను. ప్రయోజనం కనబడలేదు. ఇప్పుడా విషయంకూడా మర్చిపోయాను. గతించిన గాయాన్ని మళ్ళీ రేపుతున్నారు వీరు" అంటూ ప్రొఫెసర్ వైపు తిరిగి మళ్ళీ అన్నాడు

"అయ్యా, ప్రొఫెసర్ గారూ, మా అమ్మాయి ఎక్కడ వుంటున్నా నాకు సంబంధం లేదు. మా అమ్మాయి అయిదేళ్ళ క్రితమే మరణించిందనుకున్నా. ఇక మీరు దయచేయవచ్చు" విసుగ్గా అన్నాడు.

మాల కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగాయి.

## 8

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ డీ.

"చూడండి అభిజిత్ ఘోష్ గారూ, మీరు మీ అమ్మాయిని చాలా అపార్థం చేసుకున్నారు. మీ అమ్మాయి మనస్సు ఎలాంటిదో మీకు తెలియకపోవడం విచారకరం,

మీరు అనుకొంటున్నట్లుగా మీ అమ్మాయి ఎవరితోనూ లేచిపోలేదు.''

''మరి, మా అమ్మాయి ఏమయింది?''

''మీ అమ్మాయి మాల చచ్చిపోయింది. మీకు కనబడకుండా పోయిన రోజునే ఆమె దుర్మరణం పాలయింది'' గంభీరంగా అన్నాడు ప్రొఫెసర్.

ఉలిక్కిపడ్డాడు అతుల్య ఘోష్.

''వాట్ ప్రొఫెసర్? మీరు అంటున్నది ఏమిటి?'' నిర్ఘాంతపోతూ అడిగాడు ఘోష్.

''మీ కూతురు మాల 1969వ సంవత్సరం జులై 10వ తారీకు రాత్రి దుర్మరణం పాలయింది.''

కాంతిమతి పెద్దగా రాగాలు తీయడం ప్రారంభించింది.

''మాల ఎలా చచ్చిపోయింది ప్రొఫెసర్? ఈ విషయం మీరు మాకు ఎందుకింత ఆలస్యంగా తెలియచేశారు'' గబగబ అడిగాడు ఘోష్.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

''నాకు మాల చెప్పింది ఘోష్. అదీ మొన్ననే చెప్పింది.''

అదిరిపోయాడు ఘోష్. ఏదో వింత జంతువును చూసినట్లు ప్రొఫెసర్ని చూశాడు.

''మాల చచ్చిపోయిందంటున్నారు. మళ్ళీ యీ విషయం చెప్పిందంటున్నారు. అయిదేళ్ళక్రితం చచ్చిపోయిన మాల మొన్నటి రోజున మీకా విషయం ఎలా చెబుతుంది? ఇది ఎలా సంభవం?''

గంభీరమైన కంఠంతో అన్నాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

''మాల మళ్ళీ పుట్టింది మిష్టర్ ఘోష్. మాల విజయవాడలోని భాస్కరరావు, సుభద్ర దంపతులకు పునర్జన్మించి 'మంజు' అనే పేరుతో పెరుగుతోంది. ఇదుగో

వీరే ఆ భాస్కరరావు. ఇప్పుడు మీ ఎదురుగావున్న ఆ పాపే మీ అమ్మాయి మాల. ఆమెకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. ఆమే నాకు అన్నివిషయాలు చెప్పి, ఇక్కడకు తీసుకువచ్చింది. ఈ విషయం మీకు నమ్మశక్యం కాక పోవచ్చు. కానీ ఇది యదార్థం. సృష్టిలో జరిగే ఓ అపురూపమైన వింత."

విప్పారిన కళ్ళతో చూస్తుండిపోయారు ఘోష్ దంపతులు.

ఇంకా చూస్తూ ఆగలేకపోయింది మాల. ఆమెలో ప్రేమ, జాలి పరవళ్ళు తొక్కాయి.

"అమ్మా" అంటూ ఒక్కవుదుటున వెళ్ళి కౌగలించుకుంది. మాల కళ్ళవెంబడి కన్నీళ్ళు ధారగా ప్రవహించసాగాయి.

ఏంచేయాలో తోచని శాంతిమతి అచేతనంగా నిల బడిపోయింది.

"అమ్మా, నేనమ్మా! మాలను! నువ్వు ముద్దుగా పిలుచుకొనే 'మాలూ'ను. నాతో మాట్లాడు అమ్మా. ఒక్కసారి 'మాలూ' అని పిలువమ్మా!" ప్రాధేయపడుతూ తల్లిని పట్టుకొని వూపసాగింది మాల.

ఈలోకంలోకి వచ్చింది శాంతిమతి. ఆమెకు అంతా అయోమయంగా వుంది. మాలవైపు చిత్రంగా చూసింది. ఆ తరువాత విచిత్రంగా నవ్వింది.

"నిన్ను ఏమని పిలువమంటావు తల్లీ! నా 'మాలూ'వు నువ్వేనంటే ఎలా నమ్మమంటావు? ఇప్పుడు నా మాలూ వుంటే ముగ్గురు బిడ్డల తల్లయి వుండేది. నా మాలకు నీఅంత కూతురు వుండేది. మనవరాలు వయసులోవున్న నిన్ను కూతురుగా ఎలా భావించమంటావమ్మా?"

"లేదమ్మా! నేను మాలనే. అప్పుడు చచ్చిపోయాను,

కానీ మీకోసం మళ్ళీ పుట్టాను. ఆ భగవంతుడు యిచ్చిన పూర్వజన్మ జ్ఞానం వలన ఎక్కడినుండో మిమ్మలను చూడాలని వచ్చాను. నన్ను పిలవమ్మా! ఒక్కసారి 'మాలూ!' అని పిలవమ్మా. మళ్ళీ వెళ్ళిపోతాను. ఇక మీకు కనబడను" వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆ పాప మాటలకు చలించిపోయింది శాంతిమతి.

"అమ్మా మాలూ!" ఆర్ద్రంగా అరిచింది శాంతిమతి. రెండు చేతులూ చాచి, 'మాలూ' అంటూ మళ్ళీ పిలిచింది.

"అమ్మా" అంటూ తల్లిని పెనవేసుకుపోయింది మాల. ఇరువురి కళ్ళవెంబడి ఆనందబాష్పాలు కురవసాగాయి.

ఆ మధుర సన్నివేశాన్ని చూస్తూ, చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నారు ప్రొఫెసర్, భాస్కరరావు, ఘోష్‌లు.

తల్లిని విడిపించుకొని తండ్రి దగ్గరకు వచ్చింది మాల.

"నాన్నా, అదేమిటి అలా చిక్కిపోయారు? అయ్యొయ్యో నన్ను డాక్టర్ చదివించింది యిందుకా? నో, మీరు యింకా యిలా వుండటానికి వీలులేదు. ఇక మీరు ఫుల్‌గా రెస్ట్ తీసుకోవాలి. నేను డాక్టర్‌గా చెబుతున్నాను మీరు పూర్తి విశ్రాంతి తీసుకోండి."

"అమ్మా మాలా! విధి ఎంత విచిత్రమైనది. నా కళ్ళనే నేను నమ్మలేకపోతున్నాను."

"లేదు నాన్నా నేను మీ మాలనే. ఆ వేళ రాత్రి నేను దుర్మరణం పాలయ్యాను. మళ్ళీ ఓ పుణ్యదంపతుల గర్భాన జన్మించాను. ఒక వారం రోజుల క్రితమే, నాకు పూర్వజన్మ జ్ఞానం వచ్చింది. వెంటనే మీదగ్గరకు బయలుదేరాం."

"అమ్మా మాలా! అవును. నువ్వు మా మాలవే! తల్లీ, చూశావా? నువ్వు లేకపోతే మీ నాన్న ఎలా తయా

రయ్యాడో? అయినా నువ్వు లేకుండా నీ తండ్రి ఎలా ఆరోగ్యంగా వుంటాడమ్మా? రాత్రిపూట నువ్వు సరసన లేనిదే నేనెప్పుడన్నా భోజనం చేశానా? అందుకే తల్లీ, నేను రెండోపూట భోజనం చేసి అయిదేళ్ళయింది నిన్ను మేమంతా తలచుకోని క్షణం లేదుతల్లీ.

"మాలా, నన్ను క్షమించు తల్లీ. నిన్ను అపార్థం చేసుకున్నాం. ఏ తండ్రీ కలలోగూడా వేయని నింద నీపై వేశాం. నువ్వు ఆరోజు ఎవడితోనో లేచిపోయావని భ్రమపడుతున్నాం. మళ్ళీ యీరోజు, యీవిధంగా, యీరూపంలో కన్పిస్తావని కలలోగూడా వూహించలేదు మాలా!" ఎత్తుకుని ముద్దాడుతూ పరవశంగా అన్నాడు ఘోష్.

ఆ ముగ్గురినీ తృప్తిగా చూడసాగారు ప్రొఫెసర్, భాస్కరరావులు.

అరగంటసేపు ఆ యింటిలో ఆనందం వెర్రిగా చిందులేసింది.

తన గత జన్మస్మృతులన్నీ పదేపదే ఏకరువు పెట్టసాగింది మాల.

తన స్నేహితురాళ్ళ వివరాలన్నీ పేరుపేరునా అడిగి తెలుసుకుంది.

అప్పటికే యీ విషయం కాలనీలో చాలామందికి తెలిసిపోయింది. తెలిసిన వాళ్ళు చాలామంది ఘోష్ ఇంటికి వచ్చారు.

అందరినీ పేరుపేరునా పలుకరించింది మాల. ఎవరో ముక్కూ మొహం తెలియని అయిదేళ్ళ పాప తమ వివరాలన్నీ చెబుతోంటే వింతగా చూడసాగారు, కాలనీలోని యితర క్వార్టర్ల నివాసులు.

ఇల్లంతా కలియతిరిగి, తాను లేని సమయంలో చేసిన

మార్పులన్నింటినీ విమర్శించి, మళ్ళీ సరిదిద్దింది. తన గది లోని పుస్తకాలన్నీ దుమ్ముదులిపి మళ్ళీ సర్దుకోసాగింది మాల.

"ప్రొఫెసర్ జీ, మా అమ్మాయిని మళ్ళీ మాయింటికి చేర్చారు. కూతురు లేచిపోయిందన్న అవమానంతో కృశించిపోతున్న మాకు నూతనోత్సాహాన్ని కలుగ చేశారు. మీకెలా కృతజ్ఞతలు తెలియచేసుకోవాలో అర్థంకావడం లేదు" ప్రొఫెసర్, భాస్కరరావులకు డ్రింక్స్ సర్వ్ చేస్తూ అన్నాడు అతుల్యఘోష్.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"ఇందులో నాకు కృతజ్ఞతలు తెలియచేయవలసిన అవసరంలేదు. ఈమెను కన్న భాస్కరరావు దంపతు లకు, ఆ తరువాత నాకీ కేసు అప్పగించిన డాక్టర్ రామ్‌కు తెలియచేయండి కృతజ్ఞతలు. పూర్వజన్మ జ్ఞానం కలిగి విచిత్రంగా ప్రవర్తిస్తున్న మంజుకు మతి చెలించిందేమో నని భ్రమించి, డాక్టర్ రామ్ దగ్గరకు తీసుకువెళ్ళారు. మంజును పరీక్షించిన డాక్టర్ రామ్, ఆమెలో ఏలోపం కనుగొనలేక, అతనికేమీ అర్థంగాక నన్ను పిలిపించాడు. నేను పూర్వజన్మలపై పరిశోధన సాగిస్తున్నాను. ఈ కేసు స్వరూపాన్ని అర్థంచేసుకొని, యిది పునర్జన్మ కేసుగా తేల్చాను. మంజుకు యీజన్మ జ్ఞానంకూడా కలిగించాను. ఆ తరువాత మాల పూర్వజన్మ వృత్తాంతం ఋజువు చేసుకోనేటందుకై యిక్కడకు తీసుకువచ్చాను. ఇప్పుడు మాల మీకుమార్తె అనీ, మంజుకు పూర్వజన్మ జ్ఞానం కలిగిందని ఋజువయింది."

ఘోష్ భాస్కరరావువైపు కృతజ్ఞతగా చూశాడు.

భాస్కరరావు చిన్నగా నవ్వుతూ అన్నాడు: "మిస్టర్ ఘోష్, మాల మీఅమ్మాయే కానీ, యీ పాప

మంజు. ఈపాప నా కూతురు."

"మిష్టర్ భాస్కరరావ్!" నవ్వుతూ అన్నాడు ఘోష్.

"నా కీ తృప్తిచాలు. మాల చనిపోయినా, మళ్ళీ మంజూగా పుట్టింది. ఈ మంజులోనే నా మాల వుంది. ఆపాప మీకు మంజు అయితే, నాకు మాల! ఇక పాప ఎక్కడవున్నా ఫర్వాలేదు. నా మాలకు పెళ్ళయి అత్తారింటికి వెళ్ళిందని తృప్తి పడతాను."

"వెల్. ఇప్పుడు నాకుమాత్రం చాలా తృప్తిగా వుంది" నవ్వాడు ప్రొఫెసర్ నిరేన్ డీ.

మరో రెండు గంటలు అవలీలగా గడిచిపోయాయి.

ఆరోజు ఘోష్ యింటిలో బ్రహ్మాండమయిన విందు జరిగింది. అంతా నవ్వుతూ, తుళ్ళుతూ భోజనాలు చేశారు.

తీరికగా అంతా కూర్చున్న తరువాత, పాన్ నము లుతూ అడిగాడు ఘోష్.

"ప్రొఫెసర్ జీ, ఇంతకూ మాల ఎలా చనిపోయింది? ఏమైనా ఏక్సిడెంట్ జరిగిందా? మాల కన్పించకుండా పోయిన మరునటి రోజునే, పోలీస్ రిపోర్ట్ యిచ్చాను. ఇంతవరకు పోలీసులు కనుక్కోలేకపోయారు. ఇక వెళ్ళి విత్ డ్రా చేద్దాం" అన్నాడు.

రెండు నిమిషాలేమీ మాట్లాడలేదు ప్రొఫెసర్. ఆ తరువాత అన్నాడు దృఢంగా.

"వద్దు మిష్టర్ ఘోష్. ఆ రిపోర్టు అలాగే వుండ నివ్వండి. మీ మాల మరణం సహజమైనది కాదు. ఘోరంగా హత్య చేశాడో కిరాతకుడు. అతన్ని యిప్పుడు పోలీసులకు పట్టివ్వాలి. న్యాయం కళ్ళుగప్పి తిరుగుతున్న ఓ హంతకుడికి తగిన దండన విధింపబడేలా చూడాలి.

న్యాయం మరణించదని ఋజువు చేయాలి."

నిర్ఘాంతపోతూ అన్నాడు ఘోష్.

"వాట్ ప్రొఫెసర్! హత్యా? మాలను హత్యచేసే అవసరం ఎవరికుంది. నా కన్నతల్లిని పొట్టన పెట్టుకున్న ఆ నీచుడెవరు?"

చిన్నగా చెప్పాడు ప్రొఫెసర్.

"అతని పేరు జోగిందర్. మాలతో బాటు కాలేజీలో చదువుతున్నాడు. అతనే ఆ వేళ రాత్రి కారులో లిఫ్ట్ యిస్తానని చెప్పి, నమ్మించి మాలను తన కారులో తన బంగళాకు తీసుకువెళ్ళి బలవంతంగా చెరిచాడు. ఆ తరువాత అధిక రక్తస్రావానికి గురయిన మాలను ఓ పెద్ద పెట్టెలో పెట్టి మూత వేసేశాడు. ఇంతవరకే చెప్పగలిగింది మాల. బహుశా ఆ తరువాత మాల చనిపోయి వుండాలి."

"మై గాడ్. జోగిందరా?" ఆశ్చర్యపోతూ అన్నాడు ఘోష్.

"ప్రొఫెసర్ జీ, జోగిందర్ చాలా పెద్ద రాంక్ లో వున్నాడు. అతను గవర్నమెంట్ హాస్పిటల్ లో అసిస్టెంట్ సివిల్ సర్జన్ గా పని చేస్తున్నాడు. అతనికి పోలీస్ డిపార్ట్ మెంట్ లో పలుకుబడి బాగా వుండి వుంటుంది. మనం చెప్పే మాటలను పోలీసులు నమ్ముతారా?" సందేహంగా అడిగాడు ఘోష్.

"మన ప్రయత్నం మనం చేద్దాం మిస్టర్ ఘోష్, చూస్తూ చూస్తూ ఓ హంతకుడ్ని విడిచిపెట్టడం భావ్యం కాదు. అతను అమానుషంగా హత్యచేసి ఆ కేసును మాఫ్ చేయాలని ప్రయత్నించినా, న్యాయం మరణించదని అతనికి ఋజువు చేయాలి. ఇందుకు నేను శాయశక్తులా పాటుబడతాను."

"వెల్ ప్రొఫెసర్. మీ అకుంఠిత దీక్ష నన్నా ఆవేశ

పరుడ్ని చేస్తోంది. పదండి మిస్టర్ ఘోష్. మనమంతా కలిసి జోగిందర్ ని హంతకునిగా నిరూపించాలి. మంజూ, నువ్వుకూడా రా" లేచాడు భాస్కరరావు.

అంతా పోలీస్ స్టేషన్ కు బయలుదేరారు.

# 9

"గుడ్ మార్నింగ్ ఇనస్పెక్టర్ గారూ!" విష్ చేశాడు అతుల్య ఘోష్.

"నమస్తే. రండి. కూర్చోండి" కళ్ళజోడు సర్దుకుంటూ ఆహ్వానించాడు ఇనస్పెక్టర్ చంద్రజిత్ రే.

మాల, ప్రొఫెసర్, భాస్కరరావులుగూడా లోపలకు వచ్చి విష్ చేసి కూర్చున్నారు.

"ఏమిటి, పనిమీద వచ్చారు?" అడిగాడు ఇనస్పెక్టర్ రే.

చిన్నగా గొంతు సవరించుకొని చెప్పాడు ఘోష్.

"ఇనస్పెక్టర్ జీ, 1969వ సంవత్సరం జులై 11వ తారీకు వుదయం మీకో రిపోర్ట్ ఇచ్చాం. మా అమ్మాయి పేరు మాల, వయసు పాతిక సంవత్సరాలు, బక్క పలచగా వుంటుంది, కనబడటం లేదని రిపోర్ట్ ఇచ్చాం. గుర్తుందా?"

ఓ నిమిషం ఆలోచించాడు ఇనస్పెక్టర్.

ఆ తరువాత రైటర్ని పిలిచి ఫలానా ఫైల్ తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు.

అయిదు నిమిషాలలో ఫైలు తీసుకువచ్చి టేబుల్ పై వుంచాడు రైటర్.

ఆ ఫైల్ తెరచి ఓసారి చూశాడు ఇనస్పెక్టర్;

"ఎస్, మీరు రిపోర్ట్ ఇచ్చిన తరువాత ఆ విషయమై కొంత పరిశోధన సాగించాము. మాల డాక్టర్ పరమేశ్వ

రన్ క్లినిక్ నుండి సాయంత్రం ఏడుగంటలు దాటిన తరువాత బయటకు వచ్చిందని తెలిసింది. అయితే ఆ తరువాత ఎంత ప్రయత్నించినా మా పరిశోధన ముందుకు సాగలేదు. మాల ఎక్కడవుందో మాకు తెలియలేదు. బ్రోతల్ హౌస్‌లపై దాడి జరిపేటప్పుడు దృష్టిలో వుంచుకోమ్మని అన్ని పోలీస్ స్టేషన్లకు ఫోటోలు పంపించాం. ఆ రోజు మొదలు ఒకవారం రోజులవరకు ప్రమాదవశాత్తు చనిపోయిన కేసులను, గురుతెలియని శవాలను పరిశీలించాం. కానీ ఆధారాలు దొరకలేదు" చెప్పాడు రే.

"ఇప్పుడు మాకు కొన్ని వివరాలు తెలిశాయి ఇన్‌స్పెక్టర్ జీ" అన్నాడు ప్రొఫెసర్.

"వివరాలా? ఏమిటవి? మీకెలా తెలిశాయి? ఇంతకూ మీరెవరు? మాలకు మీకు సంబంధ మేమిటి?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ వరుసగా.

"నా పేరు నిరేన్‌డీ. నేను ఢిల్లీలో సైకాలజీ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాను.

1969వ సంవత్సరం జూలై 10వ తారీకున మాయమైన మాల, అదేరోజు రాత్రి ఓ కాముకుడి చేతిలో ఘోరంగా ప్రాణాలు కోల్పోయింది. ఆ హత్య చేసిన హంతకుడు పోలీసుల కళ్ళుగప్పి పెద్దమనిషిగా చెలామణి అవుతున్నాడు" చెప్పాడు ప్రొఫెసర్.

"వాట్?" అదిరిపడ్డాడు ఇన్‌స్పెక్టర్.

"మాల హత్య చేయబడిందా? ఎవరా హంతకుడు?"

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"ఈ విషయం మీరు నమ్మకపోవచ్చు ఇన్‌స్పెక్టర్. కానీ నేను చెప్పింది పచ్చి నిజం! ఆ హంతకుడు నేటి సంఘంలో ఒక ప్రముఖ వ్యక్తిగా చలామణి అవుతున్నాడు. అతని పేరు జోగిందర్! గవర్నమెంట్

హాస్పటల్‌లో అసిస్టెంట్ సివిల్ సర్జన్‌గా పని చేస్తున్నాడు."

ఈమాట విని మరీ ఆశ్చర్యపోయాడు ఇన్స్పెక్టర్.

"వాట్ ప్రొఫెసర్ మీకు మతిపోలేదు కదా? డాక్టర్ జోగిందర్ నాకు బాగా తెలుసు. అతనొక బాధ్యతగల వ్యక్తి."

"కావచ్చు ఇన్స్పెక్టర్! కానీ యిది జరిగింది అయిదేళ్ళ క్రితం. అప్పుడతను బాధ్యతగల పదవిలో లేడు."

"ఆల్ రైట్ ప్రొఫెసర్ మీకు యీ విషయం ఎలా తెలిసింది? జోగిందర్‌ను మీరు హంతకుడిగా నిరూపించ గలరా?" అడిగాడు ఇన్స్పెక్టర్ రే.

"మేం నిరూపించలేకపోవచ్చు ఇన్స్పెక్టర్. హత్య జరిగి అయిదేళ్ళవుతోంది. ఆధారాలు దొరక్క పోవచ్చు. కానీ జోగిందర్ ఆరోజు రాత్రి మాలను మాయచేసి యింటికి తీసుకువెళ్ళి, బలవంతంగా రేప్ చేసి హత్యచేయడం మాత్రం నిజం. ఈ విషయం నాకు యిటీవల స్వయంగా మాల చెప్పింది."

అదిరిపడ్డాడు ఇన్స్పెక్టర్. ఆ తరువాత పకపక నవ్వాడు.

"వాట్ ప్రొఫెసర్ మీరు కర్మగాలి మెంటల్ హాస్పిటల్ నుండి పారిపోయి రావడం లేదుకదా! మీరు అయిదేళ్ళ క్రితం చచ్చిపోయిందని పేర్కొన్న మాల, మళ్ళీ యిటీవల ప్రత్యక్షమై చెప్పిందా? మీకు జోక్ చేయడానికి యింకెవరూ దొరకలేదా? అయినా అసలు యిదెలా సంభవం?"

కోపంగా ఇన్స్పెక్టర్ వైపు చూశాడు ప్రొఫెసర్.

"ఇన్స్పెక్టర్ హేళనగా నవ్వకండి. ప్రపంచంలో నేడు అనేక వింతలు జరుగుతున్నాయి. ఇప్పుడు జరిగింది

కూడా అలాంటి ఒక వింతే! నేను సూదాగా చెప్పడం లేదు. గత అయిదేళ్లుగా పరిశోధిస్తున్న పరిశోధన ఆధారంగా చెబుతున్నాను.

మాల మళ్ళీ పుట్టింది ఇన్‌స్పెక్టర్. కలకత్తాలో చచ్చిపోయిన మాల, అదే సంవత్సరంలో విజయవాడలోని భాస్కరరావు దంపతులకు ఆడపిల్లగానే పుట్టింది. ప్రస్తుతం 'మంజు' అనే పేరుతో పెరుగుతోంది. ఇటీవలనే ఆ పాపకు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. పునర్జన్మలపై గత అయిదేళ్ళుగా పరిశోధనలు సాగిస్తున్న నేను, యీ కేసునుగూడా టేకప్ చేసి మంజును స్టడీ చేశాను. చివరకు మంజుకు పూర్వజన్మ జ్ఞానం కలిగిందని ఋజువు చేసుకున్నాను. మంజు తన పూర్వజన్మలో మాలగా జన్మించానని చెబుతూ ఆ జన్మ గాధంతా చెప్పింది. మంజు చెప్పిన కథను నిరూపించుకోవడానికి మంజును కలకత్తా తీసుకు వచ్చాను. ఆమె చెప్పినదంతా యధార్థమే! మంజు తన పూర్వజన్మలోని యిల్లును, పరిసరాలను, తల్లిదండ్రులను గుర్తించి ఎన్నో విచిత్రమైన విషయాలను తెలియచేసింది.

ఇదిగోండి యీ పాపే మంజు. పూర్వజన్మలోని మాల. జోగిందర్ తనను హత్య చేసిన విధానమంతా కళ్ళకుకట్టినట్లు చెప్పింది. అందుకే మీ సహాయంకోసం వచ్చాము. మీరు యీ అమ్మాయిని ఏ విధంగానయినా సరే పరీక్షించుకోవచ్చు" అంటూ జరిగిన చరిత్రంతా విపులంగా వివరించి చెప్పాడు ప్రొఫెసర్ నిరేన్ డీ.

అంతా విన్న ఇనస్పెక్టర్ చంద్రజిత్ రే దీర్ఘంగా నిట్టూర్చాడు. ముక్కుమీదకు జారిపోతున్న కళ్ళద్దాలను సవరించుకొని అన్నాడు.

"మిష్టర్ నిరేన్ డీ, ఇది చాలా విచిత్రమైన కేసు.

హత్యచేయబడిన వ్యక్తి తిరిగి పునర్జన్మించి, తనను హత్య చేసిన హంతకుడి గురించి తెలియచేయడం అపురూపమైన విషయం. నా ముప్ఫయి సంవత్సరాల సర్వీసులో ఇలాంటి కేసును ఇంతవరకు చూడలేదు. వినలేదు.

మీరు చెప్పేది నిజం కావచ్చు. కానీ దానికి ఆధారాలు కావాలి. చట్టం ఒప్పుకోవాలి. పునర్జన్మలు వున్నట్లు శాస్త్రజ్ఞులు నిరూపించాలి. ఈ పాపకు పూర్వజన్మ జ్ఞానం కలిగినట్లు నిపుణులు ధృవీకరించాలి. అప్పుడు మళ్ళీ అందుకు అనుగుణంగా చట్టాన్ని సవరించాలి. ఇన్ని జరిగితే కానీ, యీ కేస్ సాల్వ్ కాదు. అప్పుడే యీ పాప చెప్పే సాక్ష్యాన్ని కోర్టు మన్నిస్తుంది. అది ఇప్పుడు అసంభవం!"

దృఢంగా అన్నాడు ప్రొఫెసర్.

'నో ఇన్స్పెక్టర్! అది సంభవం కావాలి. ఒక అపరాధి నేరం చేసి తప్పించుకోగూడదు. అందుకు తగిన శిక్ష అనుభవించాలి. న్యాయానికి చావులేదని నిరూపించాలి. ఈ పాపకు పునర్జన్మ కలిగినట్లు నేను ఋజువుచేస్తాను కోర్టులో. మిగిలిన విషయాలు మీరు నిరూపించండి."

"కేవలం సాక్ష్యం ముక్కలే సరిపోదు ప్రొఫెసర్. ఆధారాలు కావాలి. లేకుంటే జోగిందర్‌ను హంతకుడిగా నిరూపించలేము" చెప్పాడు ఇన్స్పెక్టర్.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

ఒక నిమిషం ఆగి మళ్ళీ ఇన్స్పెక్టర్ అన్నాడు.

"ప్రొఫెసర్, ఆ రాత్రి మాలను రేప్ చేశాడు జోగిందర్. రక్తం స్రవిస్తున్న మాలను రేకు పెట్టెలో పెట్టాడని యీ పాప చెప్పడంద్వారా తెలుస్తున్నది. ఆ తరువాత ఏంజరిగిందో తెలిస్తే కేసును కొంచం ముందుకు

నడిపించవచ్చు.'''

"లాభంలేదు ఇన్స్పెక్టర్! మాల ఆ రేకు పెట్టెలో వుండగానే చనిపోయి వుంటుంది. అందువలన ఆమెకు మిగతా వివరాలు తెలియవు."

"అయితే యిప్పుడు ఏంచేద్దాం?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"పోనీ ఓ పని చేయండి ఇన్స్పెక్టర్. జోగీందర్‌ను ఇక్కడకు పిలిపించండి. నయాన్నో, భయాన్నో అతన్నే ఒప్పిద్దాం."

ఓ నిమిషం ఆలోచించాడు ఇన్స్పెక్టర్. అతనికి గూడా యీ కేసు చాలా వుత్సాహం కలిగించింది.

"ఆల్‌రైట్ ప్రొఫెసర్‌జీ, జోగీందర్‌ను పిలిపిస్తాను. కానీ నేరం ఋజువు కాకపోతే, అతను మనందరిమీద పరువు నష్టం దావా వేసే అవకాశం వుంది."

"మీకా భయం అక్కరలేదు ఇన్స్పెక్టర్" హామీ ఇచ్చాడు ప్రొఫెసర్.

ఇన్స్పెక్టర్ హెడ్ కానిస్టేబుల్‌ను పిలిచి రహస్యంగా ఏదో చెప్పి పంపించాడు.

"ఇన్స్పెక్టర్!" హఠాత్తుగా పిలిచాడు భాస్కరరావు.

"వాట్ మిష్టర్ భాస్కరరావ్?" అడిగాడు.

"మాలను రేకు పెట్టెలో మూసేశాడు జోగీందర్. ఆ తరువాత జరిగింది మాలకు గుర్తులేదు. అంటే మాల రేకు పెట్టెలోనే చచ్చిపోయింది. పెట్టె తెరచిన జోగీందర్‌కు మాల శవం కనబడి వుంటుంది. ఆ పరిస్థితిలో జోగీందర్ ఏంచేస్తాడు? అతని ప్రథమ కర్తవ్యం శవాన్ని మాయం చేయడం. అదేచేసి వుంటాడు. శవాన్ని బహుశా రేకు పెట్టెలో సహా బంగళా ఆవరణలోనే పాతిపెట్టి

వుంటాడు.''

''గుడ్ అయిడియా!'' అరిచాడు ప్రొఫెసర్.

''అవును ఇన్స్పెక్టర్. ఇంతవరకు మనకా ఆలోచన తట్టలేదు. ఆ శవం బయటపడితే వేరే ఆధారాలు అక్కర లేదు. దయచేసి మీరు ఆ ఇంటి ఆవరణను గాలించండి.''

ఇన్స్పెక్టర్ రే ఆలోచనలో పడ్డాడు. రెండు నిమిషా లాగి అన్నాడు.

''ప్రొఫెసర్, ఇదిచాలా తీవ్రమైన వ్యవహారం. శవం కోసం ఇంటిని గాలించడమంటే సామాన్యమైనదికాదు. ఆ తరువాత డిపార్ట్మెంట్ చాలా చిక్కు పరిస్థితులను ఎదుర్కొనవలసి వస్తుంది.''

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

''లేదు, ఇన్స్పెక్టర్. అలా ఎన్నటికి జరగదు. మీ డిపార్ట్మెంట్ కు మాట రాకుండా నేను వ్యక్తిగతమైన పూచీ ఇస్తాను. ఈ వ్యవహారం ఫాల్స్ అయితే నేరం దర్జే జరుపబడే క్రిమినల్ చర్యలకు నేను బద్ధుడనై వుంటాను. మీకు కావాలంటే ఆ విధంగా బాండ్ వ్రాసిస్తాను'' నిశ్చయంగా అన్నాడు ప్రొఫెసర్.

''ఆల్ రైట్ ప్రొఫెసర్, మీ బాధ్యతమీద యీ వ్యవహారంలో కలుగచేసుకుంటున్నాను. ఇప్పుడే సిబ్బం దిని పంపిస్తాను'' అంటూ కాల్ బజర్ ప్రెస్ చేశాడు ఇన్స్పెక్టర్ రే.

''థాంక్స్ ఇన్స్పెక్టర్'' కృతజ్ఞతలు తెలియచేశాడు ప్రొఫెసర్.

సార్జంట్ తో సబ్ ఇన్స్పెక్టర్ నవీన్ కుమార్ని పిలవ మని ఆజ్ఞాపించాడు.

మరుక్షణంలో సబ్ ఇన్స్పెక్టర్ నవీన్ కుమార్ శాల్యూట్ చేస్తూ అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"మిస్టర్ నవీన్ కుమార్, మీరు తక్షణం సిబ్బందితో అసిస్టెంట్ సివిల్ సర్జన్ జోగిందర్ ఇంటికివెళ్ళి ఆ ఆవరణ అంతా గాలించండి. అక్కడ మీకు ఓ అస్థిపంజరం కనబడుతుంది. దానిని స్వాధీనం చేసుకొని తీసుకురండి. క్విక్" ఆజ్ఞాపించాడు ఇన్స్పెక్టర్ రే.

సబ్ ఇన్స్పెక్టర్ నవీన్ కుమార్ శాల్యూట్ చేసి, బయటకు నడిచాడు వేగంగా.

# 10

హెడ్ కానిస్టేబుల్ నలుగురు వ్యక్తులను లోపలకు తీసుకు వచ్చాడు.

"పాపా, అందులో జోగిందర్ ఎవరు?" రహస్యంగా అడిగాడు ఇన్స్పెక్టర్ మాలను.

మాల ఆ నలుగురువైపు పరీక్షగా చూసింది.

"అదుగో ఇన్స్పెక్టర్ జీ" మధ్యలో వైట్ స్లాక్ టక్ చేసుకొనివున్న వ్యక్తిని చూపించింది.

"గుడ్!" అన్నాడు ఇన్స్పెక్టర్.

జోగిందర్ మినహా, మిగిలిన ముగ్గురూ శాల్యూట్ చేసి వెళ్ళిపోయారు.

"కమాన్ మిస్టర్ జోగిందర్. కూర్చోండి" కుర్చీ చూపించాడు ఇన్స్పెక్టర్.

"గుడ్ మార్నింగ్ ఇన్స్పెక్టర్ జీ. అయామ్ సారీ, మీ పిలుపు వచ్చేటప్పటికి నేను ఆపరేషన్ థియేటర్లో వున్నాను. ఏమిటంత అర్జంటుగా కబురుచేశారు? మళ్ళీ ఏదైనా కొత్త కేసా?" అడిగాడు నవ్వుతూ.

గవర్నమెంట్ హాస్పిటల్లో అసిస్టెంట్ సివిల్ సర్జన్ గా పనిచేస్తున్న జోగిందర్, పోలీస్ డిపార్ట్మెంట్ ద్వారా వచ్చే శవాలను పోస్ట్మార్టం చేస్తుంటాడు.

"ఎస్ డాక్టర్ జోగిందర్! దాదాపు అయిదేళ్ళ క్రితం ఓ హత్య జరిగింది. ఆ కేసులో నిందితులు మీరే!" చెప్పాడు ఇన్స్పెక్టర్.

అదిరిపడ్డాడు జోగిందర్.

"వాట్ ఇన్స్పెక్టర్? మీరు నేది ఏమిటి?"

"అవును మిస్టర్ జోగిందర్! అయిదేళ్ళ క్రితం ఓ స్త్రీ హత్యజరిగిందని, అందులో నేరస్థుడవు నీవేనని మాకు రిపోర్ట్ వచ్చింది."

వ్యంగ్యంగా నవ్వాడు జోగిందర్.

"ఆ రిపోర్ట్ ఎవరుయిచ్చారు ఇన్స్పెక్టర్? అయినా మీరెలా నమ్ముతున్నారు?"

"ఆ రిపోర్ట్ నేనే యిచ్చాను మిస్టర్ జోగిందర్" గంభీరంగా అన్నాడు ప్రొఫెసర్.

"మిస్టర్ జోగిందర్, బాగా గుర్తుకు తెచ్చుకో. 1969వ సంవత్సరం జులై 10వతారీకు రాత్రి, నీతో బాటు మెడిసన్ చదివిన మాల అనే యువతిని, మంచి మాటలతో బుజ్జగించి, కారులో లిఫ్ట్ యిస్తానని చెప్పి మంచి మాటలతో మీ యింటికి తీసుకు వెళ్ళావు. అదేరాత్రి ఆమెను బలవంతంగా అనుభవించి ఘోరంగా హత్య చేశావు."

వణికిపోయాడు జోగిందర్.

"ఇదంతా మీకెలా తెలుసు? ఇంతకూ మీరెవరు? నో. అంతా అబద్ధం! నాకేమీ తెలియదు" తడబడుతూ అన్నాడు జోగిందర్.

చిన్నగా నవ్వాడు ప్రొఫెసర్.

"మిస్టర్ జోగిందర్, నేరం దాగదు. న్యాయాన్ని వంచించలేవు. మాలను హత్యచేసిన తరువాత శవాన్ని మాయంచేస్తే సరిపోతుందనుకున్నావు. కానీ మనిషి

మరణించినా, న్యాయం మరణించదు మిస్టర్ జోగిందర్. మాల మళ్ళీ పుట్టింది. మంజూగా పుట్టి, నీ చరిత్రంతా చెప్పింది. ఇప్పటికైనా నేరం ఒప్పుకో."

"మీరనేది ఏమిటో నాకర్థం కావడంలేదు. నాకేమీ తెలియదు" గట్టిగా అరిచాడు జోగిందర్.

"మిస్టర్ జోగిందర్" పిలిచింది మాల.

ఆశ్చర్యంగా అటువైపు చూశాడు జోగిందర్.

"మిస్టర్ జోగిందర్ నేనెవరా అని ఆశ్చర్యపోతున్నావా? 1969వ సంవత్సరం జూలై 10వ తారీఖ రాత్రి, నువ్వు అనుభవించిన మాలను నేనే. నిన్ను చట్టానికి బందీచేయడంకోసమే నేను మళ్ళీ పుట్టాను. 'మంజూ'గా పుట్టిననాకు గతజన్మలో మాలగా గడిపిన క్షణాలన్నీ గుర్తున్నాయి. ఆవేళ రాత్రి నీ బలాత్కారం వలన రక్తం స్రవిస్తున్న నన్ను పెద్ద రేకుపెట్టెలో పెట్టి మూతవేసే శావు. ఆపెట్టెలోనే నేను ప్రాణాలు కోల్పోయాను. బాగా గుర్తుకు తెచ్చుకో. నిజం ఒప్పుకో."

తల తిరిగిపోయింది జోగిందర్‌కు. "నో. నాకేమీ తెలియదు. నేను మాలను చంపలేదు" గట్టిగా అరిచాడు.

"మిస్టర్ జోగిందర్! నువ్వు కేవలం బుకాయించకు. నువ్వు మాలను రేప్ చేశావు. మాల చచ్చిపోయింది. మళ్ళీ మంజూగా పుట్టింది. అయిదేళ్ళ వయసులో ఆమెకు పూర్వజన్మజ్ఞానం కలిగింది. ఆమె తల్లిదండ్రులను గుర్తించింది. నీగురించిన చరిత్ర అంతా చెప్పింది. నువ్వు ఒప్పుకోక తప్పదు" గట్టిగా అన్నాడు ప్రొఫెసర్.

అదేసమయంలో బయట జీప్ ఆగిన శబ్దం వినిపించింది. అంతా ఆత్రుతగా గుమ్మంవైపు చూశారు.

సబ్ ఇన్స్‌పెక్టర్ నవీన్‌కుమార్ గబగబ లోపలకు వచ్చి ఇన్స్‌పెక్టర్‌కు శాల్యూట్ చేశాడు.

"సక్సెస్ సార్! గ్రాండ్ సక్సెస్. మా పని చాలా సులభంగానే అయిపోయింది. పెరటిలోకి వెళ్ళగానే అక్కడ మారొక పాడుబడిన బావి కన్పించింది. వెంటనే నాకెందుకో ఆబావిపై అనుమానం వచ్చింది. వెంటనే ఫైర్ సర్వీస్ వాళ్ళను పిలిపించి ఆ బావిలోకి దింపించాను. మా అనుమానం కరెక్టయింది. ఆ బావి అడుగున ఓ పెద్ద రేకుపెట్టె కన్పించింది. అందులో ఓ అస్థిపంజరం వుంది" చెప్పాడు.

"గుడ్!" సంతోషంగా అన్నాడు ఇన్స్పెక్టర్.

కానిస్టేబుల్స్ ఆ పెట్టెను జాగ్రత్తగా తీసుకువచ్చి లోపల దింపారు.

నవీన్‌కుమార్ మూత తెరిచాడు. అంతా అదిరి పోయారు. లోపల ఒక అస్థిపంజరం మడత పెట్టబడి వుంది.

"నాదే ఇన్స్పెక్టర్, ఆ అస్థిపంజరం నాదే! అది గోండి ఇన్స్పెక్టర్, ఆ అస్థిపంజరం మెడలోని లాకెట్ తెరవండి. అందులో గతజన్మలోని నా ఫోటో వుంటుంది. అవిగో ఆ వ్రేళ్ళకున్న వుంగరాలుకూడా నావే. ఇంతకన్నాయింకా ఆధారాలు ఏంకావాలి ఇన్స్పెక్టర్? ఈ జోగీందర్ హంతకుడు. అతన్ని అరెస్ట్ చేయండి" అరిచింది మాల.

జోగీందర్ బిత్తరబోయి చూడసాగాడు. అతని కాళ్ళు చిన్నగా వణుకుతున్నాయి.

"వాట్ మిస్టర్ జోగీందర్, ఇది నిజమా? నువ్వు మాలను రేప్ చేసి హత్య చేశావా? చెప్పు? క్విక్" గద్దించాడు ఇన్స్పెక్టర్.

"ఆగండి!" అరిచాడు జోగీందర్.

"అంతా నిజమే! ఆ అమ్మాయి చెప్పింది, ప్రొఫెసర్

చెబుతున్నది, అంతా నిజమే! ఆరోజు బస్‌స్టాప్‌లో మాల కనబడింది. ఆమెమీద కోరికతో మంచి మాటలు చెబుతూ ఆమెను నా బంగళాకు తీసుకువెళ్ళాను. మాల నాకు లొంగలేదు. బలవంతంగానే తృప్తితీరా అనుభవించాను. అంతేకానీ, నేనామెను హత్య చేయలేదు. అయితే బలహీనంగా వుండటం వలన మాల రక్తస్రావానికి గురయింది. అంతలో బయట ఎవరో వచ్చిన శబ్దమయింది. ఆ కంగారులో మాలను అలాగే ఎత్తి ఈ పెట్టెలో పడేశాను. ఏదో పనిమీద వచ్చిన మిత్రునికి సమాధానం చెప్పి, పంపించాను. ఆ తరువాత లోపలకువచ్చి పెట్టె తలుపు తీయగానే అదిరిపోయాను.

మాల చచ్చిపోయింది! రక్తస్రావానికి గురయి చచ్చిపోయిన మాల శవం భీభత్సంగా వుంది. నాకేంచేయాలో తోచలేదు. విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయాను. అలాగే మళ్ళీ పెట్టెమూసేసి, అమాంతంగా ఆ పెట్టెను తీసుకువెళ్ళి మా పెరట్లోవున్న పాడుబడిన బావిలో పడేశాను.

అంతే ఆ తరువాత మాలగురించి మర్చిపోయాను. కానీ మాల మళ్ళీ జన్మిస్తుందని కలలోగూడా వూహించలేదు. నేరం దాగదని మరోసారి ఋజువయింది. నా పాపానికి పరిహారం లేదు. నన్ను అరెస్ట్‌చేయండి ఇన్స్‌పెక్టర్, నన్ను అరెస్ట్‌చేయండి'' చేతులు రెండూ చాచాడు డాక్టర్ జోగీందర్.

తృప్తిగా చూశాడు ప్రొఫెసర్, ఇన్స్‌పెక్టర్ వైపు.

ఇన్స్‌పెక్టర్ సైగ నందుకొని, జోగీందర్ చేతులకు బేడీలు తగిలించారు కానిస్టేబుల్స్.

''వెల్ మిస్ మాలా! చచ్చి సాధిస్తారని అంటారు. ఆ సూక్తిని నువ్వు నిజం చేశావు. మరణించిన పిదప

మళ్ళీ జన్మించి, హంతకుడిని పట్టించిన ఘనత భారత దేశంలో నీకే దక్కుతుంది. గాడ్ సేవ్ యు" అన్నాడు ఇన్స్పెక్టర్ రే, మాలవైపు చూస్తూ.

"అంతేకాదు, మాల విచిత్ర చరిత్ర నా పరిశోధనకొక పరిపూర్ణత కలిగించింది. పునర్జన్మ కలిగిన ప్రాణులకు పూర్వజన్మ జ్ఞానం ఎందుకు కలుగుతుందో నాకు యిప్పుడు అర్థమయింది. నా పరిశోధనా గ్రంథంలో మాలపేరును సువర్ణాక్షరాలతో లిఖిస్తాను" అన్నాడు ప్రొఫెసర్ తృప్తిగా.

"మంజు నా కూతురుగా పుట్టించినందుకు నేనెంతో గర్విస్తున్నాను" గర్వంగా అన్నాడు భాస్కరరావు.

మౌనంగా చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నాడు అతుల్యఘోష్.

మాలమాత్రం నిర్వికారంగా, తన గత జన్మలోని ఫోటోవైపు చూస్తూ కూర్చొంది.

"ఆల్ రైట్, ఇక మేం శెలవు తీసుకుంటాం ఇన్స్పెక్టర్ జీ" లేచాడు ప్రొఫెసర్ నిరేన్ డే.

"మంచిది ప్రొఫెసర్ జీ. మీ సహకారానికి మా కృతజ్ఞతలు. మీ గురించి ప్రభుత్వానికి ప్రత్యేకంగా తెలియచేస్తాను" షేక్ హాండిస్తూ అన్నాడు ఇన్స్పెక్టర్ చంద్రజిత్ రే.

అంతా బయటకు నడిచారు.

—: ఐ పో యిం ది :—

# చైనా దండయాత్ర

## కె. శివరామ్

"మిస్టర్ యువరాజ్! మీకు తెలిసే వుంటుందనుకుంటాను" అన్నాడు స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్, బడోద్కర్.

"ఏమిటి?" అడిగాడు డిటెక్టివ్ యువరాజ్.

"దిగ్విజయాన్ని ఎత్తుకెళ్ళడానికి కుట్ర జరుగుతూంది" అన్నాడు రక్షణ మంత్రి.

"దిగ్విజయం ఎవరు?"

"దిగ్విజయం సైనిక రంగంలో బ్రిగేడియర్‌గా పనిచేసి రిటైర్ అయ్యాడు. యుద్ధరంగంలో సమయానుకూలంగా వ్యూహాలుపన్ని శత్రువులను ఛేదించడంలో గొప్ప నేర్పరి."

"ఆయనను ఎత్తుకెళ్ళడానికి కుట్ర జరుగుతూందని మీకెలా తెల్సు?" అనడిగాడు అసిస్టెంట్ సూరి.

"మా సీక్రెట్ బ్రాంచ్ ఏజెంట్లు పసిగట్టారు."

"ఎలాగు? ఎవరు?"

"మా బ్రాంచిలో ఆరితేరిన వాడైన జగదీష్ దిగ్విజయంవద్ద డ్రైవరుగా చేరాడు. చాలా సీక్రెట్ గా వుంటున్నాడు" అనన్నాడు బడోద్కర్.

"జగదీష్ తెల్సుకున్న విషయాలను వివరంగా చెప్పండి" అనడిగాడు యువరాజ్.

"మాకు జగదీష్ రిపోర్టులు పంపిస్తున్నాడు. ఆ రిపోర్టుల ప్రకారం జగదీష్ ఎందుకనో అనుమానించాడు. అనుమానం ధృవపడింది. వెంటనే దిగ్విజయంవద్ద డ్రైవరుగా చేరాడు. డ్రైవరుగా వుంటూ దిగ్విజయాన్ని కాపాడు కుంటూ ఇంకా విషయాలను సేకరిస్తున్నాడు."

"స్పెషల్ బ్రాంచ్ ఏజెంట్ తెలియచేశాడన్న మాట! కారణం లేనిదే చెప్పి వుండడు" అన్నాడు యువరాజ్.

"దిగ్విజయాన్ని ఎత్తుకెళ్ళడానికి ఎవరు కుట్ర పన్నుతున్నారో తెల్సుకోవాలి. ఈ విషయంలో ఎంత ఉన్నతాధికారికి ప్రమేయమున్నా బంధించి తీరాలి" అనన్నాడు మంత్రి.

"కుట్రదారులెవరో తెల్సుకోవడానికి ప్రయత్నించలేదా?"

"ప్రయత్నం కొనసాగుతూంది. ఆ వ్యక్తులెవరో అంతుపట్టలేదు. చాలా గుంభనంగా శత్రువులు తమ కార్యకలాపాలను సాగిస్తూ వస్తున్నారు. ఆచూకీ అందడం లేదు" చెప్పాడు ఐ. జి.

"కొంతకాలం పాటు దిగ్విజయాన్ని అజ్ఞాతంగా వుంచితే?"

"అందుకు కతడు ఒప్పుకోవడంలేదు. పోలీస్ బలగం ఇంత వుండి మనదేశంలో విదేశకుట్రదారులను బంధించ నందుకు కేక లేస్తున్నాడు."

"దిగ్విజయాన్ని తను జాగ్రత్తలో వుంచడానికి యత్నిస్తే ఆయన మామీద కారాలుమిరియాలు నూరు తున్నాడు. అదీ నిజమే! దిగ్విజయంలాటి వ్యక్తులు దేశానికి అవసరం. ఆయన వ్యూహాలు యుద్ధరంగంలో అపజయం ఎరగవు. అటువంటి వ్యక్తిని కాపాడుకునే బాధ్యత మన పైన వుంది. ఆయన స్వభావం ఎలావున్నా, ఆయన మన మాట ఖాతరు చేయనప్పటికీ కాపాడుకోవాలి. అందుకు మీరూ రంగంలోకి దిగి కుట్రదారులెవరో తెల్సుకుని బంధించండి. దిగ్విజయాన్ని భారతదేశం వదలి వెళ్ళ కుండా చూడండి" అని హోం మంత్రి చెప్పాడు.

"అవును మిస్టర్ యువరాజ్! దిగ్విజయాన్ని ఎత్తు కెళ్ళడానికి ఎవరో ప్రయత్నిస్తున్నారు అని మా ఏజెంట్లు తెల్సుకున్నారేగానీ ఎవరు, ఎందుకు అంతుచిక్కలేదు' ఇందులో జగదీష్ పంపిన రిపోర్టులు వున్నవి" అనంటూ బడోద్కర్ ఒక ఫైలుని అందించాడు. యువరాజ్ దానిని అందుకున్నాడు.

ఆ ఫైలుని అటు యిటు తిరిగేశాడు. "నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను" అన్నాడు యువరాజ్.

"ఎలాగైనా మీరు కుట్రదారులను బంధించి దిగ్వి జయాన్ని అపహరించబడకుండా కాపాడండి. జయం కలుగుగాక!" అనంటూ రక్షణ మంత్రి లేచాడు. అందరూ లేచారు.

యువరాజ్ వారివద్ద శెలవు పుచ్చుకుని బయటకి

నడిచాడు.

## 2

"మిస్టర్ యువరాజ్! దిగ్విజయం కారు డ్రైవరైన జగదీష్‌ని ఎవరో బంధించి అక్కడ కాపలావున్న పోలీసులను పడగొట్టి, దిగ్విజయాన్ని ఒక ఫియట్ కారులో ఎత్తుకెళ్తున్నారు. ఆ సమయానికి క్రిందపడ్డ పోలీసులు లేచివచ్చి మాకు విషయం చెప్పారు. పోలీసు జీపులు, వ్యానులు ఫియట్‌ని తరుముకుంటూ వెళ్ళుతున్నవి. దిగ్విజయాన్ని దుండగారులు ఎలా తీసుకెళ్ళిపోతారో తెలియడంలేదు. ఈలోపు ఏదైనా అపాయం సంభవించుతుందేమో అనుమానంగా వుంది. వీలైతే మీరూ రండి" అని ఫోన్‌లో వినబడింది.

టెలిఫోన్‌లో ఎవరు చెప్పారో యువరాజ్ అడగలేదు.

"ఇపుడు ఫియట్ ఎటు వెళ్ళుతూంది?" అనడిగాడు యువరాజ్ ఆదుర్దాగా.

"నగరం దాటబోతూందట! ఇప్పుడే మెస్సేజ్ అందింది" అని వినబడింది. యువరాజ్ రిసీవర్ని ఫోన్ మీద పెట్టేశాడు.

"సూరీ, క్విక్!" అంటూ ఒక్కంగలో బయటకు వచ్చాడు. సూరి యువరాజ్ వెనుకాలే బయటకు వచ్చాడు. ఆ ఇద్దరు డిటెక్టివ్‌లు ఆదరాబాదరా స్టిత్రన్ కారెక్కారు.

స్టిత్రన్ కారు చక్రాలు ప్రొఫెల్లర్లా తిరుగుతున్నాయి. ట్రాఫిక్ సిగ్నల్సును ఉల్లంఘించింది. చాలా జీపు కార్లు హారను పెట్టుతూ వెళ్ళుతున్నవి.

స్టిత్రన్ కారు జీపులను ఓవర్ టేక్ చేయడం ప్రారం

భించింది. యువరాజ్ తన దృష్టినంతా స్టీరింగ్ మీద లగ్నపరిచి వున్నాడు. సిట్రన్ యువరాజ్ చేతిలో అల్లల్లాడి పోతూంది.

పట్టపగలు ఒకవ్యక్తిని అనామతుగా ఎత్తుకెళ్ళడానికి ఎంత ధైర్యముండాలి? ఆ వ్యక్తులెవరు? ఏ దేశస్తులు? దిగ్విజయంతో అంత అవసరం ఎవరికి? అలా ఎత్తుకెళ్ళితే దిగ్విజయం వ్యూహాలు పన్నుతాడని ఎలా నమ్మారు?

అసలు ఇంతమంది పోలీసులను, జీపులను ఎలా తప్పించుకుంటారు? యువరాజుకు అంతుపట్టలేదు. సిట్రన్ పరుగులు తీస్తూంది.

అల్లంత దూరంలో దిగ్విజయం వున్న ఫియట్ కారు దూసుకువెళ్ళుతూంది. చెట్లమధ్య మినుక్, మినుక్ మంటూ ఫియట్ కారు కనబడుతూంది. ఇక కొద్దిసేపటిలో సిట్రన్ ఫియట్‌ని ఓవర్ టేక్ చేయవచ్చని యువరాజ్ అనుకుని ఆక్సిలేటర్‌ని మరింత గట్టిగా అదిమాడు. ఆశ్చర్యం—

ఎక్కడ నుండో ఒక హెలికాప్టర్ వచ్చింది. యువరాజ్ సూరీలు యిద్దరూ ఆ హెలికాప్టర్‌ని చూచి ఆశ్చర్యచకితులయ్యారు.

హోరు పెట్టుకుంటూ వచ్చిన హెలికాప్టర్ ఫియట్ మీద ఎగురుతూంది. ఫియట్ కారుకు తిన్నగా గగనంలో ఎగురుతూ కారుతో బాటు ప్రయాణిస్తూంది హెలికాప్టర్.

సిట్రన్‌లో వున్న డిటెక్టివ్ లిద్దరూ వూపిరి వుగ్గపట్టుకొని చూస్తున్నారు.

హెలికాప్టర్‌లో నుండి నాలుగు కొక్కాలు దిగడం ప్రారంభించాయి. ఫియట్ కారు వేగం తగ్గలేదు. హెలికాప్టర్ వేగమూ తగ్గలేదు. ఆ రెండు వేగంగా

ప్రయాణిస్తూనే వున్నవి.

దిగిన నాలుగు కొక్కాలు ఫియట్ కారు_నాలుగు డోర్లకు తగులుకున్నవి. పట్టుకున్నవి. అంతే__

ఫియట్ కారు అలాగ్గా పైకిలేచింది.!

యువరాజ్ సూరీల ఆశ్చర్యానికి అంతులేదు.

గ్రద్ద కోడిపిల్లను తన్నుకుని వెళ్ళే విధంగా, హెలికాప్టర్ ఫియట్ కారుని తన్నుకుని ఎత్తుకెళ్ళిపోతూంది.

ఆ దృశ్యాన్ని డిటెక్టివ్ లిద్దరూ చూస్తూ విస్తుపోయారు.

యువరాజ్ తన సిట్రన్ కారుని ఆపాడు. క్రిందకు దిగాడు. సూరికూడా దిగాడు.

హెలికాప్టర్ ఫియట్ కారుని గగనంలో తీసుకెళ్ళడం చూస్తూ నిలబడ్డారు. ఏం చేయాలో అంతుపట్టడంలేదు. కొంత దూరంలో చిన్న కొండ వుంది. హెలికాప్టర్ ఆ కొండను దాటుకుందంటే కంటికి కనబడదు. ఏం చేయాలి? ఆలోచిస్తున్నాడు యువరాజ్.

పోలీస్ జీపులు, వ్యానులుకూడా అక్కడకు చేరుకున్నవి. అందరూ దిగి ఆశ్చర్యంగా తిలకిస్తూ నిలబడ్డారు. ఒక హెలికాప్టర్, ఫియట్ కారుని అలాగ్గా గగనంలో ఎత్తుకెళ్ళడం విచిత్రంగా వుంది అందరికీ.

ఆ ప్రదేశం జీపులతోను, పోలీసులతోను కిటకిటలాడిపోయింది.

"మిస్టర్ ధనార్జనరావ్? వెంటనే మీరెళ్ళి వైమానిక దళానికి రిపోర్టు ఇవ్వండి" అన్నాడు యువరాజ్.

"అలాగే" అనంటూ ధనార్జనరావ్ తన జీపు వద్దకు పరుగెత్తాడు.

"నాకు నమ్మకం లేదుసార్! శత్రువులు ఇంత పకడ్బందీగా చేస్తున్నారంటే విమాన దళాలకు శత్రువులు

చిక్కారు” అన్నాడు సూరి.

“నాకా విషయం తెలుసు సూరి! ప్రయత్నం చేయాలి.”

“ఇప్పుడు హెలికాప్టర్ ఎటు వెళ్ళుతుందంటారు?”

“ఆ కొండను దాటుతున్న తరవాత—సముద్రముంది. సముద్రంలో శత్రువులు ఏంచేసి వుంటారో?” అనంటూ యువరాజ్, “సూరీ! మన బైనాక్యులర్స్ పట్టుకురా!” అనంటూ ముందుకు కదిలాడు.

యువరాజ్ సూరీలు గబగబా ఆ కొండను ఎక్కారు. శిఖరంమీద నిలబడ్డారు. తమ బైనాక్యులర్స్ పెట్టుకుని సముద్రంవైపు చూడడం ప్రారంభించారు.

హెలికాప్టర్ దూరదర్శినికి అందడంలేదు. ఏమయింది? ఎటు వెళ్ళి వుంటుంది? యువరాజ్ సూరీలు బైనాక్యులర్స్ పెట్టుకుని సముద్రంమీద, గగనంలోను గాలిస్తున్నారు.

సముద్రపుటలలు, కనబడుతున్నవి. గగనంలో మేఘాలు గోచరిస్తున్నవి. హెలికాప్టర్ ఎటు వెళ్ళినది అంతు చిక్కలేదు.

హెలికాప్టర్, దానికి తగులుకున్న ఫియట్ కారు సముద్రంమీద ఎలా మాయమయి వుంటాయి? ఏమయి వుంటుంది? సముద్రంలో మరేదైనా విమాన ముందా? లేక జలాంతర్గామి వుందా? ఫియట్ కారులోని దిగ్విజయం—విమానంలోకో, జలాంతర్గామిలోకో బదిలీ అయివుంటే ఫియట్ కారును శత్రువులు ఏంచేసివుంటారు? సముద్రంలో ముంచేసి వుంటారు. అయితే హెలికాప్టర్??

హెలికాప్టర్ని ముంచేసి వుంటారేమో??

# 3

"అవమానం! మన దేశంలో ఇంతటి ఘోర అవమానం మరెప్పుడూ జరిగివుండదు. దిగ్విజయాన్ని ఎత్తుకెళ్లుతారని తెల్సి, మనం అతనిని కాపాడుకోలేకపోయాం. అంతా మనలోని అసమర్థత. అధికారాలెందుకు? పదవులెందుకు? దిగ్విజయాన్ని ఎవరు ఎత్తు కెళ్ళారు? ఏ దేశీయులు? వెంటనే తెల్సుకోవాలి. దిగ్విజయాన్ని విడిపించుకుని తీసుకురావాలి" అని గర్జించాడు హోం మంత్రి.

హోం మంత్రి కెదురుగా భారతదేశ ఉన్నతాధికారులు ఆసీనులై వున్నారు. అందరూ చిన్నబుచ్చుకుని వున్నారు. స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ బడోద్కర్, రక్షణ మంత్రి, ఇంకా ఇతర అధికారులు వున్నారు.

డిటెక్టివ్ యువరాజ్, సూరీలూ వున్నారు!

సీక్రెట్ బ్రాంచ్ ఏజెంట్ జగదీష్ కూడా వారిలో వున్నాడు!

"ఆవేశపడకండి. జయాపజయాలు కల్గడం సహజం. శత్రువులు వుద్దేశపూర్వకంగా పథకాలు వేసి దిగ్విజయాన్ని అపహరించుకు వెళ్ళారు. అంతమాత్రంచేత భారతదేశం అసమర్థతవ లోనుకాదు" చెప్పాడు బడోద్కర్.

"మన అసమర్థత కళ్ళకుకట్టినట్టు కనబడుతూంది. దిగ్విజయం మనదేశానికి ఎంత అవసరమో మీ అందరకూ తెల్సు. చైనా, పాకిస్తానులు మన సరిహద్దులో పొంచి వున్నవి. ఎ క్షణాన్నైనా యుద్ధం రావచ్చు. అటువంటి యుద్ధమే సంభవిస్తే దిగ్విజయం వ్యూహాలు మన కవసరం. సైనిక బలంకంటె, వ్యూహాల నేర్పు సమరరంగంలో అత్యావశ్యకం! వ్యూహాలు పన్నడంలో అఖండుడైన దిగ్వి

జయాన్ని శత్రువులు ఎత్తుకెళ్ళిపోయారు. అతనిని ఎత్తు కెళ్ళడానికి కుట్ర జరుగుతూందని మీ కందరకూ తెల్సు. ఎందుకు కాపాడలేకపోయారు? చెప్పుకోడానికి సిగ్గు చేటు!'' రుసరుసలాడిపోయాడు హోం మంత్రి.

''అయినదేదో అయిపోయింది. దిగ్విజయాన్ని ఎవరు ఎత్తుకెళ్ళారు? ఏ దేశస్థులు? దిగ్విజయాన్ని ఎక్కడ దాచి వుంటారు? ఆయనను ఎలా మనం విడిపించుకుని తెచ్చు కోవడం?'' అనడిగాడు రక్షణ మంత్రి.

''దిగ్విజయం వ్యూహాలు పన్నడంలో ఆరితేరినవాడు. ఏ దేశస్థులకు అవసరం?'' అడిగాడు బడ్జోద్కర్.

''అరబ్ దేశాలకు ఇజ్రేల్‌కు యుద్ధం సాగుతూంది. ఇండియామీద యుద్ధం చేయడానికి పాకిస్తాన్, చైనాలు సిద్ధంగా వున్నవి. రష్యా, చైనాలు ఏ క్షణానైనా యుద్ధానికి తలపడడానికి తయారుగావున్నవి. గనక దిగ్వి జయాన్ని ఎత్తుకెళ్ళడానికి చాలామందికి అవకాశముంది'' అనన్నాడు హోం మంత్రి.

''మిస్టర్ జగదీష్ మీ అనుమానం చెప్పండి,'' అనడి గాడు డిటెక్టివ్ యువరాజ్.

''నా అనుమానం అంటే- నాకు లభించిన నిదర్శనల ప్రకారం రష్యన్లు అయివుండాలని! ఎందుకంటే శత్రు వులు రష్యన్ భాషలో మాట్లాడుకోవడం విన్నాను. రష్యన్ భాషలో వున్న కొన్ని పత్రాలు లభ్యమయినవి'' అని చెప్పాడు జగదీష్.

అందరూ ఆశ్చర్యంగా జగదీష్‌ని చూశారు.

రష్యా ప్రపంచంలో ఒక అగ్రరాజ్యం. రష్యా ప్రతి రంగంలోను పురోభివృద్ధి సాధించివుంది. అటువంటి రష్యా దిగ్విజయాన్ని ఎత్తుకెళ్ళి వుంటుందంటే ఎవరూ నమ్మలేకపోయారు. రష్యావద్ద అణ్వాస్త్రాలు తృప్తికరంగా

వున్నవి. చైనాలాటి దేశాలకు భయపడే దేశంకాదు. దిగ్విజయంలాటి వ్యక్తులు రష్యావద్ద చాలామంది వుంటారు.

"యువరాజ్ మీరేమంటారు?" అడిగాడు బడోద్కర్.

"నాకు నమ్మకంలేదు. జగదీష్‌లాటి వ్యక్తులు ఋజువులు సంపాదించి వుండవచ్చు. ఆ ఋజువులను శత్రువులు సృష్టించి వుంటారని నా అభిప్రాయం! రష్యా అంటే గిట్టని దేశపు వ్యక్తులు_అభాండాలు వేయడానికి పూనుకుని వుంటారు. గనక రష్యామీదకు మన దృష్టి మళ్ళడం హాస్యాస్పదం!" అన్నాడు డిటెక్టివ్ యువరాజ్.

"అయితే... దిగ్విజయాన్ని ఎవరు ఎత్తుకెళ్ళి వుంటారని అంటారు?" అడిగాడు మంత్రి.

"నా వూహా ప్రకారం చైనీయులై వుండాలి. ఎందుకంటే చైనా రష్యామీదకు కాలు దువ్వుతూంది. రష్యాను తూలనాడుతూంది. రష్యాను అవమానపరచడానికి చైనా ఎత్తువేసి వుండవచ్చు. మనదృష్టి రష్యామీదకు మళ్ళించడానికి చైనీయులకే అవకాశంవుంది" చెప్పాడు యువరాజ్.

"అయితే దిగ్విజయాన్ని చైనీయులే ఎత్తుకెళ్ళి వుంటారా?" అడిగాడు బడోద్కర్.

"అవును" చెప్పాడు యువరాజ్.

"అయితే మన గూఢచారులను చైనా పంపుతాను. అలాగే మీరూ బయలుదేరండి. ఒక తడవ మీరు చైనా వెళ్ళి మన కరెన్సీ తయారగు స్థలాన్ని నామరూపాలు లేకుండాచేసి వచ్చారు. మీ ప్రజ్ఞా విశేషాలు మా కందరకూ తెల్సు. గనక కాదనకండి. చైనాకు బయలుదేరండి. దిగ్విజయాన్ని ఎక్కడ వుంచివున్నా తీసుకుని సురక్షితంగా మనదేశానికి రండి" బడోద్కర్ చెప్పాడు.

"ఇప్పుడు అసాధ్యమైన పని!" చెప్పాడు యువరాజ్.

అందరూ ఆశ్చర్యంగా యువరాజ్‌ని చూశారు.

"ఎందుకని?" అడిగాడు బడోద్కర్.

"ఇపుడు చైనా తన దేశాన్ని యావత్తూ యుద్ధభూమిగ తయారు చేస్తూంది. ఇటువంటి సమయంలో చైనాలోకి ప్రవేశించి బయటపడడం దుర్లభం!" అన న్నాడు యువరాజ్.

"మీరు సాహసించాలి. ఒక చైనావాడు ఇండియాలోకి ప్రవేశించి దిగ్విజయాన్ని తీసుకెళ్ళాడు. దిగ్విజయం దేశానికి అత్యవసరమైన వాడు. అటువంటి వ్యక్తిని మనం దక్కించుకోవాలి. కాదనకు యువరాజ్. మీ మేధాతనం, సమయస్ఫూర్తిమీద మాకు గట్టి నమ్మకముంది. మీరు తప్పక దిగ్విజయాన్ని సురక్షితంగా తీసుకొస్తారని ఆశవుంది" అన్నాడు హోం మంత్రి.

"భారతమాత కొరకు ఏ త్యాగానికైనా సిద్ధంగా వున్నాను. దిగ్విజయం ఏ దేశంలోవున్నా తీసుకొస్తాను" అనన్నాడు యువరాజ్, చివరకు దృఢ నిశ్చయంతో.

"మీకు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాము. మీరు ఏ దేశంలోని భారత రాయబారిని సంప్రదించినా ఆ యా దేశ డబ్బు మీ కందుతుంది" అని చెప్పాడు హోం మంత్రి.

సమావేశమయిన వారంతా లేచారు.

## 4

"సార్! దిగ్విజయం చైనాలో వున్నాడో, రష్యాలో వున్నాడో నిర్ణయించకనే మనం బయలుదేరడం అవివేకమనిపిస్తూంది," అన్నాడు సూరి.

"దిగ్విజయం చైనాలో వున్నా, రష్యాలో వున్నా

మనం తీసుకరావాలి. ముందు చైనాలోకి వెళ్ళి చూద్దాం. దిగ్విజయం వుంటే తీసుకరద్దాం. లేదా రష్యాలోకి ప్రవేశిద్దాం. చైనాలోకి ప్రవేశిస్తే వెళ్ళిన మార్గాన తిరిగి రాలేము. ఎందుకంటే చైనా, రష్యా సరిహద్దు ప్రాంతం వరకు వెళ్ళుతున్నాం. అక్కడ ఇపుడు చైనా భారీ యెత్తున యుద్ధ సన్నాహాలు చేస్తూంది. మనం చైనానుండి తప్పించుకుని రష్యాలోకి ప్రవేశించి తీరాలి. కనక మన ప్రయాణం చైనాకన్నమాట!" అనన్నాడు యువరాజ్.

"నా కంతా కందరగోళంగా వుంది సార్! మనమెలా వెళ్ళాలి?" అనడిగాడు సూరి.

"ఏర్పాట్లన్నీ చేసి వున్నాను. ఇపుడు టెలిఫోన్ వస్తుంది. ఫోన్ రాగానే జపాన్ వెళ్ళుదాం."

"జపాన్ ఎందుకు సార్?" ఆశ్చర్యపడుతూ అడిగాడు సూరి.

"జపాన్ నుండి చైనాలోకి ప్రవేశించడం సులభమని అభిప్రాయపడుతున్నాను."

"ఎందుకని?"

"ఇపుడు జపాన్ చైనాతో వాణిజ్యం మామూలుగానే చేస్తూంది. కనక మనం జపాన్ వర్తకుల్లా చైనాలో ప్రవేశించాలి," అని చెప్పాడు యువరాజ్.

ఆ సమయంలో ఫోన్ మ్రోగింది. యువరాజ్ రిసీవ్ చేసుకున్నాడు.

"ధనార్జనరావుని మాట్లాడుతున్నాను. సముద్రంలో నౌకాదళ సిబ్బంది, గగనంలో వైమానిక సిబ్బంది వెదికారు. కానీ దిగ్విజయాన్ని శత్రువులు యెలా తీసుకవెళ్ళిపోయారో తెలియలేదు. అయితే జలాంతర్గామిలో తీసుకెళ్ళి వుండవచ్చని భావిస్తున్నారు. మీరడిగిన ఏర్పాట్లన్నీ సిద్ధం చేశాం. ఇక మీరు బయలుదేరవచ్చు. మీరు

వెళ్ళి దిగ్విజయాన్ని తోడ్కొని దిగ్విజయంతో వస్తారని, రావలయునని ఆశిస్తున్నాను'' అని చెప్పాడు ధనార్జన రావ్.

''అంతా దైవానుగ్రహం! వెళ్ళేది కమ్యూనిస్ట్ రాజ్యాలలోకి. కమ్యూనిస్ట్ రాజ్యాలకు, ప్రపంచానికి ఇనుప తెర అడ్డం వుంటుంది. ఇక్కడి విషయాలు నాకు తెలియవు. అక్కడి విషయాలు మీకు తెలియవు. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను'' అన్నాడు యువరాజ్.

''ధర్మం, న్యాయంవైపు ఎప్పుడూ బలం వుంటుంది. పాస్‌పోర్టులు సిద్ధంగా వున్నవి'' అని చెప్పాడు ధనార్జన రావ్.

''యస్, బయలుదేరుతున్నాం.''

''విష్ యు గుడ్ లక్.''

యువరాజ్ రిసీవర్ పెట్టేశాడు.

ఆ డిటెక్టివ్ లిద్దరూ కావాల్సిన సరంజామాను పదిల బరచుకున్నారు. సూచనప్రాయంగా వేషాలు మార్చుకున్నారు. విమానాశ్రయంవైపు బయలుదేరారు. దారిలో ధనార్జనరావును కల్సుకున్నారు. విమానాశ్రయంలో విమానమెక్కారు. విమానం టోక్యోవైపు బయలు దేరింది.

# 5

విమానం పెకింగ్ విమానాశ్రయంలో ఆగింది. యువరాజ్ సూరీలు దిగారు.

పెకింగ్ చైనాదేశపు రాజధాని. ప్రపంచంలో జనాభా ఎక్కువ గల దేశం చైనా. అంతమంది జనాభాలో ఇద్దరు భారతీయులు కల్సిపోవచ్చు. అలా కల్సిపోవడానికి యువరాజ్ సూరీలకు బాగా తెల్సు.

అక్కడ ఎవరికీ స్వేచ్ఛలేదు. వాక్స్వాతంత్ర్యంలేదు. ప్రభుత్వయాజమాన్యం క్రింద ప్రతి ఒక్కరూ మెలగాలి.

యువరాజ్ సూరీలకు ఇప్పుడు స్వేచ్ఛలేదు. చైనా ప్రభుత్వానికి తెలిస్తే ఏంచేస్తారో బాగా తెల్సు. పెకింగ్ విమానాశ్రయంలో కస్టమ్స్ హౌస్‌లో నిలబడ్డారు. యువరాజ్ సూరీల గుండెలు ధమధమ కొట్టుకుంటున్నవి.

టోక్యోలోని భారత రాయబారి ప్రయత్నం మూలంగా డిటెక్టివ్ లిద్దరికీ తగిన పత్రాలు లభించినవి. కమ్యూనిస్ట్ ప్రభుత్వానికి కావాల్సిన పత్రాలను జపాన్ ప్రభుత్వం సృష్టించి ఇచ్చింది.

వర్తకుల్లా వచ్చారు. వర్తకుల్లా పాస్‌పోర్టు లున్నవి. అంతమాత్రంచేత కమ్యూనిస్ట్ దేశాలు నమ్మవు. ఆ విషయం యువరాజ్‌కు తెల్సు. తమని పనిగట్టవచ్చు. ఆలోచిస్తున్నాడు యువరాజ్.

ఫార్మాలిటీస్ ముగించారు.

ఎటువంటి ఇబ్బందీ లేకుండా కస్టమ్స్ హౌస్‌నుండి బయటపడ్డారు. పెకింగ్‌లో ఎటు వెళ్ళాలి? ఎక్కడకు వెళ్ళాలి? పాత మోడలు టాక్సీ లున్నవి. యువరాజ్ ఒక టాక్సీ కేకేశాడు.

"మంచి హోటల్ ఏది?" అడిగాడు సూరి.

"పెకింగ్ క్వీన్?" చెప్పాడు డ్రైవర్.

"ఆ హోటలుకు పద!" అనంటూ యువరాజ్ సూరీలు ఎక్కారు.

టాక్సీ బయలుదేరింది. పెకింగ్ నగర వీధులు విశాలంగానే వున్నవి. అక్కడి ప్రజలు, వాతావరణం విచిత్రంగా వుంది. సైనికులు మూలమూలనూ కాపలా కాస్తున్నారు. ఏటో నడిచివెళ్ళే జనం, పాత మోడల్ కారులు, లారీలు, సిటీ బస్సులు తిరుగాడుతున్నవి. పెకింగ్ రోడలు

మావో సూక్తులతో దర్శనమిస్తున్నవి.

డిటెక్టివ్ లున్న కారు శరవేగంతో పెకింగ్ నగర వీధిలో దూసుకు వెళ్ళుతూంది. ఆ సమయంలో—

ఒక లారీ ఎదురుగా వస్తున్నది. తప్పుకోవడానికి డ్రైవర్ తన ప్రజ్ఞను అంతటినీ వుపయోగించాడు. కానీ లారీ తప్పుకోవడం లేదు. ఎందుకు?

యువరాజ్ గుండెలు గుభేలుమన్నవి.

టాక్సీ డ్రైవర్ ఎంత ప్రయత్నించినప్పటికి లాభంలేక పోయింది. లారీ టాక్సీని భీకరంగా గుద్దుకుంది. టాక్సీ బానెట్ నుజ్జునుజ్జయింది. డ్రైవర్ అక్కడికక్కడే మరణించాడు.

లారీ కారుని గుద్దుకోబోతుందని సూరిని హెచ్చరిస్తూ డోర్ తెరచి బయటకు గెంతేశాడు యువరాజ్. అలా గెంతిన యువరాజ్ శరీరం రోడ్ మీద దొర్లింది. యువరాజ్ కళ్ళు బైర్లుకమ్మాయి. ఆ దెబ్బలను యువరాజ్ భరించలేకపోయాడు. క్రిందపడ్డ యువరాజ్ లేవలేక పోయాడు.

సాయుధులగు వ్యక్తులు యువరాజ్‌ని చుట్టుముట్టే కారు. అతడిని పైకి లేవనెత్తారు.

యువరాజ్ తల విదిలించుకుంటూ తనని పట్టుకున్న వ్యక్తులను చూశాడు. వాళ్ళంతా సైనికులు. తనని ఎందుకు పట్టుకున్నారు? తనని గుర్తుపట్టారా? యువరాజ్ గుండెలు గుబగుబలాడిపోయాయి.

సూరి రక్తపుమడుగులో పడివున్నాడు. యువరాజ్ తల్లడిల్లిపోయాడు. కారునుండి సూరి దుమికేటప్పుడు బాగా గాయాలు తగిలాయి. అచేతనంగా పడివున్నాడు. సూరిని రక్తంతో చూడగానే యువరాజ్‌కు దుఃఖం పెల్లుబికింది. యువరాజ్ శిలాప్రతిమలా నిలబడి వుండిపోయాడు.

క్రింద పడివున్న సూరిని కొందరు వ్యక్తులు ఎటో తీసుకెళ్ళుతున్నారు. ఎక్కడకు? సూరిని ఏం చేస్తారు? యువరాజ్‌కు అంతు చిక్కలేదు.

"ఎవరు మీరు? నన్నెందుకు బంధించారు?" అనడి గాడు యువరాజ్. అలా అడగడానికి కమ్యూనిస్టు రాజ్యాలలో మనిషికి హక్కులేదు. స్వేచ్ఛలేదు. తన పొరబాటు వెంటనే గ్రహించుకున్నాడు యువరాజ్.

యువరాజ్ మీ రెవరని ఎప్పుడైతే అడిగాడో అప్పుడే — యువరాజ్‌ని నెట్టుకుంటూ, చైనా భాషలో కేకలేస్తూ బయలుదేరారు. తనని ఏం చేస్తారు? ఎక్కడకు తీసుకెళ్ళుతున్నారు? యువరాజ్‌కు అయోమయంగా వుంది.

సూరిని ఏం చేస్తారు? సూరిని కాపాడుకునే దెలా? సైనికుల మధ్యవున్న యువరాజ్ ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

ఒక పాత డొక్కు కారులోకి యువరాజ్‌ని ఎక్కించారు. కారు బయలుదేరింది. పెకింగ్ నగర భవంతులు బాగానే వున్నవి. చైనా చరిత్ర ప్రపంచ ప్రసిద్ధి పొందినది.

ఒక భవనం ముందు యువరాజ్ వున్న కారాగింది. లోనికి గొనిపోయారు. ఆ గది విశాలంగా వుంది. ఎత్తైన గోడలు. కిటికీలు లేవు. చాలా ఎత్తులో వెంటిలేటర్లు వున్నవి.

యువరాజ్‌ని లోనకు నెట్టారు. యువరాజ్‌కు నాల్గు వైపులా నల్గురు వ్యక్తులు నిలబడ్డారు.

"ఎవరు నువ్వు? చెప్పు!" అని ఒకడు గద్దించాడు.

"నేను టోక్యోనుండి వచ్చాను" అనంటూ యువరాజ్ తన జేబులోవున్న పత్రాలను అందించాడు.

"ఇవన్నీ కల్పితాలు. మీరు టోక్యో నగరం రాగానే మా ఏజంట్లు పసిగట్టారు. మీరు భారత రాయబారి కార్యాలయంకి వెళ్ళడం_ ఆ తరువాత పెకింగ్ రావడం జరిగింది," అని మరొకడు అన్నాడు.

"మీ రెవరు?" ప్రశ్నించాడు యువరాజ్.

"చైనా ప్రభుత్వ స్పెషల్ బ్రాంచ్ ఏజంట్లము. పేరుమోసిన గూఢచారులం. మా గూఢచారులు లేని దేశం లేదు."

"నామీద ఎందుకు అనుమానం కల్గింది?"

"మా సిక్త్స సెన్స చెప్పింది. ఎవరు మీరు? పెకింగ్ ఎందుకు వచ్చారు?" అని వురిమాడు.

యువరాజ్ నిజం చెప్పలేదు. చెప్పకూడదు. అలా చెప్తే జరగబోయే పరిణామం కళ్ళముందు మెదులు తూంది.

"కలప వ్యాపారస్తుణ్ణి! బిజినెస్ మీద వచ్చాను" అని దృఢంగా చెప్పాడు యువరాజ్.

"అబద్ధం! సర్వఅబద్ధం" అనరిచాడు ఒకడు. అంతే_ ఇంకొకడు ఈడ్చి యువరాజ్ గడ్డంమీద తన పిడికిలితో గుద్దాడు. యువరాజ్ తూలిపడ్డాడు. ఆ విధంగా ఆ నల్గురు చెప్పమని యువరాజ్‌ని హింసించడం ప్రారంభించారు.

యువరాజ్ ఆరడుగుల మూడంగుళాలు పొడవు. పొడవుకు తగిన లావు. లావుకు తగిన ఇనుపకండరాలు, వుక్కునరాలు. వజ్ర శరీరం. ఆజానుబాహువు. భారీ విగ్రహం. బలమైన చేతులు. తేజోవంతమైన నేత్రాలు.

వారి యిష్టమొచ్చినట్టు యువరాజ్‌ని కొట్టుతున్నారు. యువరాజ్ తూలి తూలి పడిపోతున్నాడు. ఆ హింసను భరించలేక తిరగబడ్డాడు. ఆ నలుగుర్ని తన బలంతో,

తను నేర్చుకున్న విద్యలతో ఎదుర్కొన్నాడు. తన చాకచక్యాన్ని వుపయోగించాడు. హోరాహోరీగా పోరాటం ప్రారంభమయింది.

యువరాజ్ తలమీద బలమైన దెబ్బ తగిలింది. ఎవరు ఎలా కొట్టారో యువరాజ్‌కు తెలియదు. స్పృహపోగానే క్రింద పడిపోయాడు యువరాజ్.

# 6

కళ్ళు తెరిచాడు సూరి. అటు యిటు చూశాడు. తనిప్పుడు ఎక్కడున్నది గుర్తుకు రాలేదు. కాసేపు తరువాత జ్ఞాపకం వచ్చింది, తను పెకింగ్ నగరంలో వున్నట్టు!

యువరాజ్, తను టాక్సీలో వెళ్ళుతూంటే ఎదురుగా లారీ రావడం, లారీ ఢీకొట్టుకుంటుందని గ్రహించిన యువరాజ్ తనని హెచ్చరించి దుమకడం తనకు తెల్సు. తను దుముకు సమయంలో బూటుకాలు డోర్‌కు తగిలింది. అంతే క్రింద పడిపోయాడు. ఆ తరువాత ఏం జరిగింది తనకు తెలియదు.

తలకు బాండేజ్ చుట్టబడివుంది. కాళ్ళకు చేతులకూ వుంది. అంటే బలమైన గాయాలు తగిలి వుండాలి. కాని అంత బాధ అనిపించలేదు. తనని ఎవరు తెచ్చారు? ఎవరు చికిత్స చేశారు? ఒకవేళ యువరాజ్ తెచ్చాడా? అని ఆలోచిస్తున్నాడు సూరి.

గాజుల చప్పుడు వినబడింది.

సూరి వులిక్కిపడ్డాడు. దయ్యమనీ కాదు. భూతమనీ కాదు. అది చైనాదేశం. పెకింగ్ నగరంలో వున్నాడు. చైనా స్త్రీలు గాజులు తొడుక్కుంటారా? గాజుల చప్పుడు వచ్చినవైపు సూరి తన తలను తిప్పిచూశాడు.

ఒక హిందూ స్త్రీ నిలబడి వుంది. నిండుగా చీర కట్టుకుని వుంది. నొసట రూపాయంత కుంకుమ బొట్టు తళతళ మంటూంది. ఆమెలో చైనా స్త్రీల పోలిక అంతగా లేదు. భారతీయ వనితలాగుంది. యౌవ్వనంలో వుంది.. అందమైన ముఖం. కన్నార్పకుండా ఆమెను చూశాడు సూరి.

ఆమె_ సూరి తనని చూస్తున్నాడని గ్రహించి, భయపడిపోయి, ఖంగారుగా లోనికెళ్ళిపోయింది.

సూరి ఆశ్చర్యానికి అంతులేదు.

తనని చూసి ఎందుకు భయపడింది? ఆమెవరు? తనకి ఎందుకు శుశ్రూష చేసింది? సూరికి అంతుపట్టలేదు. అది చాలా చిన్న యిల్లు. పొందికగా వుంది. సూరి పరిపరి విధాల ఆలోచిస్తూ పడుకుని వున్నాడు.

ఆ వనిత చైనా స్త్రీలా తయారై తిరిగి సూరి మంచం దగ్గరకు వచ్చింది.

సూరి రెండు నిముషాలు తదేకంగా చూసి, "మీరెవరండి? నేనెలా యిక్కడకు వచ్చాను?" అనడిగాడు.

"నేను హిందూ స్త్రీని!" అని చెప్పిందామె.

సూరి అదిరిపడి పోయాడు. చైనాలో హిందూ స్త్రీ వుండడమేమిటి? చైనాకు ఆమె ఎలా వచ్చింది? ఏమిటీ విచిత్రం?

"చైనాకు ఎలా వచ్చారు?" అనడిగాడు సూరి ఆశ్చర్యంగా.

"మా పూర్వీకులు ఎప్పుడో వలస వచ్చారు. వారి సంతతిని! నాకు హిందూదేశమన్నా, హిందూ ధర్మమన్నా అమితమైన ప్రేమ!! చాటుగా నేను అప్పుడప్పుడు హిందూ స్త్రీలా అలంకరించుకుని సంతోషపడుతూ వుంటాను" అని చెప్పిందామె.

"మీ అమ్మా నాన్నలు లేరా?"

"వున్నారు. ఉద్యోగరీత్యా బయట వెళ్ళివున్నారు. ఇండియాకు పారిపోయి రావలయునని కలలు కంటూనే వున్నాం. వీలు కావడంలేదు. ఇక్కడి ప్రభుత్వం, మనుషులు, ముమ్మలను నానా హింసలూ పెట్టుతున్నారు," అని వేదనతో చెప్పిందామె.

"ఇప్పుడు మీరు కట్టుకున్న చీరను ఎందుకు విప్పేసి ఈ డ్రస్ కట్టుకున్నారు?"

"మీరు సైనియులేమోనని భయపడ్డాను. నేను హిందూ స్త్రీ వేషంలో వుంటే సైనియులు చూస్తే ప్రాణాలతో వదిలిపెట్టరు. అందుకని భయపడ్డాను."

సూరికి అరమయింది.

"నన్నిక్కడకు ఎందుకు ఎలా తీసుకొచ్చారు?" అడిగాడు సూరి.

"కొందరు సైనికులు మిమ్మలను మోసుకొచ్చి ఈ వీధి చివర పడేసి వెళ్ళిపోయారు. మీరెవరో నాకు తెలియదు. తోటి మానవుడు రక్తంతో తడిసి వుంటే చూళ్ళేక పోయాను. నా మనసు ఒప్పుకోలేదు. నేను మిమ్మలను తీసుకురావడం సైనికులు చూస్తే నన్ను ప్రాణాలతో వదిలిపెట్టరు. కానీ- ధైర్యం చేశాను. మిమ్మలను మా యింటికి తీసుకవచ్చాను" చెప్పిందామె.

"హృదయపూర్వకంగా కృతజ్ఞతలు అందజేస్తున్నానండి. దయ, జాలి లేనిచో మానవజాతే అంతరిస్తుంది. దయ, జాలి-హిందూ ధర్మంలో నిండుగవున్నవి. ఆ సంతతికి చెందిన మీలో నిబిడీకృతమయిన జాలికి, కరుణాశ్రీ హృదయానికి నా జోహార్లు" అని సూరి పొగిడాడు.

"ఎక్కువ పొగడకండి" సిగ్గుపడిందామె.

"పొగడడం కాదండి. చైనీయుల మధ్య హిందువు-హిందువులా వున్నందుకు గర్వపడుతున్నానండి" చెప్పాడు సూరి.

"మీరెవరు? ఎందుకు వచ్చారు?" అడిగిందామె.

"నేను భారతీయుడ్ని. ఆంధ్రుణ్ణి!!"

"ఎందుకు వచ్చారు?"

సూరి తటపటాయించాడు. నిజం చెప్పాదామా? ఒద్దా? ఆమె తనని ఆదరించి శుశ్రూష చేసింది. కపట హృదయురాలైతే యిలా చేస్తుందా? కాని చెప్పడం మంచిది కాదేమో?

"మీకెందుకులెండి!"

"చెప్పండి ఫరవాలేదు. నేనూ భారతీయురాలిని. మాతృదేశానికి ద్రోహం చేయను. మీరింత దూరం ప్రాణాలను తెగించి వచ్చారు. వీలైతే నాకు తోచిన సహాయం చేస్తాను" అని చెప్పిందామె.

"నేను ఒక్కడినే మీకు కనబడ్డానా? మరెవరయినా నా ప్రక్కన వున్నారా?" అడిగాడు సూరి.

"ఎవరూ లేరండి. మీరొక్కరే వున్నారు."

సూరి గుండెలు ఝల్లుమంది. యువరాజ్ ఏమయ్యాడు? ఆయన ప్రమాదానికి గురయ్యాడా? సూరి భయపడి పోయాడు.

"నా ప్రక్కన డిటెక్టివ్ యువరాజ్ వుండాలి. ఏమయ్యాడు?"

"మీరెందుకు ప్రమాదానికి గురయ్యారు?"

"మేము వెళ్ళే టాక్సీని ఒక లారీ గుద్దుకుంది. ఆ ప్రమాదంలో యువరాజ్, నేను వేరుపడిపోయాం" చెప్పాడు సూరి. అదురుబెదురులతో ఆమెను చూస్తూ

"ఆయన ఎక్కడ వుంటాడు?" ఖంగారుగా ప్రశ్నించాడు సూరి.

"ఏమో? యువరాజ్ సంగతి తరువాత చూద్దాం. మీరెందుకు వచ్చారు?" అడిగిందామె.

"నేను యువరాజ్ అసిస్టెంట్ని. మన భారతదేశం నుండి దిగ్విజయం అనువ్యక్తిని అపహరించుకు వచ్చారు. చైనీయులే ఆ పని చేశారని తెల్సి అన్వేషిస్తూ వచ్చాం," అని చెప్పాడు సూరి.

ఆమె ఫకాలున నవ్వింది. ఆ నవ్వు వెనుక దాగివున్న విషం వెల్లబికింది. గంభీరంగా నవ్వుతూంది. సూరికి అగమ్యగోచరంగా వుంది. ఆమె నవ్వును బట్టి, ఆమె గూఢచారుల మనిషని సూరి గ్రహించాడు!!

ఆమె నవ్వుతూనే చేతులు తట్టింది. అంతే—

ఆ ఇంట్లో దాగివున్న ఆరుమంది వ్యక్తులు పిస్తోళ్ళు పట్టుకుని సూరికి గురిచూపుతూ చుట్టుముట్టారు. సూరి అపాయాన్ని గుర్తించాడు. శత్రువుల పథకంలో అవలీలగా తను చిక్కుకున్నందుకు తనని తాను నిందించుకున్నాడు సూరి.

వాళ్ళు తనని నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు.

## 7

డిటెక్టివ్ యువరాజ్ కళ్ళు తెరిచాడు. క్రింద అచేతనంగా పడివున్నాడు.

యువరాజ్ కెదురుగా నలుగురు ఆసీనులై, చేతులలో పిస్తోళ్ళు పట్టుకుని వున్నారు.

ఎక్కడో ఫోన్ మ్రోగిన చప్పుడయింది. యువరాజ్ అలా చెవులు రిక్కించి పెట్టివున్నాడు. క్లిక్ మన్న చప్పుడు. ఫోన్లో వింటూన్నపుడు ఉఁ ఉఁ అంటూన్న

ధ్వని వినబడుతూంది. కాసేపటికి ఫోన్ పెట్టిన చప్పుడు వినబడింది. యువరాజ్ ఏం జరుగుబోతుందో ఎదురు చూస్తున్నాడు.

"కామ్రేడ్స్! ఇతను డిటెక్టివ్ యువరాజ్! భారత దేశంనుండి వచ్చినవాడు. దిగ్విజయం ఎక్కడున్నది ఆచూకీ తెల్సుకుని తీసుకుని వెళ్ళడానికి వచ్చినవాడు. ఈ విషయం ఇప్పుడే ఇతని అసిస్టెంట్ సూరి చెప్పాడట! ఇతనిని వెంటనే చంపేయమని ఆజ్ఞ వచ్చింది" అని చెప్పాడు.

యువరాజ్ గుండెలు ఆవిశించిపోయాయి. గడగడ లాడిపోయాడు. సూరి ఎందుకు చెప్పాడు? సూరి ఇప్పుడు ఎక్కడున్నాడు? ఇంత నిజం చెప్పాడంటే శత్రువులు ఏదో మోసం చేసివుంటారు? సూరి అపాయంలో వున్నాడా?

ఆ వ్యక్తులు యువరాజ్ వద్దకు వస్తున్నారు.

యువరాజ్ మనసు చకచక ఆలోచిస్తూంది.

పిస్తోళ్ళు పట్టుకున్న నలుగురు వ్యక్తులు యువరాజ్ పడివున్న చోటుకు వచ్చారు. వరుసగా నిలబడ్డారు. నలుగురు తమ పిస్తోళ్ళను యువరాజ్ కు గురిపెట్టారు. యువరాజ్ గడగడ వణికిపోతున్నాడు. ఇక కొద్ది సేపటికి తన ప్రాణాలు పోతవి. వాళ్ళ చేతులలో ప్రాణాలు వదలడంకంటే ధైర్యంగా ఎదిరించి మరణించాలను కున్నాడు.

"మిస్టర్ యువరాజ్! మీరు చెప్పనంత మాత్రాన తెల్సుకోలేము అనుకోకండి. మీరు చైనా ఎందుకు వచ్చారో మాకు తెలిసిపోయింది. ఇక మీరు బ్రతికి వుండకూడదు" అనంటూ పిస్తోలు యువరాజ్ గుండెలకు గురిపెట్టాడు ఒకడు. మిగతా ముగ్గురూ అదే విధంగా గురిపెట్టారు.

యువరాజ్ నోటిలో తడారిపోయింది. వళ్ళంతా జలదరించిపోతూంది.

ఒక్క పార్లింపు పార్లాడు. ఆ పార్లింపులో అయిదు ఏనుగుల బలముంది. పార్లగానే పిస్తోళ్ళు పేలాయి. గురి తప్పడం మూలంగా గుళ్ళు తగలలేదు. అలా పార్లిన యువరాజ్ ఇంకా బలాన్ని కూడకట్టుకుని, వరుసగా నిలబడ్డ వ్యక్తుల కాళ్ళను భయంకరంగా ఢీకొట్టుకున్నాడు.

రోడ్ రోలర్ కమ్మినట్టయింది. నలుగురూ తూలి పడ్డారు. ఇద్దరు ముందుకు పడ్డారు. ఇద్దరు వెనుకకు పడ్డారు. ఆ అదనుచాలు. యువరాజ్ స్ప్రింగ్ లా లేచాడు. లేచినదే తడవు ఆ వ్యక్తుల చేతులలోని పిస్తోళ్ళను ఎగురకొట్టేశాడు. హెర్క్యులెస్ లా ఢీకొన్నాడు.

ఆ వ్యక్తులు సామాన్యులు కారు. ఆరితేరినవారు. కండలు తిరిగిన శరీరాలు. భయంకర స్వరూపులు.

యువరాజ్ మీదికి విరుచుకు పడ్డారు. తనొక్కడు ఆ నల్గుర్ని పడగొట్టడం అసాధ్యమైన పని. కానీ యువరాజ్ జూడో, ఫైట్ ని-కేరళ కళరి విద్యను-మల్లయుద్ధ ప్రవీణతను వుపయోగించి ఆనలుగురికి సమాధాన మిస్తూన్నాడు. అయినా వీలుకావడంలేదు.

ఆ వ్యక్తులు మొరటుతనంగా విజృంభిస్తున్నారు. యువరాజ్ అలసిపోతున్నాడు. సమయం చూశాడు. ఆ నలుగురితో పోరాడలేక చివాలున ఆ గదిలోనుండి బయటకు గెంతి తలుపుమూసి గొళ్ళెం పెట్టేశాడు.

తలుపును దబదబ బాదుతున్నారు. ఆ శబ్దానికి అక్కడకు మరెవరయినా రావచ్చు! అనుకుంటూ యువరాజ్ ముందుకు కదిలాడు.

లోనవున్న వ్యక్తులు తలుపును బాదు చప్పుడుకు బయటవున్న సైనికులు ఇద్దరు వస్తున్నారు. యువరాజ్ అక్కడొక స్తంభం చాటున నక్కి నిల్చున్నాడు. ఆ వ్యక్తులను వదిలితే తలుపుతోస్తారు. తలుపు తోస్తే తనని వాళ్ళు పట్టుకోవచ్చు. అందుకు అవకాశం యివ్వకూడదు.

యువరాజ్ ఊపిరి బిగపట్టి నిలబడ్డాడు. ఆ సైనికులు దగ్గర పడగానే, గురిచూసి కొట్టవలసినచోట కొట్టే శాడు. కిక్కురుమనకుండా పడిపోయారు. యువరాజ్ క్షణం ఆలస్యము చేయలేదు. ఆదరాబాదరా బయటకు వచ్చాడు.

పెకింగ్ లోని ఒక వీధి అది!

పేవ్ మెంట్లమీద చైనీయులు బారులు తీరి నడుస్తున్నారు కార్లు హారను పెడుతూ పరుగెత్తుతున్నవి. లారీలు, సిటీ బస్సులు-టాక్సీలు సందడిగా దూసుకు వెళ్ళుతున్నవి. అక్కడి ప్రజలలో ఏదో వింత గోచరి స్తూంది. ఎందుకనో అందరూ మౌనంగా వుంటున్నారు. ఒకర్ని మరొకరు పలుకరించడం లేదు. నిశ్శబ్దంగా నడుస్తున్నారు. యువరాజ్ ఆ జనంలో కల్సిపోయి నడవడం ప్రారంభించాడు. నడుస్తున్నాడన్నమాటే గాని ఆయన దృష్టి అంతా సూరిమీద అగ్నమైవుంది. సూరి ఎక్కడుంటాడు? శత్రువులకు నిజం ఎందుకు చెప్పాడు? సూరిని తెల్సుకునేదెలా? ఆలోచిస్తూ యువ రాజ్ నడుస్తున్నాడు.

నడిచే యువరాజ్ తిరిగి చూశాడు. ఆశ్చర్యం!—

అల్లంత దూరంలో సైనికులు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. సైనికులను చూచిన ప్రజలు తప్పుకుంటున్నారు. సైనికులను చూడగానే యువరాజ్ గుండెలు గడగడ లాడాయి.

ఈ దఫా సైనికులు తనని పట్టుకుంటే నడివీధిలోనే కాల్చి పారేస్తారు. యువరాజ్ గబగబ నడవడం ప్రారంభించాడు.

అప్పుడే ఏదో ఫ్యాక్టరీ కార్మికులు తమ షిఫ్ట్ ముగించుకుని గుంపుగా వచ్చారు. ఆ గుంపులో చేరిపోయాడు. ఆ కార్మికులు దాదాపు మూడువందల మంది వుంటారు. ఆ మూడువందల మందిని కొందరు సైనికులు చుట్టిముట్టి ఎటో తీసుకెళ్ళుతున్నారు. ఎక్కడకు? దేనికి? యువరాజ్ వూహా కందలేదు.

ఆ నగర మధ్యలో ఒక మైదానముంది. ఆ మైదానంలోకి కార్మికులందరూ చేరుకున్నారు.

కొందరు సైనికులు కార్మికులకు 'సైనిక శిక్షణ' ఇవ్వడం ప్రారంభించారు. యువరాజ్ ఆశ్చర్యానికి అంతులేదు.

రష్యా-అంటే-పగ ద్వేషం పుట్టిపడే నినాదానాలు చేస్తూ కార్మికులు సైనిక శిక్షణ పొందుతున్నారు.

"రేపటి రోజునే రష్యాతో యుద్ధం సంభవించవచ్చు! అందుకని ఈ రోజే మీరంతా సిద్ధంగా వుండాలి" అని సైనికాధికారులు ఘోషిస్తున్నారు. కార్మికులు శిక్షణ పొందుతున్నారు. యువరాజ్ విస్తుపోతున్నాడు. రష్యా సోదర కమ్యూనిస్ట్ దేశం. మరి మావోకు సోవియట్ యూనియన్ అంటే ద్వేషమెందుకు? యువరాజ్‌కు అంతుపట్టలేదు.

సైనిక శిక్షణ సుమారు రెండు గంటలసేపు సాగింది. ఆ శిక్షణలో యువరాజ్ కూడా పాల్గొన్నాడు.

ప్రతి కార్మికుడూ తమపని ముగియగానే తప్పనిసరి రెండు గంటలసేపు సైనిక శిక్షణ పొంది తీరాలన్నది ఆ దేశనాయకుల జులుం!! అంటే ప్రతి వ్యక్తిని చైనా-సైనికునిలా తయారు చేయడంలో మునిగివుందని యువరాజ్

గ్రహించాడు.

ఇపుడు తనెలా బయట పడడం? సూరి ఎక్కడ వుంటాడు? దిగ్విజయాన్ని చైనీయులు ఎక్కడ బంధించి వుంటారు? తెల్సుకునేదెలా? యువరాజ్ ఆలోచిస్తున్నాడు. ఆ సమయంలో—

కార్మికులను సాయుధులగు వ్యక్తులు కొందరు చుట్టుముట్టేశారు. ప్రతి కార్మికుడిని పరిశీలనగా చూస్తున్నారు. యువరాజ్ కు బోధపడిపోయింది. తన కొరకు వెదుకుతున్నారా? తను వాళ్ళ చేజిక్కితే ప్రాణాలతో బయట పడడం అసాధ్యం!

సైనికులు కార్మికులను చూసుకుంటూ వస్తున్నారు.

# 8

ఆరు పిస్తోళ్ళు సూరిని హుంకరిస్తూ గురి చూస్తున్నవి!

బెడ్ మీద కూర్చునివున్న సూరి గుండెలు జలదరించి పోతున్నవి. ధమధమ కొట్టుకుంటున్నవి. కొద్ది సేపటిలో ఆరు పిస్తోళ్ళు పేలుతాయి! ఏం చేయాలి? సూరి అదురు బెదురులతో ఆ పిస్తోళ్ళవంక చూశాడు.

అందరూ ఒకే తడవ ట్రిగ్గరు అదమబోతున్నారు.

సూరి బోర్లాపడిపోయి మంచం క్రిందకు దూరేశాడు. అదే సమయానికి పిస్తోళ్ళు ధమధమ పేలాయి. సూరిని మంచం పిస్తోళ్ళ బారినుండి కాపాడింది.

సూరి తటాలున మంచాన్ని ఒకవైపు పైకిలేపాడు.

ఆ మంచం సూరికి కవచంలాగుంది. సూరికి గుళ్లు తగలవు. కానీ— సూరికి ముచ్చెమటలు పోస్తున్నవి. గుండెలు వేగంగా దడదడలాడుతున్నవి. వళ్ళంతా భయంతో తేలియాడిపోతూంది.

ఆ వ్యక్తులు మంచాన్ని పట్టుకుని లాగడానికి ప్రయత్ని

స్తున్నారు. సూరి తన బలాన్నంత కూడకట్టుకుని ఒక్క వూపు వూపుతూ ఆ ఆరుగురిమీద పడిపోయాడు.

అందరూ క్రిందా మీదా పడిపోయారు.

సూరిని మోసంచేసిన యువతి_ సూరి చేయు సాహసానికి నోరు తెరిచి తిలకిస్తూంది. అందరూ పడిపోగానే సూరి ఆలస్యం చేయలేదు. ఒక్క గెంతు గెంతాడు. ఆ యువతిముందు నిలబడి ఈడ్చి ఆమె గడ్డంమీద కొట్టాడు. వక్షేలున పడిపోయింది. ఆమె పెదాలు చిట్లి నెత్తురు కారుతూంది. అచేతనంగా క్రిందపడిపోయింది.

ఆరుగురు ఆదరాబాదరా లేస్తున్నారు. కేకలెట్టుతున్నారు. ఆగమని అరుస్తున్నారు. సూరి లేడిలా గెంతి బయటపడి, రోడ్డుమీద పరుగెత్తడం ప్రారంభించాడు.

గుండెల్లో రెళ్లు పరుగెత్తుతున్నవి. వాళ్లు తప్పక తనని తరుముకు వస్తారు. పరుగెత్తే సూరిని రోడ్డుమీది జనం విచిత్రంగా చూస్తున్నారు. తనిక పరుగెత్తడం శ్రేయస్కరం కాదు. తలకు బాండేజ్ వుంది. చేతులకు కాళ్ళకూ వుంది. పరుగెత్తుతూనే సూరి బాండేజ్‌ని తీసేశాడు. ఆశ్చర్యం! —

బాండేజ్ వున్న చోట గాయాలులేవు. మరెందుకు బాండేజ్ కట్టారు? తనకెందుకు స్పృహ లేదు? టాక్సీ ఆక్సిడెంటులో తనకు గాయాలు తగలలేదా? తనని నమ్మించడానికి బాండేజ్ కట్టారని నిర్ణయించుకున్నాడు సూరి.

పరుగెత్తే సూరిని రోడ్డుమీద నడిచేవారు వింతగా చూస్తున్నారు. అల్లంత దూరంలో సైనికులు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. సూరి గుండెలు ఝల్లుమంటున్నవి. ఎలా? ఇప్పుడేం చేయాలి? అలా నడిచే సూరికి కుడివైపున చిన్న సందు గోచరించింది.

ఆ సందులోకి తృటిలో దూరాడు. గబగబ నడవడం

ప్రారంభించాడు. చైనీయుల ముఖాలలో కళ లేదు. అందరూ ఏదో బాధకు లోనయినట్లు గోచరిస్తున్నారు.

సూరి అలా నడిచివెళ్ళగానే ఒక మైదానం వచ్చింది. ఆ మైదానంలోని కార్మికులను కొందరు సైనికులు తనిఖీ చేస్తున్నారు. ఎందుకు? యువరాజ్ వున్నాడా? ఆ కార్మికులను పరికించి చూశాడు.

కార్మికులందరిని సైనికులు వదిలిపెట్టేశారు. అందరూ తమతమ ఇళ్ళకు బయలుదేరారు. యువరాజ్ అందరితో కల్సి బయలుదేరాడు. సూరి అదనుచూసి ఆ కార్మికులలో కల్సిపోయాడు.

ఇంతలో సూరిని తరుముకుంటూ వచ్చిన వ్యక్తులు మళ్ళీ ఆ కార్మికులను చుట్టుముట్టేస్తున్నారు.

యువరాజ్, సూరికి కన్ను గీటాడు. అంతే, సూరి మెల్లిగా జారుకునేశాడు. యువరాజ్ కూడా జారుకునే శాడు. ఆ డిటెక్టివ్ లిద్దరూ అలా తప్పుకోడానికి దోహద మిచ్చింది కార్మికులే!

మళ్ళీ సైనికులు చుట్టుకోగానే విసుగు చెందిన కార్మికులు గందరగోళంగా అరుస్తూ అటు యిటు వురికారు. సైనికులు అదుపులో పెట్టడానికి ప్రయత్నించేటప్పుడు యువరాజ్ సూరీలు తప్పుకునేశారు. అదృష్టం కల్సి రావడం మూలంగా డిటెక్టివ్ లిద్దర్ని సైనికులెవరూ చూడలేదు.

గబగబ నడుస్తూ ఇద్దరూ కల్సారు. ఆ విధంగా కల్సి మాట్లాడకూడదు. స్నేహం చేయడానికీ కమ్యూనిస్ట్ రాజ్యాలలో నిబంధన లున్నవి. రోడ్డుమీద బహిరంగంగా మాట్లాడితే సైనికులు బంధించవచ్చు. యువరాజ్ సూరీలు మౌనంగా దూర దూరంగా నడిచారు. నడుస్తున్నారు.

రోడ్డుమీద వాహనాల రద్దీ తగ్గుముఖం పట్టింది.

నిర్మానుష్యమైన చోటు రాగానే ఇద్దరూ కలిశారు. మెల్లగా మాట్లాడుకోవడం ప్రారంభించారు.

సూరి తనకు జరిగింది చెప్పి నొచ్చుకున్నాడు.

యువరాజ్ తనకు జరిగింది చెప్పాడు.

"దిగ్విజయం ఎక్కడ వుంటాడని మీరూహిస్తున్నారు?" అడిగాడు సూరి.

"రష్యా, చైనా సరిహద్దు ప్రాంతాలలో వుంచి వుంటారు. ఎందుకంటే చైనాపై దాడికి సోవియట్ యూనియన్ కుట్రపన్నుతున్నదని చైనా ప్రజలలో దుష్ప్రచారం లేవనెత్తి పెకింగ్ నాయకులు యుద్ధ సన్నాహాలు భారీ ఎత్తున్న చేయడం ప్రారంభించి చాలా రోజులైంది. కనక రష్యామీద దండయాత్ర చేయడానికి చైనా అన్ని ఏర్పాట్లను సమకూర్చుకుంది" అని చెప్పాడు యువరాజ్.

"అయితే,మనమిప్పుడెటు వెళ్ళాలి?"అడిగాడు సూరి.

"ఉత్తర చైనా ప్రాంతాలలో చైనా యుద్ధసన్నాహం తీవ్రస్థాయి నందుకుని వుంది. అంతేకాక ఈశాన్య, వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో కూడా చైనా యుద్ధం చేయడానికి తయారుగా వుంది. గనుక దిగ్విజయాన్ని సరిహద్దు ప్రాంతాలకు తరలించి వుంటారు. సరిహద్దు ప్రాంతాల మాప్ ను చూపి, మాప్ ప్రకారం వ్యూహాలు పన్నమని సైనికాధికారులు బలవంతం చేయవచ్చు. దిగ్విజయం వ్యూహం పన్నితే రష్యాతో చైనీయులు తలపడవచ్చు" అని చెప్పాడు యువరాజ్.

"ఇప్పుడు ఎలా వెళ్ళాలి? మనం చైనాలోకి ప్రవేశించినట్లు చైనా ఏజంట్లకు తెలిసిపోయింది. ఇక సైనిక రంగానికి తెల్సిపోయి వుంటుంది. దిగ్విజయాన్ని కను

గొనడానికి మనం వచ్చామని-దిగ్విజయాన్ని ఇంకా కట్టు దిట్టమైనచోట పదిలపరచవచ్చు' సూరి చెప్పాడు.

యువరాజ్ మౌనంగా తలవంచుకుని నడుస్తున్నాడు.

# 9

చీకటి పడిపోయింది. ఎక్కడకు వెళ్ళాలో ఏం చేయాలో అంతుపట్టలేదు. ఆ రాత్రికి ఎక్కడో ఓచోట తలదాచుకోవాలి. రష్యా సరిహద్దు ప్రాంతానికి ఎటు వెళ్ళాలో ఆలోచించాలి.

రోడ్డుకు కాస్త దూరంలో ఒక యిల్లువుంది. ఆ యింటి వైపు నడిచారు. యువరాజ్ సూరీలు ఆ యింటిముందు నిలబడి, కేకేసారు.

"ఎవరూ?" అనంటూ ఒకతను బయటకు వచ్చాడు. అతనికి 30 సంవత్సరాలు వుంటాయి, పొడుగుకు తగ్గ లావు. లావుకు తగిన శరీరం.

"ఈ రాత్రికి మేమిద్దరం మీ యింట్లో వుండవచ్చా?" అడిగాడు యువరాజ్.

"వీలు పడదు. మన దేశంలో మన మనుకున్నచోట నివసించకూడదు. మనకు యిష్టమయిన పనిని చేయ కూడదు. మన ప్రభుత్వం ఎక్కడ వుండమంటుందో అక్కడ వుండాలి. ప్రభుత్వం ఏం పని చేయమంటుందో ఆ పని చేయాలి. మీకు తెలియదా?" అడిగాడతను.

యువరాజ్ కు ఆ విషయం తెల్సు. చైనాలో ఒక వ్యక్తి తానను కున్నచోట నివసించలేడు.

"తెల్సు. చీకటిపడిపోయింది" చెప్పాడు యువరాజ్.

"చీకటి పడిపోతే హోటలుకు వెళ్ళండి."

"హోటలులో గదులు ఖాళీలు లేవు."

"నేనొక ప్రభుత్వ వుద్యోగిని! మీబోటి వారికి

ఆశ్రయం యిస్తేనా పైఅధికారులు వూరికే వదిలిపెట్టరు."
"మేమిద్దరం మీ యింట్లో అతిరహస్యంగా దాగుడని విశ్రాంతి తీసుకుంటాం. మావలన మీ కేటువంటి యిబ్బందీ కలగదు."
"ఇంతకీ మీ రెవరు?"
"లోనికి పదండి చెప్తాను" అనంటూ యువరాజ్ అతనింట్లోకి ప్రవేశించాడు. అతను ప్రభుత్వ వుద్యోగని చెప్పాడు. ఏ వుద్యోగి? ఆలోచిస్తున్నాడు యువరాజ్.
"మీరు చేయు వుద్యోగం ఏమిటి?" అడిగాడు యువరాజ్.
"జెట్ ఫైటర్ పైలెట్ ని. సైన్యంలో వుంటున్నాను. వైమానిక దళంలో పైలెట్ ని!" చెప్పాడతను.
"మేమిద్దరం గూఢచారులం! సీక్రెట్ బ్రాంచ్ ఏజెంట్లము. మన ప్రభుత్వ స్పెషల్ బ్రాంచ్ లో వుంటున్నాము. ఇద్దరు భారతీయులు వచ్చారట! వారిని అన్వేషిస్తూ రహస్యంగా తిరుగాడుతున్నాం" అని చెప్పాడు యువరాజ్.
పైలెట్ ఆశ్చర్యంగా యువరాజ్ ని, సూరిని చూశాడు. తబ్బిబ్బైపోయాడు. షేక్ హాండ్ యిచ్చాడు.
"కంగ్రాచ్యులేషన్స్! ముందేమీరు ఎస్.బి.ఏ.కు చెందినవారని చెప్పకూడదా!" అనన్నాడు పైలెట్ చెయ్యి కుదుపుతూ.
"ఫరవాలేదు. మీ రెవరయిందీ తెలియలేదు. అందుకని ముందుగా నేను చెప్పలేదు" అనన్నాడు యువరాజ్.
"కూర్చోండి" అన్నాడు పైలెట్.
"మీ పేరు?" అడిగాడు సూరి.
"ఎన్ సేచింగ్" చెప్పాడు పైలెట్.
యువరాజ్ సూరీలు కూర్చున్నారు. అతిథిమర్యాదలు

చేయడానికి ఎన్ సేచింగ్ తంటాలు పడుతున్నాడు. కొన్ని రొట్టెలు, ఇంతా ఇంతా ఏవేవో తెచ్చాడు. యువరాజ్ నూరీలు ముందు పెట్టాడు. డిటెక్టివ్ లిద్దరూ ఆకలితో వున్నారు. రొట్టెముక్కలను అందుకున్నారు.

"భారతీయులు ఇద్దరు పెకింగ్ మీదకు వచ్చారు? ఎలా వచ్చారు?" అడిగాడు ఎన్ సేచింగ్.

"మన ఏజెంట్లు ఇండియాలోవున్న దిగ్విజయాన్ని ఎత్తుకొచ్చేశారు. దిగ్విజయం కొరకు వచ్చారని మన ఏజెంట్లు పసిగట్టారు."

"ఆఁ నాకు అర్థమయింది. సరిహద్దు ప్రాంతంలో దిగ్విజయాన్ని వుంచి వున్నారు. రష్యాతో యుద్ధం చేయడానికి మన సైనికబలం యావత్తూ సిద్ధంగా వుంది. వ్యూహాలు పన్నడానికి దిగ్విజయాన్ని అక్కడకు తీసుకెళ్ళారని విన్నాను."

యువరాజ్ గుండెలు గడగడ లాడిపోయాయి. తనకేదో అదృష్టం కల్సివచ్చినట్టయింది. దిగ్విజయాన్నెక్కడ దాచారో ఎన్ సేచింగ్ నడిగితే అనుమానపడొచ్చు.

"దిగ్విజయం వ్యూహం పన్నాడంటే రష్యా సైనికులను త్రుటిలో మన సైనికులు జయించ గలుగుతారు" అని చెప్పాడు యువరాజ్.

"అవును. మన వైమానిక దళం కూడా దాడిచేయడానికి దిగ్విజయం వ్యూహానికి యెదురు చూస్తూంది. పెకింగ్ లో వున్న వైమానికదళ సిబ్బంది అంతా రేపు బయలుదేరుతూంది. నేనూ వెళ్ళుతున్నాను. ప్రొద్దున్నే ఎనిమిది గంటలకు ఇక్కడకు కారు వస్తుంది" అని చెప్పాడు ఎన్ సేచింగ్.

"సోవియట్ యూనియన్ని మన చైనీయులు దెబ్బ తీస్తారు" అని యువరాజ్ చెప్పాడు, అతనిని మాటలలో

పెడుతూ.

"అవును. మన చైనా రక్షణమంత్రి సరైనా పథకాలను వేసివున్నాడు. రష్యా ఒక దుర్మార్గమైన దేశం. చైనాను కబళించడానికి ప్రయత్నిస్తూంది. అటువంటి రష్యాను నామరూపాలు లేకుండా చేయాలి. అదే మావో ప్రతిజ్ఞ!" అని చెప్పాడు ఎన్ సేచింగ్.

ఇపుడు చైనాలో రష్యామీద దుష్ప్రచారాలు చేస్తున్నారని యువరాజు వూహించాడు. సరిహద్దు వివాదమంటూ లేపి రష్యామీదకు చైనా ప్రజలను పురిగొలిపి మావో బావుకునేదేమిటో యువరాజ్ కు బోధపడ లేదు. మావో అధికార ప్రాబల్యం మూలంగా ప్రపంచంలోని కమ్యూనిస్టులు చీలిపోయారు, విడిపోయారు. అంటే కమ్యూనిస్టుల బలం తగ్గిపోయిందన్న మాట!

"ఇదో ఈ పాము టోస్ట్ ని తినండి!" అనంటూ ఎన్ సేచింగ్ యువరాజ్ సూరీల ముందుకు ఒక పళ్ళాన్ని పెట్టాడు.

పాము టోస్ట్ అనగానే డిటెక్టివ్ లిద్దరికీ దేవినట్టయింది. బ్రెడ్ ముక్కలనూ మింగలేకపోయారు. వాంతి వచ్చినంత పనయింది. పాములోవున్న విషాన్ని తీసేసి టోస్ట్ చేస్తారని యువరాజ్, సూరీలకు తెల్సు. హాంగ్ కాంగ్ హోటళ్ళల్లోను పాము మాంసాన్ని అమ్ముతారు.

ఎన్ సేచింగ్ అమితానందంతో తినేస్తున్నాడు. యువరాజ్ చూస్తూ ఆగిపోయాడు. బ్రెడ్ మాత్రమే తిన్నారిరువురు. మంచినీళ్ళు త్రాగబోతే ఆ నీళ్లు తేయాకు వాసన వస్తున్నవి. కళ్ళు మూసుకుని తాగి, ఆకలిని చంపుకున్నారా డిటెక్టివ్ లు.

"మీరు ప్రొద్దున్నే ఏడుగంటలకే వెళ్ళిపోవాలి. కారు వస్తుంది. కారులో నేను విమానాశ్రయం వెళ్ళ

తున్నాను. విమానాశ్రయంనుండి మూప్పై విమానాల దళం రష్యా సరిహద్దుకు చేరుకుంటున్నవి" అని చెప్పాడు ఎన్ సేచింగ్.

"అలాగే వెళ్ళిపోతాం. మా గురించి మీరేమీ భయపడకండి" అని చెప్పాడు యువరాజ్.

ఎన్ సేచింగ్ బెడ్ చూపాడు. బెడ్ మీద యువరాజ్ సూరీలు పడుకున్నారు. పడుకున్న యువరాజ్ తన మునివేళ్ళను సూరి భుజంమీద తట్టి సాంకేతికంగా చేయబోవు కార్యక్రమాన్ని వివరించాడు.

సూరి సరేనన్నట్లు తలాడించాడు. ఇంతలో ఎన్ సేచింగ్ గ్రాంఫోన్ రికార్డులను రేడియోగ్రాంలో పెట్టాడు.

ఆ రికార్డులు హిందీపాటలు మాదిరి వున్నవి. అవును. అవి హిందీపాటలు బాణీలో వున్నవి. చైనాలో ఇపుడు ప్రముఖ హిందీ పాటలను టేప్ లో రికార్డు చేసుకుని- ఆ పాటల కనువుగా చైనా భాషలో పాటలు పాడి రికార్డులు తయారుచేసి అమ్ముతున్నారు. ఈ రికార్డులకే ఇపుడక్కడ గిరాకీ జాస్తి! ఆ పాటలు వింటూ ఎన్ సేచింగ్ నిద్రకు వెళ్ళిపోయాడు.

యువరాజ్ మెల్లగా లేచాడు. వూపిరి వుగ్గపట్టుకుని చూస్తున్నాడు.

ఎన్ సేచింగ్ గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. యువరాజ్ మెల్లగా అతని ప్రక్కన నిలబడ్డాడు.

యువరాజ్ రెండు చేతుల్తో ఎన్ సేచింగ్ మెడను పట్టుకున్నవి. ఒక్కనొక్కనొక్కాడు. కిక్ మన్నాడు. అంతే ఎన్ సేచింగ్ తల అటూ ఇటూ వూపి వాల్చేశాడు. గ్రహించిన యువరాజ్, "సూరీ!" అని పిలిచాడు.

సూరి ఆదరా బాదరా లేచి వచ్చాడు. సూరి ఎన్ సేచింగ్ ని గబగబ కట్టి పడేశాడు. అతనిని ఒక గదిలోకి

తీసుకెళ్ళి పడుకో బెట్టి వచ్చారు.

"ఆ తరువాతి కార్యక్రమం?" సూరడిగాడు.

"ప్రొద్దున్నే కారు వస్తుందని ఎన్ సేచింగ్ చెప్పాడు. ఆ కారులో నేను పైలెట్ లా మారి ఎక్కుతాను" అన్నాడు యువరాజ్.

"వద్దుసార్! మీరు ఎన్ సేచింగ్ కంటె పెద్దగా వున్నారు. వేషం మార్చినా తోటి పైలెట్లు ఎవరైనా పనిగట్టవచ్చు. గనక ఎన్ సేచింగ్ లా నేను తయారవుతాను" అన్నాడు సూరి.

యువరాజ్ తలాడించాడు. సూరి చెప్పినదానిలో సత్యముంది.

"అలాగే. నేనూ పైలట్ వేషంలోనే ఆ కారు డిక్కీలో ఎలాగో వస్తాను. మిగతా విషయాలు అక్కడే చూసుకొందాం!"

# 10

కారు పరుగులు తీస్తూంది. పెకింగ్ నగర వీధులను దాటింది. వైమానిక దళమున్న విమానాశ్రయంని ఆ కారు చేరుకుంది. అందరు పైలట్లు దిగేశారు.

ఎత్తైన కట్టడాలు. అక్కడక్కడ పహరా కాయు సైనికులు వున్నారు. సూరి తడబడిపోతున్నాడు.

యువరాజ్ ని కారు డిక్కీలోంచి రప్పించాలి. అటు యిటు చూశాడు. అక్కడక్కడ కొందరు నిలబడి వున్నారు. కార్లోనుండి దిగిన పైలెట్లు ఎటో వెళ్ళి పోతున్నారు. వాళ్ళను వదిలితే తనెటు పోవాలో తనకు తెలియదు. వాళ్ళతో వెళ్ళితే డిక్కీలో వున్న యువరాజ్ గతేమిటి? సూరి సందిగ్ధంలో పడిపోయాడు.

నోటిలో తడారిపోతూంది. డ్రైవర్ యెటో వెళ్ళి

పోయాడు. అతనువస్తే కారు తీసుకుని వెళ్ళవచ్చు.

సూరి ధైర్యం చేశాడు. ధర్మదేవతమీద భారం మోపాడు. భగవంతుని మనసులోనే ప్రార్థించి, డిక్కీ మీద మూడు తడవలు శబ్దం చేశాడు. సూరి అటు యిటు చూశాడు. ఎవరైనా చూస్తారేమో? భయంతో గడగడ వణికి పోతున్నాడు.

డిక్కీ మెల్లగా తెరుచుకుంది. ఛివాలున యువరాజ్ బయటపడ్డాడు. డిక్కీ మూసేశాడు.

మామూలు వ్యక్తుల్లా నవ్వుకున్నట్టు నటిస్తూ గబగబ నడిచారు. పైలెట్లల్లో కలిసిపోయారు.

ఎక్కడో వున్న స్పీకర్లోనుండి ఏవో ఆజ్ఞలు వచ్చినవి. పైలెట్లందరూ హడావిడిగా బయలుదేరారు. అందరితో పాటు యువరాజ్ సూరీలూ అటు బయలుదేరారు.

అక్కడ వరుసగా జెట్ ఫైటర్ విమానాలు ఆగి వున్నవి. చాలా విమానాలు గోచరిస్తున్నవి. పైలెట్లు తమ తమ విమానాలలోకి ఎక్కేస్తున్నారు.

సూరికి ఏ విమానంలో ఎక్కాలో అంతుపట్టలేదు. ఎవరూ ఎక్కని విమానం చూసి, సూరి ఆ విమానంలోకి ఎక్కేశాడు.

ఆ విమానాలన్నీ బయలుదేరాయి. బారులు తీరిన విమానాలు ఏకకాలంలో పరుగులు తీస్తూ పైకెగిరాయి. సూరి విమానాన్ని అతిచాకచక్యంగా నడుపుతున్నాడు.

చాలాసేపు ప్రయాణించాయి. కొంగల బారులా ఆ విమానాలు గగనంలో వెళ్ళుతున్నవి. ఆ విమానాలన్నీ రష్యామీద దాడి చేయడానికి సరిహద్దు ప్రాంతాలకు వెళ్లుతున్నవి.

సూరికి వైర్ లెస్‌లో విమానాలన్నీ దిగబోతూన్నట్టు మెసేజ్ అందింది. యువరాజ్‌ని ప్రశ్నార్థకంగా

చూశాడు. తప్పనిసరి ఆ విమానాలతోబాటు సూరి తన విమానాన్ని దింపి తీరాలి. మౌనంగా కూర్చునివున్న యువరాజ్ దింపమన్నట్టు సైగ చేశాడు. విమానం డౌన్ అయింది.

యువరాజ్ గాజు కిటికీగుండా బయటకు చూశాడు. విమానాలన్నీ దిగుతున్నవి.

అది సైనిక విమానాశ్రయం! ఆ విమానాశ్రయంలో విమానాలన్నీ పరుగులు తీస్తూ-తమ వేగాన్ని తగ్గించుకుని వుసూరుమంటూ భూప్రదేశంమీద ఆగిపోయాయి.

యువరాజ్ కు గుండెలు కొట్టుకుంటున్నవి. విమానాశ్రయం ఇదేనా? సరిహద్దు ప్రాంతం ఇదేనా? అంతుపట్ట లేదు. తమతమ విమానాలనుండి పైలెట్లు దిగేస్తున్నారు.

సూరి అదురు బెదురులతో యువరాజ్ ని చూశాడు.

"భయపడకు. గెట్ డౌన్! పైలెట్లందరితో కల్సిపోదాం" అంటూ యువరాజ్ దిగేశాడు. దిగిన యువరాజ్ ని ఒకరో ఇద్దరో పైలెట్లు చూచినప్పటికి గమనించలేదు పరీక్షగా!

సూరిని దిగమన్నట్టు చూశాడు. సూరి ఛివాలున దిగేశాడు.

ఆ విమానాశ్రయం అతి విశాలంగా వుంది. చాలా పెద్ద మైదానంలో నిర్మించి వున్నారు. కనుచూపు మేరలో ఏదో పట్టణమున్నట్టు లీలలో గోచరిస్తూంది. రివ్వన గాలి వీస్తోంది. ఆ విమానాలనుండి యూనిఫాంలో వున్న పైలెట్లు దిగి కార్యాలయంవైపు నడిచి వెళ్ళుతున్నారు. ఎవరికి వాళ్ళు మౌనంగా నడిచి వెళ్ళుతున్నారు.

డిటెక్టివ్ లిద్దరూ గుంపులో గోవిందా అన్నట్టు వాళ్ళల్లో కలిసిపోయారు. పైలెట్లందరూ ఆఫీసులోకి చేరుకున్నారు. అందరూ ఆసీనులయ్యారు.

అక్కడకు ఎయిర్‌మార్షల్ కాబోలు వచ్చాడు. అతను రాగానే అందరు మర్యాద సూచనగా తమ టోపీలను తీశారు. యువరాజ్ సూరీలు అందరిలాగా తమ టోపీలను తీశారు.

ఎయిర్‌మార్షల్ పైలెట్లను వుద్దేశించి ప్రసంగం మొదలు పెట్టాడు. ఆ ప్రసంగంలో రష్యాను దూషిస్తున్నాడు. రష్యా అంటే పగ ద్వేషం వుట్టిపడేలా మాట్లాడుతున్నాడు. ఎన్ని అవాంతరాలు సంభవించినా ఎన్ని మరణాలు సంభవించినా రష్యామీద దాడిచేయడం మానకూడదు. రష్యా చైనా ప్రజలపట్ల అక్రమంగా నడుచుకుంటూంది. లేనిపోనివి కల్పించి పైలెట్లకు వుద్రేకం కల్పిస్తున్నాడు. పైలెట్లందరూ నిశ్శబ్దంగా ప్రసంగాన్ని విన్నారు. ఎయిర్ మార్షల్ వెళ్ళిపోయాడు.

పైలెట్లందరూ ముక్తకంఠంతో మావో జిందాబాద్ అని-చైనా వర్థిల్లాలని-రష్యా డౌన్ డౌన్ అని నినాదాలు చేశారు.

ఆ తరువాత ఏంచేస్తారో డిటెక్టివ్ లిద్దరికీ తెలియదు.

అందరూ బయటికి వచ్చారు. అక్కడ కొందరు సైనికులు ఒక్కొక్కరిని తనిఖీ చేయసాగారు. డిటెక్టివ్ లిద్దరి గుండెలు గడగడలాడిపోయాయి. తమ విషయం తెల్సిపోయింది వాళ్ళకు.

తప్పక పరుగె త్తవలసిన పరిస్థితి ఏర్పడిపోయింది. ఇద్దరూ పరుగు లంఘించారు. సైనికులు తరుముకుంటూ తుపాకులను పేల్చుకుంటూ వెంటబడ్డారు. యువరాజ్ సూరీలు క్రిందా మీదా పడి రొడు తీస్తున్నారు.

అలా విమానాశ్రయంలో పరుగెత్తుతున్నారు. వెనుక సైనికులు తుపాకులు మెషిన్‌గన్‌లు పేల్చుతున్నారు. యువరాజ్ సూరీలు బుల్లెట్స్‌కు అందడంలేదు.

అక్కడ వరుసగా విమానాలు ఆగివున్నవి. సూరి వచ్చిన విమానమూ వుంది. ఆ విమానంలో యువరాజ్ సూరీలు ఎక్కేశారు. ఎక్కిందే తడవు విమానం బయలు దేరింది. హోరు పెట్టుకుంటూ స్పీడందుకుంది.

సైనికులు ఇపుడు తుపాకులు పేల్చడంలేదు. అలా పేల్చితే అక్కడ ఆగివున్న విమానాలకు ప్రమాదమని తెల్సు. అందుకే పేల్చలేదు. ఆ అదను యువరాజ్ సూరీలు బాగా వుపయోగించుకున్నారు.

డిటెక్టివ్ లిద్దరు వున్న జెట్ పైకెగిరింది.దూసుకు వెళ్లు తూంది. ఎటు వెళ్ళాలి? ఏం చేయాలి? దిగ్విజయాన్ని ఎలా విడిపించాలి. వూహా కందడంలేదు.

విమానంలోని రాడార్ లో యువరాజ్ చూశాడు.

ఆ విమానాన్ని తరుముకుంటూ చాలా విమానాలు వస్తు న్నవి. ఆ విమానాలనుండి ఆ ఒక్క విమానం తప్పిం చుకోవడం దుర్లభం. అన్నీ యుద్ధ విమానాలు. ఆ యుద్ధ విమానాలు బాంబులు ప్రయోగించడం ప్రారంభిస్తే తమున్న విమానం భస్మమైపోతుంది. చివరకు బూడిద సైతము మిగలదు.

తరుముకు వచ్చే విమానాలు దగ్గర పడ్డవి. బాంబులు ప్రేల్చడం ప్రారంభించాయి. ఈ డిటెక్టివ్ లున్న విమా నాన్ని కూల్చివేయాలని విమానాలన్నీ స్పీడ్ అవుతున్నవి. ఆ గగన ప్రదేశమంతా విమానాల హోరుతో భీభత్సంగా వుంది. తమిద్దరూ ఇక ప్రాణాలతో బయటపడడం అసాధ్యమనిపించింది.

యువరాజ్ కు మెరుపులా ఒక ఆలోచన తట్టింది. విమానాన్ని స్లో చేశాడు. రివ్వున మేఘాల్లో దూసుకు వెళ్ళుతూంది. పైలెట్ స్థానంనుండి లేచాడు. ఆ విమా

నంలో వున్న పారాచూట్‌లను ఇద్దరూ అందుకున్నారు. గబగబ నడుముకు బిగించుకున్నారు.

"సూరీ! బి కేర్‌ఫుల్! విమానం అతివేగంగా వెళ్ళుతూంది. ఈ వేగంలో పారాచూట్ మూలంగా క్రిందికి దుమకడం కాస్త శ్రమగా వుంటుంది. పైగా మన విమానాన్ని తరుముకొచ్చే శత్రువిమానాలు మన పారాచూట్‌లకు గుద్దుకోవచ్చు. ప్రమాదం జరగకుండా జాగ్రత్తపడాలి. ఇపుడు మన విమానం కారుమబ్బులో పయనిస్తూంది. కమాన్ క్విక్, మబ్బులు మన్ని కాపాడొచ్చు."

అనంటూ యువరాజ్ క్రిందకు దుమికేశాడు. వెను వెంటనే సూరి కూడా దుమికేశాడు.

చాలా క్రిందివరకు పల్టీలు కొట్టారు. పారాచూటులు విప్పారుకున్నవి. గాలిలో తేలియాడుతున్నవి. క్రిందకు దిగుతున్నవి.

శత్రు విమానాలు హోరు పెట్టుకుంటూ ఖాళీగా వెళ్ళే విమానం వెంటబడి దూసుకు వెళ్ళినవి. బాంబులు ప్రేల్చినవి. ఖాళీజెట్ గగనంలో తునాతునకలై మంటలు వెదజల్లుతూ, నల్లటి పొగలు గక్కుతూ ధగ్ధమైపోయింది.

# 11

కారు మేఘాలనుండి పారాచూట్లు క్రిందకు దిగాయి. క్రిందకు చూచారు. ఎక్కడో లీలగా కొన్ని ఇళ్ళు కనబడుతున్నవి. ఆ యిళ్ళను చూడగానే గ్రామమై వుంటుందని యువరాజ్ వూహించాడు.

దిగే గాలిగుమ్మటాలను విమానాలనుండి పైలెట్లు తిలకిస్తారేమోనని భయంగానే వుంది. పారాచూట్లు దిగుతున్నవి. శత్రుదేశంమీద గాలిలో తేలియాడుతున్నారు.

రెండు పారాచూట్లు భూప్రదేశానికి చేరుకయినవి.

ఇద్దరూ సిద్ధంగా వున్నారు. వారిరువురు ఆ చైనా గ్రామా నికి మూడు ఫర్లాంగుల దూరంలో దిగారు!

దిగీ దిగగానే గబగబ పారామూట్లను మడచి ప్రక్క నున్న పొదలవైపు గిరాటు వేశారు. గబగబ నడవడం ప్రారంభించారు.

ఇపుడేం చేయాలి? పైలెట్లనుండి తప్పించుకున్నారు. ప్రాణాలు కాపాడుకున్నారు. అయితే దిగ్విజయం ఎక్కడవున్నారు? తెల్సుకునేదెలా?

అలా నడిచి గ్రామానికి చేరువయ్యారు. గ్రామం చేరువగానే తమ పైలెటు వేషాలను తీసేశారు. మామూలు చైనా వ్యక్తుల్లా తయారై గ్రామంలోకి బయలుదేరారు.

ఆ గ్రామంలో జనం మిక్కుటంగా వున్నారు. కిట కిట లాడిపోతున్నారు. అక్కడక్కడ గుడారాలున్నవి. జనం విపరీతంగా వున్నారు. స్త్రీ పురుషులు, యువతీ యువకులు, బాలబాలికలు ఒకటే సందడిగా వుంది. ఆ గ్రామంలో అంతమంది ఎందుకున్నారో అంతుపట్టలేదు.

డిటెక్టివ్‌లిద్దరూ ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసు కున్నారు.

ఆ గ్రామంలోకి ప్రవేశిస్తే తమని కనుగొంటారా? అంత మందిలో కల్సిపోవడం సులభమనిపించింది. యువ రాజ్ సూరీలు మామూలు వ్యక్తుల్లా నడుస్తూ గ్రామంలోకి అడుగు పెట్టారు.

ఎవరు అంతగా వాళ్ళను పట్టించుకోలేదు. అక్కడ తిరుగాడే వ్యక్తులను చూస్తూవుంటే ఏమీ బోధపడడం లేదు. చాలా చిన్న గ్రామమది. ఆ గ్రామంలో నివసించు జనాభాకంటే కొన్నిరెట్లు అధికంగా వున్నారు. ఎందుకు?

వీధులలో జనం అక్కడక్కడ నిలబడి, కూర్చొని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. ఆ గ్రామంలోను

సైనికుల శాపలా వుంది.

సైనికులను తప్పుకుని ఇంకా పైకి నడిచారు. ఒక వృద్ధుడు తాపీగా చుట్ట పీలుస్తూ ఒంటరిగా కూర్చుని వున్నాడు. అతని దగ్గరకెళ్ళి యువరాజ్ సూరీలు కూర్చున్నారు. ఇద్దర్నీ చూచిన వృద్ధుడు, ఎవరన్నట్టు చూశాడు. ఆ వృద్ధుడు చూచిన చూపులలో ఏదో అసంతృప్తి ఇమిడివుంది.

"తాతగారూ!..." సంబోధించాడు యువరాజ్. విచిత్రంగా చూశాడా వృద్ధుడు. చైనా వ్యక్తి అయితే కామ్రేడ్ అని పిలిచివుండాలి.

"ఎవరు మీరు?" ప్రశ్నించాడు వృద్ధుడు.

"మన చైనా దేశం ఇపుడు సైనిక శిబిరంలా తయారౌతూంది. ఎందుకు?" అడిగాడు యువరాజ్.

యువరాజ్‌ని తీక్షణంగా చూశాడు వృద్ధుడు.

"చెప్పండి" అన్నాడు సూరి.

"ముందు మీరెవరో చెప్పండి" అడిగాడు వృద్ధుడు.

"ప్రక్క గ్రామవాసులం!!"

"మీకు నిజంగా తెలియదా?"

"తెలియదు. ఈ గ్రామంలో ఇంతమంది జనం ఎందుకున్నారు?" అనడిగాడు యువరాజ్.

"రష్యా విమానదాడి చేస్తే-దాడికి అనువైన ప్రదేశాలలో వున్న పట్టణాలను కాపాడడానికి మావో పట్టణాలను ఖాళీ చేయించి, ప్రజలను గ్రామాలలోకి తరుముతున్నాడు. కొన్ని పట్టణాలలో విమానదాడి రక్షణార్థమై కందకాలను త్రవ్వించారు" అని చెప్పాడు వృద్ధుడు.

యువరాజ్ సూరీలు ఆశ్చర్యంగా చూశారు.

"కొన్ని ఫ్యాక్టరీలు, పారిశ్రామిక కేంద్రాలు మారుమూల చోట్లకు తరలించబడ్డాయి. సరిహద్దు ప్రాంతా

లలో కొన్నిచోట్ల నివసించు వారికి కొన్ని యుద్ధ తంత్రాలను నేర్పించి వున్నారు. దేశం మావో చేతిలో కీలుబొమ్మై యుద్ధనావాంతో కొట్టుకులాడిపోతూంది" అనవ్నాడా వృద్ధుడు బాధగా.

"ఎందుకు?"

"ఆ మావోకే తెలియాలి. సామాన్య ప్రజలలో సరిహద్దు ప్రాంతాలలో యుద్ధం వచ్చేసిందని భీతికల్పించి, అలజడి రేపి సైన్యంలో చేరమంటున్నాడు. ఇండియా తరువాత ఇపుడు సోదర కమ్యూనిస్టు దేశమైన రష్యాతో యుద్ధానికి తలపడి వున్నారు" అని చెప్పాడు వృద్ధుడు.

యువరాజ్ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"ఈ వూళ్ళో సైన్యంలోకి మనుషులను తీసుకుంటున్నారా?" అడిగాడు యువరాజ్.

"ఆఁ...ఇంకా పైకి వెళ్ళండి" చెప్పాడు వృద్ధుడు.

యువరాజ్ సూరీలు లేచారు. వృద్ధునివద్ద శెలవు తీసుకుని బయలుదేరారు. ఇక ఆ వృద్ధుని ఏవైనా ప్రశ్నలడిగితే అనుమాన పడవచ్చు. మెల్లగా యువరాజ్ సూరీలు నడవడం ప్రారంభించారు.

వీధులనిండా జనమే!! ఇళ్ళన్నీ కిటకిటలాడుతున్నాయి. పిల్లాజల్లాతో కిటకిటలాడుతూ వున్నారు. ఆ ఏర్పాట్లన్నీ తిలకిస్తూ వుంటే రష్యాతో యుద్ధం చేయడానికి చైనా తయారుగా వుందని తెలుస్తూంది. చైనా అణ్వస్త్ర నిలయాలు సింకియాంగ్ లో వున్నవి. రష్యా అణ్వస్త్ర దాడి జరిపితే ప్రతిఘటించడానికి తగిన పథకాలను సిద్ధపరచుకొని వుంది. చైనా సైనికబలం ప్రపంచంలోనే పెద్దది.

యువరాజ్ సూరీలు నడుస్తూ ఆ వీధి చివరకు చేరుకున్నారు. అక్కడ—

సైన్యంలో చేర్చుకొనువారు, చాలామందిని రిక్రూట్ చేస్తున్నారు. ఏ విధంగానైనా సైన్యంలో చేరాలి. ఆ సైన్యాన్ని సరిహద్దు ప్రాంతానికి తరలిస్తారు. గనుక కేవలం మామూలు సైనికుడిగా వుండి దిగ్విజయం ఎక్కడ వుందేది ఆచూకీ తీయాలనుకున్నాడు యువరాజ్.

"సూరీ మనద్దరం యిప్పుడు సైన్యంలో చేరబోతున్నాం. మనం చేరిన సైన్యాన్ని సరిహద్దు ప్రాంతాలకు పంపుతారు. సైన్యంలో సైనికుల్లా నటిస్తూ దిగ్విజయాన్ని ఎక్కడుందేది కనుగొనాలి. నా అనుమానం దిగ్విజయాన్ని సరిహద్దు ప్రాంతంలో ఏ స్థావరంలోనో వుంచి వుంటారని. దిగ్విజయం వద్ద వ్యూహాలు పన్నుమని చైనీయులు బలవంతం పెడుతూ వుండొచ్చు. చైనా సైనికంగా పురోభివృద్ధి అతిగా సాధించింది, ఇటువంటి సమయంలో దిగ్విజయం వ్యూహాలు తోడయితే చైనా రష్యామీద యుద్ధం ప్రకటిస్తుంది" చెప్పాడు యువరాజ్.

"అలాగే సార్! సైన్యంలో చేరుదాం. మన శాయశక్తులా ప్రయత్నించి దిగ్విజయాన్ని కనుగొందాం!" సూరన్నాడు.

ఇద్దరూ రిక్రూట్ చేయు అధికారుల వైపు నడిచారు. వాళ్ళేమి అడుగుతారో, ఏం జవాబు చెప్పాలో ఇద్దరు డిటెక్టివ్‌లు వూహించి పెట్టుకున్నారు. సైన్యంలో చేరడం, అందులో చైనాలోని ప్రస్తుత పరిస్థితులబట్టి అతిసులభమైన విషయం!

# 12

అనొక స్పెషల్ ట్రయిన్!

ఆ రైలుబండి నిండా సైనికులున్నారు. సైనికులున్న రైలు సరిహద్దు ప్రాంతాలకు వెళ్ళుతూంది. ఆ రైలులో సైనికులు కిటకిటలాడిపోతున్నారు.

డిటెక్టివ్ యువరాజ్, అసిస్టెంట్ సూరీలు ఒక మూలగా కూర్చొనివున్నారు. రైలు వెళ్ళుతూంది.

రైలు రెండు రోజులు ప్రయాణించి ఆగింది.

సైనికులంతా దిగుతున్నారు. అక్కడక్కడ సైనిక స్థావరాలు కళ్ళబడినవి.

దిగ్విజయాన్ని ఏ స్థావరంలో వుంచి వుంటారు? ఏదో ఓ స్థావరంలో వుంచి వుంటారన్న తన అంచనా తారుమారు కాకూడదని భగవంతుని ప్రార్థించుకున్నాడు యువరాజ్!

సైనికులంతా చేరవలసిన చోటుకు చేరుకున్నారు. అదంతా కొండల ప్రదేశం.

అక్కడ అంతకుముందే కేంద్రీకరించబడివున్న జాతీయ ప్రతిఘటన దళాలు వున్నవి. ఆ దళాలకు అండగా మూక వుమ్మడిగా సైన్యాలను తరలించింది. తరలించిన సైన్యంలో యువరాజ్ సూరీలు వున్నారు.

సైనికాధికారులు ఆదేశాలిస్తున్నారు. ఆ ఆదేశాల ప్రకారం రష్యాతో యుద్ధం చేయడానికి పూనుకోవాలని, సిద్ధంగా వుండాలని, ఏ క్షణంలోనైనా యుద్ధం ప్రారంభమవుతుందని సారాంశం యిమిడి వుంది.

యువరాజ్ గుండెలు గుబగుబలాడిపోయాయి. చైనా రష్యాలు యుద్ధానికి తలపడితే చైనా సైన్యంలో ఉన్న తమకు ప్రమాదం సంభవించవచ్చు. ఇపుడేం చేయాలి?

యుద్ధం ప్రారంభమయితే అణ్వాయుధాలు ఉపయోగిస్తారు. అణ్వాయుధాలు ఉపయోగిస్తే ప్రపంచంలో ఏ ఖండమూ మిగలదు అణుయుద్ధం ప్రారంభమయితే జరుగుబోయే విపత్కరం తెలియని మానవుడు లేడు.

మావో యుద్ధాన్ని ఎందుకు కోరుకుంటున్నాడు? యువరాజ్ కు అంతుపట్టలేదు.

సైనికాధికారులు కమాండింగ్ చేస్తున్నారు. యువరాజ్ సూరీలు సైన్‌గన్‌లను పట్టుకుని ఆయత్తమవుతున్నారు. యుద్ధం ప్రారంభమవుతుందా? అక్కడున్న మిలిటరీలో నుండి తాము బయటపడేదెలా? దిగ్విజయం ఎక్కడుందేది తెల్సుకునేదెలా?

కొన్ని లక్షలమంది సైనికులను మిలటరీ అధికారులు అజమాయిషీ చేస్తున్నారు. ప్రతి సైనికుడు రష్యా సైన్యాన్ని తిప్పికొట్టడానికి సిద్ధంగా వున్నాడు.

అటువైపు రష్యా సైనికులూ—సిద్ధంగా వుండి వుంటారని యువరాజ్ తలపోసాడు. అయితే రష్యా సైనికులూ-చైనా సైనికులు సరిహద్దు ప్రాంతంలో తలపడడానికి ఉరుముతూ నిలబడివున్నారు.

అంతర్జాతీయ సరిహద్దుకు ఆవలివైపు రష్యన్లు బారులు తీరి నిలబడి వుండడం లీలగా గోచరిస్తూంది. ఈవలివైపు చైనీయులు సర్వసన్నద్ధులై వుండడం తెలుస్తూనే వుంది.

ఏ ఒక్క చిన్న పొరబాటు ఎవరు చేసినా యుద్ధం ప్రారంభం కావడానికి సరిహద్దు ప్రాంతంలో పేలబోయే అగ్నిపర్వతంలా కాచుకుని వుంది.

యువరాజ్ సూరీలున్న దళాన్ని నడుపు కమాండర్ సేనలను తనిఖీ చేస్తూ వస్తున్నాడు. డిటెక్టివ్ లిద్దరూ ప్రక్క ప్రక్కనే నిలబడివున్నారు. వారు నిలబడివున్న చోట పొదలు, పెద్ద బండరాళ్ళు వున్నవి. కమాండర్ని చూడగానే యువరాజ్ కు తళుక్కున ఓ ఆలోచన తట్టింది.

సూరికి కన్ను గీటాడు. అక్కడి చేయు సాహసం ఎంతటి ప్రమాదకరమో మరువ లేదు. అటు యిటు చూశారు. తోటి సైనికులు స్పష్టంగా కనబడడం లేదు. చెట్లు చేమలు, రాళ్ళు రప్పలు, అడ్డంగా వున్నవి.

కమాండర్ అటు రాగానే డిటెక్టివ్ లిద్దరూ ఏకమ్మ

డిగా విరుచుకు పడ్డారు. ఆ ఇరువురి బలమైన చేతులలో కమాండర్ అటుయిటు కదలలేక పోయాడు. వాళ్ళు ఏదో చేస్తున్నారని వూహించేలోపే ఎక్కడో దెబ్బ తగలడం స్పృహ పోవడం జరిగిపోయింది.

కమాండర్ని యువరాజ్ బండల చాటుకు ఈడ్చు కెళ్ళాడు. సూరి మరెవరైనా వస్తారేమో గమనిస్తున్నాడు. ఏ మాత్రం చప్పుడైనా-రష్యా సైన్యం కాల్పులు ప్రారంభించవచ్చు. ఎవరైనా చూస్తే తమని నిలువునా కాల్చి పారేస్తారు. సూరి వూహించి-అతి మెళుకువగా వున్నాడు.

యాభైలక్షల చైనా సైన్యం మధ్య యువరాజ్, తనూ చేయు సాహసం వివేకమైనది కాదు. కానీ చేయక తప్పదు. యువరాజ్ తన పనిని పూర్తిచేసుకుని సూరి ప్రక్కన నిలబడ్డాడు.

డిటెక్టివ్ యువరాజ్ ఇప్పుడు కమాండలాగున్నాడు.

“తరువాతి కార్యక్రమం?” అడిగాడు సూరి.

“కమాండర్ గా స్థావరాలలోకి వెళ్ళి వెదుకుతాను. దిగ్విజయం ఎక్కడుందేది ఆచూకీ తీస్తాను.”

“నేనేం చేయాలి?” అడిగాడు సూరి.

“అంతుపట్టడం లేదు సూరీ! నీ విక్కడుంటం అపాయం! ఇక్కడనుండి తప్పుకుని వెనుకకు వెళ్ళడం కష్టం! నువ్వు అంతర్జాతీయ సరిహద్దును దాటుకుని చైనా భూభాగం నుండి రష్యాలోకి ప్రవేశించు” చెప్పాడు యువరాజ్.

“ఇటువంటి పరిస్థితులలో చైనాలోనుండి రష్యాలోకి ఎలా ప్రవేశించడం? రష్యా సేనలు బారులు తీరివున్నవి. అనుమానం కల్గినా తుపాకులు పేల్చుతారు” అన్నాడు సూరి.

“వేరు మార్గం గోచరించడంలేదు. కమాండర్లా నటిస్తాను. దిగ్విజయాన్ని కనుగొని తీసుతాను. నువ్వు

రష్యాలో కలిసి తలదాచుకో. నేనెలాగూ దిగ్విజయంతో వస్తాను," చెప్పాడు యువరాజ్.

"మీ రాక కోసం ఈ శత్రువుల మధ్య...?! నా సహాయం అవసరం కావచ్చు," వనిగాడు సూరి.

"ఫరవాలేదు సూరి. దిగ్విజయం తోడవుతాడు."

"దిగ్విజయం ఎక్కడుండేది తెలియలేదు."

"తెల్సుకుంటాను. నువ్వు జాగ్రత్తగా రష్యాలో ప్రవేశించాలి."

"అలాగే సార్! నా శాయశక్తులా ప్రయత్నించి రష్యాలో ప్రవేశించడానికి సాహసిస్తాను."

"ధర్మం, న్యాయం, నీతి మనవైపు వున్నంతకాలం మన కెటువంటి ఆపద సంభవించదు."

"రష్యాలోకి చేరాక మిమ్ములను కల్సుకునేదెలా?"

"మన భారతదేశ రాయబార కార్యాలయంలో కల్సుకుందాం!" చెప్పాడు యువరాజ్.

# 13

డిటెక్టివ్ యువరాజ్ సైనిక కమాండర్‌లా నటిస్తూ తనఖీ చేయు వానిలా నడవడం ప్రారంభించాడు. సైనికులు విపరీతంగా వున్నారు. ప్రతి సైనికుడు తుపాకులు పట్టుకుని సిద్ధంగా వున్నారు. కమాండర్ రావడం గమనించిన సైనికులు భయభక్తులు ప్రదర్శిస్తున్నారు.

యువరాజ్ నడుస్తున్నాడు. మార్గమంతా ముళ్ళ పొదలు, రాళ్ళతో నిండివుంది. నడవడానికి కష్టంగావుంది.

"కామ్రేడ్! లెఫ్టినెంట్ పిలుస్తున్నాడు" అనంటూ ఒక సైనికుడు వచ్చాడు.

యువరాజ్ గంభీరంగా ముఖం పెట్టి, "పద" అనంటూ, ఆ సైనికుని వెనుకాల నడవడం ప్రారంభించాడు.

"రాళ్లు, గుట్టలు, పొదలు, చెట్లు గుబురుగా వున్నవి.

వాటిగుండా ఆ సైనికుడు జోరబడి ముందుకెళ్లుతున్నాడు.

యువరాజ్ మనసు పరిపరివిధాల పోతూంది. లెప్టి నెంట్ ముందు ఎలా నటించాలి? అతనేం అడుగుతాడు? తన గుట్టు బయట పడుతుందా? ప్రాణాలతో బయట పడగలడా? దిగ్విజయం కనబడతాడా?

స్థావరం అల్లంతదూరంలో కనబడుతూంది. యువ రాజ్‌కు భయంగానే వుంది. ఆ స్థావరంలో సైనికులు సైనికాధికారులు తిరుగాడుతున్నారు. చాలామంది వున్నారు. అందరూ యువరాజ్‌ని చూశారు. యువరాజ్ గబగబ నడుస్తూ స్థావరంలోనికి ప్రవేశించాడు.

లెఫ్టినెంట్ ఆసీనుడై వున్నాడు. యువరాజ్ సెల్యూట్ చేశాడు.

"కామ్రేడ్! దిగ్విజయుం వ్యూహాలు పన్ని యివ్వడం లేదు. ఈ వేళ వ్యూహం పన్ని యివ్వకపోతే దిగ్విజ యాన్ని చంపేయాలి. వెళ్ళి మరొకతడవ అడిగి చూడు" చెప్పాడు లెఫ్టినెంట్.

యువరాజ్ ఆశ్చర్యపోయాడు.

దిగ్విజయుం వున్న స్థావరానికే తను రావడం_ తనకు అదృష్టం కల్సివచ్చిందని సంతోష పడ్డాడు.

"యస్ కామ్రేడ్!" అనంటూ యువరాజ్ సెల్యూట్ కొట్టి లోపలకు ప్రవేశించాడు.

దిగ్విజయుం వాడిన ముఖంతో వుసూరుమని కూర్చుని వున్నాడు. అతనిచుట్టూ సైనికులు సాయుధులై నిలబడి వున్నారు. అతని ముందుబల్లమీద వివిధ రకాల మాప్‌లు వున్నవి. దిగ్విజయాన్ని నానాహింసలు పెట్టివున్నట్లు అతని శరీరంమీద గాయాలు, మచ్చలు తెలియజేస్తున్నవి.

"మీరంతా వెళ్ళండి!" ఆజ్ఞాపించాడు యువరాజ్.

అక్కడున్న సైనికులు వెళ్ళిపోయారు. యువరాజ్

అటుయిటు చూసి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాడు. గుండెలు అతివేగంగా కొట్టుకుంటున్నవి.

"మిష్టర్ దిగ్విజయం! నేను డిటెక్టివ్ యువరాజ్ ని. మిమ్మల్ని విడిపించడానికి నేను భారతదేశం నుండి వచ్చాను" అని యువరాజ్ మెల్లగొంతుతో అన్నాడు.

దిగ్విజయం ఆశ్చర్యవంతుడై యువరాజ్ ని కళ్ళార్ప కుండా చూస్తూ వుండిపోయాడు.

"మీరెలా రాగలిగారు?" ఆశ్చర్యాన్నుండి తేరు కున్న దిగ్విజయం అడిగాడు.

"ఎలాగో వచ్చాను. ముందు ఇక్కడనుండి తప్పే మార్గమాలోచించాలి" అని యువరాజ్ చెప్పాడు.

"ఇక్కడనుండి బయటపడడం అసాధ్యమైన పని మిస్టర్ యువరాజ్! డిటెక్టివ్లు యిద్దరు నా కొరకు చైనాలోనికి ప్రవేశించారని తెల్సుకున్న సైనీయులు యిప్పుడు బాగా కట్టుదిట్టాలు చేసివున్నారు. రెండు మూడు తడవలు తప్పించుకోడానికి ప్రయత్నించాను. సాధ్యం కాలేదు. మీరు వచ్చారని తెల్సు. కానీ, నా దగ్గరకు రాలేరని వూహించాను," చెప్పాడు దిగ్విజయం.

"మీరు సైనికాధికారులకు ఏవైనా వ్యూహాలు యిచ్చారా?" అడిగాడు యువరాజ్.

"లేదు. చచ్చినా యివ్వను" నా బొందిలో ప్రాణ మున్నంతవరకు చెప్పను" దిగ్విజయం గొంతులోనుండి కాఠిన్యంతోబాటు దృఢనిశ్చయమూ వూడిపడింది.

"చాలా మంచిదండి! ఇక్కడనుండి బయటపడడం గురించి మనమాలోచించాలి."

"ఎలాగు?"

"ఈ స్థావరం ఎక్కడుంది?" అడిగాడు యువరాజ్.

"చైనా అంతర్జాతీయ సరిహద్దు ప్రాంతంలో వుంది."

"నా అసిస్టెంట్ సూరిని రష్యాలోనికి వెళ్ళిపొమ్మని ఆదేశించాను. మన ప్రభుత్వం—రష్యా ప్రభుత్వంతో మనలను గురించిన విషయాలను తెలియపరచి వుంటుంది. గనక రష్యాలో ప్రవేశిస్తే మనకేటువంటి యిబ్బందీ వుండదు. పైగా రష్యా ప్రభుత్వ సహాయమూ మనకు లభిస్తుంది" చెప్పాడు యువరాజ్.

"ఇప్పుడు రష్యాలోకి ఎలా ప్రవేసించడం?" దిగ్విజయం అడిగాడు.

"అదే మనమాలోచించాలి."

"సాధ్యం కానిపని. సైనికుల బారినుండి తప్పుకోవడం క్షణక్షణమూ గండం!"

లెఫ్టినెంట్ భయంకరంగా నవ్వుతూ లోపలికొచ్చాడు. యువరాజ్, దిగ్విజయాలను సాయుధులగు సైనిక భటులు మిషన్‌గన్‌లు పట్టుకుని, గురిపెట్టి చుట్టుముట్టారు.

ఆ ప్రమాదం ఎటువంటిదో వూహించుకోగానే యువరాజ్ నిర్విణ్ణుడై నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. కదలడానికి వీల్లేదు. తమచుట్టూ సాయుధులగు సైనికులు. దిగ్విజయం శవంలా మారిపోయి యువరాజ్‌ని దీనంగా చూస్తూ వుండిపోయాడు.

"మిస్టర్ యువరాజ్! మీ సాహసానికి నా జోహార్లు. మీరు కమాండర్ని పడగొట్టగానే నా కర్థమైంది. అందుకే పిలిపించాను. పిలిపించి దిగ్విజయం వద్దకు పంపాను. మీ అసిస్టెంట్ సూరి ఏమయ్యాడో అంతుపట్టలేదు," అన్నాడు లెఫ్టినెంట్.

ఎంత తెలివి తక్కువ పనిచేశాడో తలచుకోగానే యువరాజ్ తననితాను నిందించుకున్నాడు. శత్రువుల వ్యూహం అభేద్యమైనది. తనిపుడు ఎలా బయటపడడం?

తనని, దిగ్విజయాన్ని మెషన్ గన్‌లతో చుట్టుముట్టిన

సైనికులను అలా తిలకించాడు యువరాజ్. కదిలితే నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తారు.

లెఫ్టినెంట్ యువరాజ్ కెదురుగా వచ్చి నిలబడ్డాడు. "ఇక మిమ్ములను ప్రాణాలతో వదిలిపెట్టకూడదు. మీరు కనబడగానే చంపేయమని ఆజ్ఞ. ఊ(... బయటకు తీసుకెళ్ళి చంపేయండి!!" ఆజ్ఞ జారీచేశాడు.

## 14

యువరాజ్ అటు వెళ్ళగానే సూరి చేతిలో గన్ పట్టుకుని ఆలోచనలో పడిపోయాడు.

తనిపుడు రష్యాలోకి ప్రవేశించడం ఎలా?

రష్యాలోకి ప్రవేశించడం మాటలుకాదు. అందునా చైనా భూభాగంనుండి సరిహద్దు దాటి రష్యా గడ్డమీద కాలుమోపడం అనేది అసాధ్యమైన పని!

రష్యన్లు సర్వసన్నద్ధులై చైనీయుల మీదకు దాడి జరపడానికి చైనా దాడిని ఎదుర్కొనడానికి పొంచి వున్నారు. ఇటువంటి సమయంలో తను ఈ వైపునుండి ఆ వైపుకు వెళ్ళడం ఎంత భయంకరమైనదో తెల్సు. కానీ వెళ్ళాలి. ఎలా?

సూరి ఏవేవో ఆలోచిస్తూ చీకటి పడేంతవరకు అలాగే లోటి సైనికుల్లా-ప్రక్కనున్న పొదలలోకి దూరి ఎవరికీ కనబడకుండా దాగి వుండాలనుకున్నాడు. ఇంతలో—

కొందరు సైనికులు ఎవరినో గాలిస్తూ వస్తున్నారు. సూరి ఆలస్యం చేయలేదు. ఛివాలున పొదలలోకి దూరి దాగుకున్నాడు. ఆ సైనికులు ఎవర్ని వెదుకుతున్నారు? తననా? తననైతే యువరాజ్ విషయం పసిగట్టి వుండాలిగా? యువరాజ్‌కు ఏదైనా ఆపద సంభవించిందా? సూరి గుండెలు ధమధమలాడుతున్నవి.

అటు యిటు తిరిగిన సైనికులు వెళ్ళిపోయారు. తన

కోసమే వాళ్లు వచ్చారని సూరి గ్రహించుకున్నాడు. అంటే తన సంగతి, యువరాజ్ సంగతి చైనీయులకు తెల్సివుండాలి. గనక ఇపుడు తనేం చేయాలి? ఆయన చెప్పిన విధంగా తను చేయాలి. గనక తను రష్యాలోకి ప్రవేశించాలి, అనుకున్నాడు సూరి.

చీకటి అలుముకుంది! మెల్లగా పొదలనుండి బయటకు వచ్చాడు. ముందుకెళ్ళాలి. చాలా దూరం వెళ్ళాలి. అలా వెళ్ళితే బారులు తీరిన రష్యా సేనలు ఎదురవుతాయి.

సాహసించాలి. తప్పదు! సూరి ధైర్యం చేశాడు.

బోర్లా పడుకున్నాడు. చేతులకు ముళ్లు గ్రుచ్చుకుం టున్నవి. బండల చాటున, ముళ్ళ పొదలగుండా, చెట్టు చేమలగుండా భూమికంటుకుపోయి ప్రాకడం మొదలు పెట్టాడు. చీకటి సూరికి బాగా వుపకరించింది. కొద్దిగా చలిగావుంది. రాళ్లు రప్పలు, ముళ్ళు అడ్డంవచ్చినా సూరి సమాళించుకుని ప్రాకుతూ వెళ్లుతున్నాడు.

తను చైనా సేనలను వదలి చాలాదూరం వచ్చాడని వూహించిన సూరి మెల్లగా లేచి నిలబడ్డాడు. అటు యిటు చూశాడు. కళ్ళకు ఏమీ కనబడడంలేదు.

సూరి రష్యా, చైనా సేనల మధ్యకు చేరుకున్నాడు. ఏ సేనలు అనుమానించినా తుపాకులు ప్రేల్చుతారు.

సూరి ఆ రాళ్లురప్పల మధ్య నడవడం ప్రారంభించాడు. నడిచేటపుడు బూట్లచప్పుడు వస్తూంది. వాటిని వదిలేశాడు. అక్కడున్న చెట్లు, చేమలు_పొదలు మధ్యపడి ఆయాస పడకుండా గబగబా నడుస్తున్నాడు సూరి.

అది కింగన్ పర్వతశ్రేణుల ప్రాంతం. దట్టమైన అడవి. క్రూర మృగాలు ఏదైనా మీద పడవచ్చని భయంగావుంది. విష జంతువులేవైనా కాటు వేస్తాయేమో? సూరి అన్నిటికీ తెగించి నడుస్తూనే వున్నాడు. ఆ

అడవులలో పడి ముందుకు చీకటిలో రష్యా భూగడ్డమీద కాలుమోపడానికి నడిచి నడిచి అలసిపోయాడు. ఎంత దూరం నడిచాడో అంతుపట్టలేదు. తూర్పు కాంతిరేఖలు ఆకాశంలోని చీకటిని చీల్చుకుంటూ ప్రవేశించసాగాయి.

ఇక నడిచి వెళ్ళడం మంచిది కాదని అనుకున్నాడు. సైనికులను వదలి రష్యన్లతో కలియబోతున్నాడు. వేషం, దూపురేఖలు మార్చుకోవాలనుకుని కూర్చున్నాడు.

కూర్చుని బడలికను తీర్చుకుంటూ రష్యా యువకునిలా తయారయ్యాడు సూరి. గబగబ రాళ్ళమధ్య పడి పాములా ప్రాకడం ప్రారంభించాడు.

వెలుతురు రాకముందే తను రష్యన్లలో కల్సిపోవాలి. లేనిచో ప్రమాదం! ముందుకు ప్రాకుతూ వెళ్లుతున్నాడు.

ఆ సమయంలో మిలట్రీ సరఫరాలు అందించి తిరిగొస్తున్న ఖాళీ ట్రక్కు కనిపించింది. సూరి ఒక్క ఉదుటన దాంట్లోకి ఎక్కి కూర్చున్నాడు.

# 15

యువరాజ్ చుట్టూ సైనికులు తమ మిషన్ గన్లతో దగ్గరవుతున్నారు. లెఫ్టినెంట్ తప్పుకోబోతున్నాడు. యువరాజ్ ఆలస్యం చేయలేదు. ఖడ్గమృగంలా లెఫ్టినెంట్‌ని ఢీకొట్టుకున్నాడు. లెఫ్టినెంట్ గొంతుచుట్టూ తన కుడిచేతిని చుట్టి లెఫ్టినెంట్ వెనుకకు వెళ్లాడు. లెఫ్టినెంట్ ఇప్పుడు యువరాజ్‌కు కవచంలా వున్నాడు.

సైనికులు, దిగ్విజయం స్తంభీభూతులై నిలబడిపోయారు, యువరాజ్ సాహసచర్యకు.

"కామ్రేడ్స్!! మీ చేతులలోని గన్లను వెంటనే క్రింద పడవేయండి. లేదా మీ లెఫ్టినెంట్‌ని గొంతు నులిపి చంపేస్తాను" అని యువరాజ్ గర్జించాడు.

సైనికులందరూ ఒకరి ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

లెఫ్టినెంట్ మెడచుట్టూ యువరాజ్ వుక్కుహస్తం బిగించుకుపోతూంది. కనుగ్రుడ్లు వెళ్ళుకువస్తున్నవి.

"మిస్టర్! మీ సైనికులకు ఆజ్ఞాపించు. లేదా నిర్దాక్షిణ్యంగా పీకనొక్కి చంపేస్తాను" అనంటూ యువరాజ్ తన చేతిని యింకా గట్టిగా అదిమాడు.

లెఫ్టినెంట్ ఆబాధను ఓర్చుకొంటూనే తన కళ్ళతో సైగ చేశాడు. సైనికులు తమ గన్‌లను క్రింద పడవేశారు.

దిగ్విజయం గబాలున రెండు గన్‌లను అందుకున్నాడు. సైనికులను వురిమి చూస్తూ నిలబడ్డాడు. "అందరూ ఇలా రండి" గర్జించాడు దిగ్విజయం. సైనికులు అదురుబెదురులతో ఒక మూలగా చేరారు.

"మీలో ఒకరు ముందుకు రండి! అందర్నీ బంధించండి" యువరాజ్ వురుముతూ చెప్పాడు.

భయపడిన సైనికులలో ఎవరో ఒకరు ముందుకువచ్చి బంధించడం ప్రారంభమయింది. దిగ్విజయం, యువరాజ్‌లు కల్సి, అందర్నీ బంధించారు.

యువరాజ్ లెఫ్టినెంట్‌లా తయారయ్యాడు. దిగ్విజయం అచ్చుగా ఒక సైనికాధికారిలా మారాడు.

ఇక ఆ శిబిరం నుండి బయట పడాలి. ఎలా? బయట చాలామంది వ్యక్తులున్నారు. బంధించివున్న సైనికులను చూస్తే విషయాన్ని తెల్సుకుంటారు. ప్రమాదం!

ప్రవాహంలావున్న సైనికుల నుండి బయటపడుతామన్న నమ్మకం లేదు. కానీ గత్యంతరం లేదు. యువరాజ్ దిగ్విజయాన్ని వెంటబెట్టుకుని బయటకు వచ్చాడు.

బయటవున్న కొందరధికారులు యువరాజ్ దిగ్విజయాలను చూసారు. కాని అనుమానించలేదు!!

యువరాజ్ దిగ్విజయాలు గబగబ నడుస్తున్నారు.

క్రీగంట యువరాజ్ వెనుకవున్న స్థావరాన్ని చూశాడు. అక్కడున్న సైనికులు లోపలకు ప్రవేశిస్తున్నారు.

యువరాజ్ గుండెలు వేగంగా కొట్టుకున్నవి. దిగ్విజయం భయభ్రాంతుడైపోతున్నాడు. వారిరువురు యింకా తొందరగా నడిచారు. సైనిక వాహనాల రాకపోకలకు అనువుగా ఆ ప్రాంతంలో రోడ్డు నిర్మించారు.

రోడ్డుమీదనే కొంతదూరం నడిచారు.

ప్రక్క ఒక మిలటరీ జీప్ ఆగివుంది. జీపులో యెవరూ లేరు. జీపుకు అల్లంత దూరంలో గిడ్డంగిలాగుంది. ఆ గిడ్డంగిలో ఏముందో అంతు పట్టలేదు.

జీపువద్దకు నడిచారు. జీపు ప్రక్కనే నిలబడి గిడ్డంగి వైపు చూసాడు. దాని నిండా మందుగుండు సామగ్రివుంది.

అక్కడక్కడ టాంకులు, మోర్టారులు, రాకెట్ల ప్రయోగ యంత్రాలు కనబడుతున్నవి.

తను జీపులోకి ఎక్కాడు. స్టార్ట్ చేశాడు. ముందుకు వురికించాడు. రోడ్డుమీదకు రాగానే దిగ్విజయం ఎక్కి కూర్చున్నాడు. జీపు వేగాన్నందుకుంది!

అదే సమయంలో జీపు వెనుక కొన్ని మిలటరీ ట్రక్కులు దూసుకురావడం యువరాజ్ గమనించాడు.

"ఇప్పుడెక్కడకు వెళ్ళుతారు? వెనుక ట్రక్కులు తరుముకు వస్తున్నవి. వైర్‌లెస్‌లో పైనవున్న అధికారులకు తెలియజేశారంటే మనం తప్పుకోవడం అసాధ్యం!" ఖంగారుగా చెప్పాడు దిగ్విజయం.

యువరాజ్ మౌనంగా జీపుని తోలుతున్నాడు. అది అంతా అడవి ప్రదేశం. రోడ్ చాలా బాగుంది. జీప్ వురకలు తీస్తూ పరుగెత్తుతూంది.

ఎదురుగా మరో రెండు జీపులు వస్తున్నవి. వెనుకకు చూశాడు యువరాజ్. ట్రక్కులు తరుముకు వస్తున్నవి.

"యువరాజ్ గారూ! ఇది సైనికులున్న ప్రదేశం. మనం తప్పించుకోవడం కష్టం!" చెప్పాడు దిగ్విజయం.

"నాకూ తెలుసు. మన శాయశక్తులా ప్రయత్నిద్దాం. మీరు ముందు దిగండి!" అనంటూ యువరాజ్ బ్రేక్ నొక్కాడు. కీచుమంటూ జీపాగింది. ఆగిందేతడవు యువరాజ్ దిగ్విజయాలు దిగి—రోడ్డు కడ్డంగా, పడి పరుగులు తీయడం ప్రారంభించారు.

అదంతా అడవి ప్రదేశం! ముళ్ళపొదలలోను, మెరక పల్లాలతోను నిండి వుంది. వారిద్దరూ లెక్క చేయడం లేదు. క్రిందామీదా పడుతూ లేస్తూ పరుగెత్తుతున్నారు. వెనుక సైనికులు తరుముకుంటూ వస్తున్నారు.

ఇద్దరూ చాలాదూరం పరుగెత్తారు. అదృష్టం బాగుండటం మూలంగా ఎవరూ తెలుసు పడలేదు. చాలాదూరం పరుగెత్తాక సైనిక విమానాశ్రయం కళ్ళపడింది!

వరుసగా విమానాలు ఆగివున్నవి. సూర్యాస్తమానం అయిపోయింది. చీకటి అలుముకుంటూంది. యువరాజ్ దిగ్విజయం తచ్చాడుతూ—దాగుతూ నక్కుతూ విమానాల వైపు నడిచారు. విమానాలవద్ద కొందరు సైనికులు కాపలా వున్నారు. ఎటు నడిచినా శత్రువుల కళ్ళపడవచ్చు.

అంతలో తరుముకుంటూ వచ్చిన సైనికులు విమానాశ్రయంలో గాలింపు చర్యలు సాగిస్తున్నారు.

యువరాజ్ దిగ్విజయానికి ఏదో సైగ చేస్తూ ఆ మైదానంలో బోర్లకిలా పడుకున్నాడు. దిగ్విజయమూ పడుకున్నాడు. పడుకున్నిద్దరు ప్రాకుతూ ముందుకు బయలు దేరారు. ఓపికగా, శ్రమ అనుకోకుండా ప్రాకుతూన్నారు.

విమానాలు దగ్గరవుతున్నవి. ఆ ఇద్దరి గుండెలు గడగడ లాడిపోతున్నవి. మెల్లగా దేకుతూ ఒక విమానంవద్దకు చేరుకున్నారు.

అక్కడ ఇద్దరు కాపలా కాయు సైనికులున్నారు.

ఆలస్యం చేయలేదు. దిగ్విజయం, యువరాజులు బెబ్బులుల్లా వురికారు. ఆ సైనికులను క్రింద పడగొట్టి ఒక విమానంలోకి ఎక్కేశారు. అది ఫాంటమ్ విమానం!!

యువరాజ్ విమానాన్ని స్టార్ట్ చేశాడు. స్టార్ట్ కాగానే ముందుకు పరుగులు తీసింది. పైకెగిరింది. గగనంలో దూసుకెళ్ళడం ప్రారంభించింది.

వెనుక చాలా విమానాలు తరుముక వస్తున్నవి. ఇప్పుడు తరుముకొచ్చే విమానాలు వదిలిపెట్టవు. ఎలా వెళ్ళాలి? విమానాన్ని ఏ వైపు నడపాలి?

గబగబ మాప్ ని పరికించి చూశాడు. అంతే, గుండెలు ధమధమలాడిపోయాయి. ఆ విమానం ఇక కొద్దిసేపటికి ఆ వేగంతో వెళ్ళితే రష్యా గగనంలోకి ప్రవేశిస్తుంది!!

ఏం చేయాలి? యువరాజ్ కు ముచ్చెమటలు పట్టుతున్నై. విమానాన్ని యిటు తిప్పితే తరుముకొచ్చే విమానాలు నిర్దాక్షిణ్యంగా బాంబులు ప్రేల్చుతాయి. అటు వెళ్ళితే రష్యన్లు చైనా విమానం అని తెల్సుకుని పేల్చేస్తారు.

విమానం హోరుపెట్టుతూ వెళ్తూంది. రష్యా గగనంలోకి జొరబడబోతూంది. యువరాజ్ తల్లడిల్లిపోతున్నాడు. రష్యన్లు తనున్న విమానాన్ని పేల్చేస్తారు.

యువరాజ్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

విమానం దూసుకు వెళ్ళుతూంది.

తన విమానాన్ని వీలైనంత ఎత్తులోకి పోనిచ్చాడు. ఆ విమానం మేఘాలలోకి జొరబడింది.

రష్యా విధ్వంసినులు ప్రేలడం లీలగా తెలుస్తున్నవి. విమానం ప్రమాదంనుండి తప్పించుకుంటుంది. రష్యా సేనలు గుర్తించాయని యువరాజ్ గ్రహించాడు. ఇక రష్యన్లు తన విమానాన్ని తప్పక కూల్చేస్తారు. గండంనుండి

బయట పడడం ఎలా? యువరాజ్ వున్న విమానం సోవియట్ యూనియన్ భూభాగంమీద ఆకాశంలో ఎగురుతూంది. సేనలు చైనా విమానం గగనంలోకి చొచ్చుకొచ్చిందని శతఘ్నులను పేల్చుతున్నారు.

ఇక తప్పించుకోవడం అసాధ్యమైన పని! విమానం కూలిపోతుంది. కూలిపోకముందే తప్పించుకోవాలి.

"యువరాజ్ గారూ! ఎంతటి ప్రమాదంలోకి జారబడ్డారు! రష్యా ఒక అగ్రరాజ్యం! ప్రతి రంగంలోను పురోభివృద్ధి సాధించింది. మన విమానాన్ని కూల్చడం వాళ్ళకు ఓ లెక్క కాదు," భయంతో చెప్పాడు దిగ్విజయుం.

"మిస్టర్ దిగ్విజయుం! పారామాట్లు అందుకోండి," చెప్పాడు యువరాజ్. దిగ్విజయుం అయోమయుయంగా గాలి గుమ్మటాలను అందుకున్నాడు. ఇద్దరూ చకచక నడుముకు కట్టుకున్నారు. గబగబ డోర్ వద్దకు పరుగెత్తారు. విమానం కొన్ని వేల అడుగుల ఎత్తున ఎగురుతూంది.

అంతలో వారున్న విమానం ఒక్క వూపు వూపింది. అదిరిపోయింది. అటు యిటు తూలిపోయింది. ఆ వేగంలో విమానం పల్టీలు కొట్టబోతూంది. ఇద్దరూ ఖంగారుపడ్డారు. రష్యన్లు గురి తప్పకుండా పేల్చారు. విమానం దెబ్బ తిన్నది.

"క్విక్, క్విక్" అనరుస్తూ యువరాజ్ బయటకు దుమికేశాడు.

విమానం మంటలతో భయంకరంగా దర్శనమిస్తూ, పల్టీలు కొట్టుతూ_కూలిపోతూంది. ఆ మంటలు ఆకాశంలో అతిభయంకరంగా వున్నది. ధగస్మాయనంగా విమానం మండిపోతూ కూలిపోతూంది.

యువరాజ్ దిగ్విజయుంవున్న పారామాట్ లు దిగుతూన్నవి. నేలమీదకు చేరుకున్నవి. నేలమీదకు దిగగానే

రష్యా సైనికులు వారిని చుట్టుముట్టారు.

## 16

యువరాజ్ దిగ్విజయం కెదురుగా అయిదారుగురు వైమానిక దళాధికారులు నిలబడ్డారు. యువరాజ్ గుండెలు గుభేలుమంటున్నవి. వాళ్ళేం అనుకుంటారో, ఎలా సమాధాన మివ్వాలో వూహా కందడంలేదు. దిగ్విజయం ముఖం కాంతివిహీనంగా వుంది.

"ఎవరు మీరు?" అడిగారు.

ఎవరయింది తెల్సి అడిగారాం? తెలియక అడిగారా? యువరాజ్ కు ఆశ్చర్యమేసింది. తాము చైనా భూభాగం నుండి, ఒక చైనా విమానంలో వచ్చాము గనక తాము వారి దృష్టిలో చైనీయులు! మరెందుకు అడిగారు?

"భారతీయులం! నేను డిటెక్టివ్ ని! పేరు యువరాజ్!!" తొణకక గంభీరంగా చెప్పాడు యువరాజ్.

"చైనాలోనుండి మా దేశంలోకి ఎందుకొచ్చారు?" కటువుగా అడిగాడు.

యువరాజ్ పూసగ్రుచ్చినట్లు తనెందుకు చైనా వచ్చింది, చైనాలో తను చూచినది, తెల్సుకున్నది-ఎలా బయటపడి వచ్చింది, వివరంగా చకచక చెప్పేశాడు. దిగ్విజయంకూడా తమ నిస్సహాయతను తెలియబరచాడు.

"మీరు చెప్పింది నమ్మడం ఎలా?"

"మా విషయం భారత ప్రభుత్వం మీ ప్రభుత్వానికి తెలియపరచి వుండాలి. గనక మీరు భారత రాయబారికి ఫోన్ చేసి కనుక్కోండి" అని చెప్పాడు యువరాజ్.

"అలాగే కనుక్కొంటాం! మీరు ఇలాగే వుండాలి. మాకు తగిన ఋజువులు, ఆధారాలు అందేవరకు ఇక్కడే వుండాలి" చెప్పాడు సోవియట్ ఎయిర్ మార్షల్.

వెంటనే మాస్కోలో వున్న భారత రాయబారికి

ట్రంక్ కాల్ చేశారు.

ఫోన్ మ్రోగింది. ఎయిర్ మార్షల్ రిసీవ్ చేసుకున్నాడు. ఫోన్‌లో చాలాసేపు విన్నాడు. యువరాజ్ గుండెలు దడదడ లాడుతున్నవి. ఎయిర్ మార్షల్ రిసీవర్ని పెట్టేశాడు. యువరాజ్‌ని చూశాడు.

"వెరీసారీ మిస్టర్ యువరాజ్! పొరబాటుకు చింతిస్తున్నాం" అన్నాడు. స్వహస్తాలతో ఆయన యువరాజ్‌ని, దిగ్విజయాన్ని బంధాలనుండి విడిపించాడు. ఇరువురికి షేక్‌హాండ్ యిచ్చాడు.

"మీ ప్రభుత్వం, మా ప్రభుత్వానికి మీరన్నట్టు వార్తను పంపివుంది. మీరు వస్తే తగిన వసతులను కల్పించవలసినదిగా మా దేశ నాయకులు ఆదేశించివున్నారు. మీ అసిస్టెంట్ సూరికూడా భారత రాయబార కార్యాలయంకు సురక్షితంగా చేరుకున్నాడట" చెప్పాడు ఎయిర్ మార్షల్. ఒక అధికారిని పిలిచి వారిని మాస్కో పంపడానికి తగిన ఏర్పాట్లు వెంటనే చేయవలసిందిగా ఆదేశించాడు.

యువరాజ్ దిగ్విజయంల కళ్లు ఆనందంతో మెరిశాయి.

—:ఐ పో యిం ది:—




# మూడవ భాగము

“స్కౌండ్రల్స్! ఇంత దారుణంగా హత్యలు చెయ్య గలిగిన మీరు నన్ను మాత్రం ప్రాణాలతో తిరిగి పోనిస్తారా? నన్ను మీరు చంపుతారు. మీ చేతుల్లో చావడం కన్నా సముద్రంలో దూకిచావడం మంచిది” అంది డెల్లా.

“దూకనీ! ఛస్తుంది. ఆ ముండతో మనకేం పనుంది” అన్నాడు రెండో డెవిల్, మొదటి డెవిల్ తెచ్చిన సూట్ కేస్ తెరచి చూసుకుంటూ.

“నో! అలా జరిగేందుకు వీల్లేదు. ఆమెకు ఇండియా చూపిస్తానని మాటిచ్చాను. మీరేమైనా నాకు అనవసరం. ఆమెకు ఇచ్చిన మాట నిలబెట్టుకొంటాను” అన్నాను నేను.

“మాక్కావలసింది దొరికింది. నీతో గూడా మాకు పని లేదు. నీ దోవ నువ్వు చూసుకో!” అన్నారిద్దరూ ముక్త కంఠంతో.

"ఓ. కే. తీరం చేరేదాకే మనం ఫ్రెండ్స్. ఆ తర్వాత ఎవరి త్రోవలు వాళ్ళవి" అన్నాను నేను డెల్లా ప్రక్కగా వెళ్ళి కూర్చుంటూ.

"యూ సీమ్ టు బి ఎ గుడ్ మన్!" అంది డెల్లా నా కేసి చూసి.

ఆమె చెయ్యి నా చేతిలోకి తీసుకొని, ధైర్యం చెప్పాను. బోటు వెనక్కి కదిలింది. వాళ్ళిద్దరూ టార్చిలైట్లు వెనక్కి చూపసాగారు. షిప్ పైనుండి పెద్ద లైటొకటి వెలిగింది సముద్రం పైని నీళ్ళలో మెరిసిపోతూ.

"మా వాళ్ళు రానందుకు షిప్ లో కంగారుపడుతున్నట్లున్నారు. అందుకే సెర్చిలైటు వెలిగించారు" అంది డెల్లా.

"వాళ్ళు తిరిగి షిప్ చేరకంటే ఏం చేస్తారు?" అడిగాను నేను.

"వెతుక్కుంటూ వస్తారు. పవర్ ఫుల్ మోటార్ బోట్ వుంది. దాన్నిండా కావలసినంత మందు గుండు సామగ్రి వుంది. మిమ్మల్ని ప్రాణాలతో సముద్రం దాట నివ్వరు" చెప్పింది డెల్లా.

ఆమె చెప్పిన మాటలు డెవిల్స్ రెండూ విన్నాయి.

"వాళ్ళను చంపకుండా వుండవలసింది" అన్నాను నేను.

"మిస్టర్ రాజ్! మనకొచ్చిన భయమేమీ లేదు. డెల్లా మనచేతుల్లో వుంది. వాళ్ళు అనవసరంగా మన పైకి వస్తే, మనం డెల్లాని కాల్చి చంపుతామని బెదిరిద్దాం. దాంతో కిక్కురుమనకుండా వెనక్కి వెళ్ళిపోతారు" అన్నాడు మొదటి డెవిల్.

మా బోటు తీరం వేపు స్పీడుగా పోసాగింది. మా గ్యాంగ్ వాళ్ళ బోటుకూడా వెనక్కి కదిలిపోసాగింది.

ఇంతలో చీకటిని తరుముతూ, తీరం వేపునుండి పెద్ద

కాంతి సముద్రాన్ని వెలిగించింది. మాకు కళ్ళుకూడా కనిపించలేదు. నీళ్ళను చీల్చుకుంటూ ఏదోకదలి మా వైపు రాసాగింది. నేను పరీక్షగా చూశాను.

"అటునుండి మోటర్ బోటు ఏదో మనవైపు వస్తూంది" అన్నాడు రెండో డెవిల్.

"మా గ్యాంగ్ దేమో?" అన్నాను నేను.

"కాదు!"

"అయితే ఎక్సైయిజ్ వాళ్ళదయి వుంటుంది. మనం ఇప్పుడు ట్రాప్ లో పడ్డాం. సముద్రంలోకివెళ్తే షిప్ లో వాళ్ళు కాల్చిచంపుతారు. తీరంవైపుపోతే ఎక్సైయిజ్ వాళ్లు పట్టుకుంటారు. మూడోవైపు మావాళ్ళున్నారు. ఏం చెయ్యడం?" అడిగాను నేను. మొదటిసారిగా అధైర్యం నాలో చోటుచేసుకుంది. నా ముందుకూర్చున్న డెల్లా విచారంగా తలవంచుకుంది.

"నేను షవాళే రాకుండా వుండవలసింది" అంది డెల్లా.

"డోన్ట్ వరీ! నేనున్నాను. నా ప్రాణాలు పోనంత వరకు, నిన్ను రక్షించే పూచీనాది" ఆమె చెయ్యి నా చేతుల్లోకి తీసుకొని మెల్లగా రాస్తూ చెప్పాను.

డెల్లా కళ్ళు ఆనందంతో మెరిసాయి. నావేపు కృతజ్ఞతగా చూసిందామె.

మాబోటు స్పీడు తగ్గించాను. ఎక్సైయిజ్ అధికారులున్నబోటు రయ్యమని వచ్చేస్తూనే వుంది.

డెవిల్స్ ఇద్దరూ కాలుగాలిన పిల్లుల్లా అటూ, ఇటూ, క్రిందకీపైకీ తిరగసాగారు. మాటిమాటికీ మిషిన్ గన్ లు తీసి చూసుకోసాగారు. వాళ్ళకు ఏంచెయ్యనూ తోచినట్లు లేదు.

"మనదగ్గర ఎక్కువ అమ్యూనిషన్ కూడా లేదు. చాలావరకు ఖర్చయిపోయింది. షిప్ లోవున్న వాళ్ళ

తోనూ, ఎక్సయిజ్ వాళ్ళతోనూ మనం యుద్ధం చెయ్య లేమనుకుంటాను" అన్నాడు మొదటి డెవిల్.

"ఉన్నంతవరకు చూద్దాం! ఆ తర్వాత అంతా దేవు డెలా రాసిపెట్టివుంటే అలా అవుతుంది" అన్నాడు రెండోవాడు.

వీళ్ళకు దేవుడిమీద నమ్మకం వుండడం నాకు నిజంగా ఆశ్చర్యాన్ని కలిగించింది. డెల్లా షిప్ కేసి చూసింది. లైట్లన్నీ వెలుగుతున్నాయి. జనం హడావిడిగా తిరగటం స్పష్టంగా కనుపించసాగింది.

"ఎందుకలా జనం కంగారుపడుతున్నారు" అడిగాను నేను.

"ఏమో?" అంది డెల్లా.

"మరి మీ వాళ్ళెవరూ వస్తున్నట్లులేదే!"

"వస్తారు. వాళ్ళదగ్గర హెలికాప్టర్ గూడా వుంది. అంతమంది తిరుగుతున్నారంటే బహుశా హెలికాప్టర్ ని సిద్ధం చేస్తుండవచ్చు."

"అయితే మనం తప్పించుకోలేం. మోటార్ బోట్ అన్నా అయితే ఎలాగో ప్రయత్నించవచ్చు."

"షిప్ లో హెలికాప్టర్ వుందా!" డెవిల్, డెల్లా దగ్గరకొచ్చి నిలబడ్డాడు అడుగుతూ.

ఆమె జరిగి నవ్వానుకుంటూ కూర్చుని "వుంది!" అంది.

ఎక్సయిజ్ వాళ్ళ బోటులోంచి నిశ్శబ్దాన్ని చీలుస్తూ మొదటి షాట్ ప్రేలింది. గుండు మా బోటుపైగా దూసుకు వెళ్ళింది.

యుద్ధం ప్రారంభమయింది.

డెవిల్స్ ఇద్దరూ అంతకు ముందులాగే క్రిందొకరు పైనొకరు చేరారు. ఫైరింగ్ మొదలెట్టారు. మా బోట్ ను

వెనక్కి పోనిమ్మన్నారు. నేను వాళ్లు చెప్పినట్టే చేశాను. వాళ్ళ వాడావిడిలో వాళ్ళున్నారు. డెల్లా నా ప్రక్కగా వచ్చింది. సముద్రంకేసి రెండుక్షణాలు చూసింది.

"మిస్టర్ రాజ్!" అని పిలిచింది.

ఏమిటన్నట్లు చూశాను. తన నోరు నా చెవిదగ్గర పెట్టి "వీళ్ళిద్దర్నీ వదిలించుకుంటే మనం తప్పించుకోవచ్చు" అంది.

"ఎలా?" అడిగాడు.

"మా వాళ్లు హెలికాప్టర్‌లో వస్తారు. ముందు ఎక్స్‌ైజ్ వాళ్ళ బోట్‌ను అటాక్ చేస్తారు. ఆ తర్వాత మన బోట్‌ను సముద్రంలో ముంచుతారు. మనం ఈలోగా "వీళ్ళను హతమార్చాలి. ఆ తర్వాత ఈదుకుంటూ షిప్ లోకి పోవచ్చు. నీకే ఆపదా రాకుండా నేను వాళ్ళతో చెప్పి కాపాడుతాను" అంది డెల్లా.

"నా దగ్గర ఆయుధాలు లేవు. వీళ్లు సామాన్యులు కారు" చెప్పాను నిరాశగా.

"నాకద్ద రివాల్వరుంది. ఇచ్చేదా?" అంది.

ఇమ్మని సైగ చేశాను.

ఆమె బనీన్‌లో మెడ క్రిందుగా చెయ్యిపెట్టింది. రొమ్ములను బిగించి కట్టిన బ్రాసరీలోకి చెయ్యిపోనిచ్చింది. చిన్న రివాల్వరు తీసింది. అంత చిన్న రివాల్వరు అంతకు ముందెప్పుడు నేను చూడలేదు. పిల్లలు ఆడుకునే టాయ్ రివాల్వర్ లాగుంది. నాకు దాన్ని అందించింది. తీసి జేబులో వేసుకున్నాను.

"దానికి సైలెన్సర్ వుంది" చెప్పింది డెల్లా.

షిప్‌లోంచి 'జుయ్యి'మని గాలిని చీలుస్తూ తిరిగిన ప్రొఫెల్లర్ శబ్దం వినవచ్చింది.

"హెలికాప్టర్ బయలుదేరుతూంది" చప్పట్లుకొడుతూ

చిన్న పిల్లలా ఎగురుతూ చెప్పింది డెల్లా. ఆమెను అలా చెయ్యొద్దని హెచ్చరించాను. స్ప్రింగ్ వీల్ దగ్గర డెల్లా నుండమని నేను డెక్ పైకెళ్ళాను. మొదటి డెవిల్ బోర్లా పడుకుని వున్నాడు.

నేను వెళ్ళి అతని ప్రక్కనే కూర్చున్నాను. అతను నాకేసి చూశాడు.

"ఆ బోటులో ఎవరన్నా చచ్చారా?" అడిగాను.

"పది రౌండ్లు ప్రేల్చాను. ఎవ్వరూ చచ్చినట్లు లేదు. ఆ బోట్ కు ముందేదో పెద్ద గ్లాసులాంటి దున్నట్లుంది. గమనించి చూడు" అన్నాడు అతను.

కళ్ళు చిట్లించి చూశాను. అతను చెప్పింది నిజమే.

"బుల్లెట్ ప్రూఫ్ గ్లాసులాగుంది" అన్నాను నేను.

"అయితే మన అమ్యూనిషన్ అంతా వేస్టే. వాళ్ళను కాల్చి ప్రయోజనంలేదు" అన్నాడు లేస్తూ.

"మనం పీళ్ళ బారినుండి తప్పించుకునే మార్గం లేనట్లేనా?" అడిగాను నేను.

"ఏది ఏమైనా ప్రాణాలతో వాళ్ళకు చిక్కకూడదు." దిగి క్రిందకు పోయేందుకు మెట్లు దిగసాగాడు. డెల్లా ఇచ్చిన రివాల్వరు మెల్లగా తీశాను. వెనుకనుండి గురి చూసి కాల్చాను.

"అమ్మా" అంటూ గిరగిర తిరుగుతూ క్రిందపడి పోయాడు బోట్ లోకి.

రివాల్వరు వెంటనే జేబులో వేసుకున్నాను. మెట్ల దగ్గరకు పరుగెత్తుకెళ్ళాను. చకచక మెట్లుదిగి క్రింద కొచ్చాను. రక్తపు మడుగులో పడి వున్నాడు. అతని ప్రాణాలు క్షణంలో పోయాయి. రెండో డెవిల్ వచ్చి అతని ప్రక్క నిలబడ్డాడు.

—(సశేషం)

# మీరే ఎన్నుకోండి?

ఈనెల "సప్లిమెంట్"లో మొత్తం నాలుగు నవలలు ప్రచురించబడ్డాయి. ఈ నాలుగు నవలల పేర్లు మీకు నచ్చిన వరుసక్రమంలో ఒక (పోస్టుకార్డుసైజు) తెల్లకాగితంపై వ్రాసి దానితో 30 పైసలు విలువగల పోస్టలుస్టాంప్స్ జత పరచి యీనెల 10వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి.

ఒకటవ నెంబరుపైన అధిక సంఖ్యాకులు వ్రాసిన నవలను ఉత్తమనవలగా ఎన్నిక చేయటం జరుగుతుంది. ఉత్తమ నవలారచయితకు రు. 116/-లు బహుమతి. నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో వ్రాసిన "హోమ్ డెలివరీ" పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/-లు బహుమతి.

ఒక్కొక్కరు ఒక్క కూపను మాత్రమే పంపాలి. ఫలితాలు వచ్చేనెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈనెల "సప్లిమెంట్" ముఖచిత్రాలకు రెండింటికి సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని చక్కటి వ్యాఖ్యలను ఒక (పోస్టుకార్డుసైజు) తెల్లకాగితంపై వ్రాసి, యీనెల 10వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్య పంపిన "హోమ్ డెలివరీ" సభ్యులకు ఒక్కరికి రు. 20/-లు నగదు బహుమతి పంపుతాము.

వ్యాఖ్యలు ఒక్కొక్కరు ఎన్నైనా పంపవచ్చును. ఫలితాలు వచ్చేనెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.

ముఖ్య గమనిక:—పై రెండు పోటీలలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులు తమ సభ్యత్వము నెంబరును ప్రతి కూపనుపై విధిగా వ్రాయాలి. సభ్యత్వములేని కూపన్లు ఎంతమాత్రం పరిశీలించబడవు. ఇప్పటివరకు సభ్యులుగా చేరని పాఠకులు కూడా వెంటనే సభ్యులుగా చేరుతూ కూపన్లు పంపవచ్చును.

## 34

ఒకతను గబాగబా మందుల షాపులో కెళ్ళి "ఏమండీ, నెవాల్జిన్ టాబ్‌లెట్లున్నాయా?" అన్నాడు.

అందుకు సేల్స్‌మన్ 'హి, హి' అని నవ్వుతూ ఇటు, అటు బుర్రూపాడు, లేవన్నట్లు.

"అనార్జిన్."

దానికి అదే సమాధానము.

ఇంకా ఏవేవో టాబ్లెట్స్ అడిగాడు. వాటికి అదే సమాధానం నవ్వుతూ.

అప్పుడా వ్యక్తికి కోపం వచ్చింది కాబోలు "ఏమిటండీ, ఏ టాబ్లెట్స్ అడిగినా లేవంటారు....ఎందుకండి ఈ మందుల షాపు?" అనేసాడు గట్టిగా.

ఆ షాపతను "ఇదిగో. చూడండి మందులషాపు ఆ ఎదురుగావుంది. ఇది బ్రాందీషాపు" అన్నాడు శాంతంగా.

*   *   *

తల్లి వంట చేయటంలోను, తండ్రి చదువు కోవటంలోను మునిగిపోయారు. వారిద్దరి ముద్దుల బిడ్డడు రెండవ తరగతి పుస్తకం చదువుతూ, ఏదో సందేహమొచ్చి దగ్గ

ఉన్న తండ్రిని ఇలా అడిగాడు.

"నాన్నా! తాటకి అంటే ఎవరు నాన్నా?"

"మీ అమ్మేరా...." ముక్తసరిగా సమాధానమిచ్చేసాడు.

పేజీ తిప్పుతూ మరి కొద్దిసేపటికి మరొక సందేహమొచ్చి తండ్రి నడిగితే సరిగా చెప్పడంలేదని తల్లిదగ్గఱ కెళ్ళాడు.

"అమ్మా రావణాసురుడు అంటే ఎవరమ్మా?"

"మీ నాన్నేరా...." ఏదో సమాధాన మిచ్చింది.

అమ్మ తాటకి, నాన్న రావణాసురుడు.... వాడికింకా సందేహం తీరలేదు.

"అమ్మా మరి నేనెవరినే....?"

"నువ్వా?...నువ్వు వల్లకాటి వసిన దిబ్బవి...పో(... పోయి చదువుకో! వెధవ సందేహాలు వీడూను." అని కసిరింది తల్లి.

బుద్ధిగా వచ్చి...పెన్ను తీసుకుని తన పుస్తకాల మీద 'వల్లకాటి వసిన దిబ్బ' అని ముద్దుగా వ్రాసుకున్నాడు ఆ ముద్దుల బిడ్డడు తన పేరుకు బదులుగా.

* * *

కొడుకు తన తమ్ముళ్ళ దగ్గఱ తాగినట్లు యాక్షన్ చేస్తున్నాడు. అప్పుడే త్రాగిన మైకంలో ఖాళీ సీసాతో వచ్చిన తండ్రి అదిమాసి—

"అయితే నాయనా, ఈ సీసా నువ్వా పూర్తి చేశావు... అందుకే ఒక్క చుక్కా మిగల్లేదు!!"

అది విని నవ్వుకుని తల్లి ఇలా అంది. "అది మీరు తాగిందే. వాడేం తాగలేదు..."

"అహా! అయితే నీకూ వాటా ఇచ్చాడన్నమాట! సరి సరి!!" అన్నాడు తాగిన మైకంలో, ఆ భర్త.

—తిప్పాన వెంకటరమణ, అనకాపల్లి.

